1993-2013 నడుస్తున్న చరిత్ర

సంపుటి : 2
సంచిక : 7
రు. 20/-లు
తెనాలి



తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

నుడి నాడు నెనరు

సెప్టెంబరు 2016



తెలుగు
ఆధునిక కవిత్వానికి
విశాల ఛత్రంగా
ఊరేగింపుగా సాగిన
కవి, విమర్శకుడు
ఆవంత్స సోమసుందర్
ఆనందంగా, గర్వంగా,
ఠీవిగా నిష్క్రమించారు



సెప్టెంబరు 9 : కాళోజీ జయంతి
**తెలంగాణ**
**తెలుగు భాషాదినోత్సవం**



హరికథకు మారుపేరు
కీ. శే. **ఆదిభట్ల నారాయణదాసు.**
సంస్కృతం, ఇంగ్లీషుతో సహా
అనేక భాషల్లో పండితుడు.
అచ్చతెలుగుపై ఆయనకున్న
పట్టుకు, పట్టుదలకు సాటిలేదు.





ఒలింపిక్స్‌లో భారతదేశానికి
వెండి పతకాన్ని గెలుచుకొచ్చిన
తెలుగమ్మాయి సింధు

తెలుగు అభివృద్ధి ప్రాధికార సంస్థ ఏర్పాటు; పాఠశాల విద్యలో, ఇంటర్‌లో తెలుగు :
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి సంసిద్ధత

# తెలుగు భాషాదినోత్సవం సందర్భంగా ముఖ్యమంత్రి వరాలు

## తెలుగు అభివృద్ధి ప్రాధికార సంస్థ ఏర్పాటు

## పాత వాగ్దానాల అమలుకు హామీ





తెలుగు భాషాదినోత్సవ సభలో గిడుగు చిత్రపటానికి పుష్పాంజలి సమర్పిస్తున్న ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు



వేదగిరి రాంబాబు సంకలనం చేసిన గిడుగు వేంకట రామమూర్తి రచనా సర్వస్వం రెండవ సంపుటాన్ని ఆవిష్కరిస్తున్న ముఖ్యమంత్రి

తెలుగు భాష లేకపోతే మన జాతికి ఉనికే ఉండదని, భాషాభివృద్ధికి ప్రతి ఒక్కరూ కృషిచేయాలని ముఖ్యమంత్రి చంద్రబాబు పిలుపిచ్చారు. భాషను కాపాడుకునేందుకు టిడీపీ ప్రభుత్వం రాజీలేని కృషి చేస్తుందని స్పష్టం చేశారు. తెలుగు అభివృద్ధి ప్రాధికార సంస్థ( తెలుగు డెవలప్‌మెంట్ అథారిటీ)ను ఏర్పాటుచేస్తామని వెల్లడించారు. దీని రూపకల్పన కోసం శాసనసభ ఉపసభాపతి మండలి బుద్ధప్రసాద్, మంత్రి పల్లె రఘునాథరెడ్డి, ప్రభుత్వ సలహాదారు పరకాల ప్రభాకర్, భాషా సాంస్కృతిక శాఖ కార్యదర్శి శ్రీ ఎన్.శ్రీకాంత్‌లతో కమిటీని నియమిస్తున్నట్లు ప్రకటించారు. పొరుగురాష్ట్రాల్లోని భాషల అభివృద్ధికి చేపడుతున్న విధానాలను ఈ కమిటీ ఆధ్యయనం చేసి నెల రోజుల్లో నివేదిక, కార్యాచరణ ప్రణాళిక ఇస్తుందని, దాని ఆధారంగా ప్రభుత్వం చర్యలు చేపడుతుందని వివరించారు. తెలుగు భాషాదినోత్సవం ఆగస్టు 29 సోమవారం సాయంత్రం విజయవాడలోని తుమ్మలపల్లి కళాక్షేత్రంలో జరిగింది. ఈ కార్యక్రమంలో చంద్రబాబు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. గిడుగు రామ్మూర్తి పంతులు 153వ జయంతోత్సవాన్ని పురస్కరించుకుని ఆయనకు నివాళులు అర్పించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ– టీడీపీ ప్రభుత్వం 2003లో ఇచ్చిన జీవో నంబర్ 86ను తు.చ. తప్పకుండా అమలు చేస్తామన్నారు. 'ఈ జీవో ప్రకారం ఒకటి నుంచి పదో తరగతి వరకు అన్ని పాఠశాలల్లో తెలుగును తప్పనిసరిగా బోధించేలా చేస్తాం. ప్రభుత్వ పాఠశాలలతో పాటు ప్రైవేటు స్కూళ్లలో కూడా విధిగా అమలు చేసేలా చర్యలు తీసుకుంటాం. ఇంటర్‌లో కూడా తెలుగు ఉండాలి' అని స్పష్టం చేశారు. భాషకు వెలుగునిచ్చిన నేల విజయవాడగా పేర్కొన్నారు. తెలుగు వారసత్వ సంపద మద్రాసు, హైదారాబాద్ ఇతర ప్రాంతాల్లో ఉందని, దానిని తిరిగి రాష్ట్రానికి తీసుకొస్తామన్నారు. సంస్కృతి, సంప్రదాయాలకు సంబంధించిన వారసత్వ సంపద పరిరక్షణకు రాజధాని అమరావతిలో ఒక మ్యూజియంను ఏర్పాటు చేస్తామని తెలిపారు. ప్రాచీన భాషాకేంద్రం నిర్మాణానికి నాగార్జున విశ్వవిద్యాలయంలో వెయ్యి గజాల స్థలం కేటాయిస్తామని ప్రకటించారు. సంస్కృతి పరిరక్షణకు ప్రతి జిల్లాలో ఏడాదికి 100 రోజులు కార్యక్రమాలు నిర్వహిస్తామని, జిల్లా కేంద్రాలు, కార్పొరేషన్లలో ప్రతి శని, ఆది వారాల్లో విధిగా నిర్వహించాలని ఆదేశించారు. ప్రభుత్వ ప్రారంభోత్సవాలు, శంకుస్థాపనల్లో తెలుగు బోర్డులు తప్పనిసరిగా ఏర్పాటు చేస్తామని తెలిపారు. కూచిపూడి నృత్యాన్ని పరిరక్షిస్తామని చెప్పారు. ఇంటర్నెట్‌లో కూడా తెలుగు వాడకాన్ని పెంపు చేసుకోవాలన్నారు. తెలుగు భాష అభివృద్ధికి ఎనలేని కృషి చేసిన గిడుగు రామ్మూర్తి పంతులు సేవలను కొనియాడారు. ఆయన మునిమనవడు నాగేశ్వరరావును సన్మానించారు. తెలుగువారి ఆత్మగౌరవాన్ని ప్రపంచవ్యాప్తం చేసిన వ్యక్తి ఎన్టీఆర్ అని తెలిపారు. పార్టీ పేరులో తెలుగు ఉండాలన్న ఉద్దేశంతోనే తెలుగుదేశం అని పెట్టారన్నారు.

## ద్రావిడ భాషా కుటుంబం

మొట్టమొదటిసారి 1856లో ఫ్రాన్సిస్ ఎలిస్ వైట్ అనే ఒక బ్రిటిష్ పౌర అధికారి, దక్షిణ భారతదేశంలో మాట్లాడే తెలుగు, కన్నడం,తమిళం, మలయాళం, తుళు, కొడగు, గోండి మొదలైన ద్రావిడ భాషలు సంస్కృత జన్యాలు కావనీ అవి తమంతట తాము ఒక భాషాకుటుంబ పరిధిలోకి వస్తాయనీ నిరూపించే ప్రయత్నం చేశారు. ఈ విషయాన్ని 1816 లో ఎలెక్జాన్డర్ కామ్బెల్ ప్రకటించిన 'ఏ గ్రామర్ ఆఫ్ తెలుగు ఆర్ జెంటూ లాంగ్వేజ్' అనే గ్రంథానికి రాసిన పరిచయ వ్యాఖ్యలో విపులంగా చర్చించారు. ఈ విషయంపై 40 ఏండ్ల తర్వాత 'ద్రావిడ భాషాకుటుంబం లేక దక్షిణ భారతీయ భాషాకుటుంబ తులనాత్మక వ్యాకరణం' అనే పేరుతో రాబర్ట్ కాల్వెల్ (1856) విస్తృత గ్రంథాన్ని రచించడంతో ప్రపంచ మంతటా ద్రావిడ భాషలపై సరికొత్త పరి శోధనలకు తెరతీసినట్లయింది.

## ఆంధ్ర, తమిళ భాష లెప్పుడు చీలినవి?

మూల ద్రావిడభాషలో నుండి ఆంధ్ర శాఖయు, తమిళ శాఖయు నెప్పుడు చీలి యుండును? సంస్కృతముతో సంబంధము వచ్చిన తరువాతనా? పూర్వమా? పూర్వమే యని నా తాత్పర్యము. ఏలయన ఐతేరేయ బ్రాహ్మణ కాలము వఱకే ఆంధ్రులు వేఱు తెగగ నున్నట్టు స్పష్టము. తెగ నివాసస్థలము వేఱై నపుడు భాషయు వేఱై యుండవలెను. కావున క్రీ.పూ.౧౫౦౦ వఱకే మూల ద్రావిడములో నుండి యీ రెండు శాఖలు విడిపోయినవి. విడిపోయినను, రెండును, కర్ణాటాది భాషలును ఇరుగు పొరుగున నుండుటఁబట్టియు, నన్నిఁటితో సంస్కృతమునకు స్నేహ మధికమగుట వలనను తరువాతి కాలమునఁగూడ నొక దానినిఁజూచి మఱియొకటి పెక్కు విషయములు నేర్చుకొనుచుండె ననుటకు సందేహము లేదు. మతము, తత్వజ్ఞానము, మొదలయిన విషయములందు సంస్కృతమే అందఱకు గురువు గనుక, ఈ భాష లన్నిటిలోను ఒకే విధమైన సంస్కృత తత్సమములును, తద్భవములును ప్రవేశించుట ఆశ్చర్యము కాదు.

*(కీ.శే.కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారి రచన 'తెలుగు భాషాతత్త్వము' (గ్రంథము నుండి)*

అభ్యుదయ రచయితలలో అగ్రగణ్యుడు ఆవంత్స సోమసుందర్ కనుమరుగయ్యారు. ఆయన పట్ల శ్రద్ధాంజలిగా రెండు వ్యాసాలు...హరికథా పితామహ కీ.శే.ఆదిభట్ల నారాయణదాసు గారి అచ్చతెనుగు రచన 'బడిపద్దెము'... తెలంగాణ తెలుగు భాషాదినోత్సవంగా సెప్టెంబరు 9న జరుగనున్న కాళోజీ జయంతి...తెలుగు కీర్తిని చాటిచెప్పిన క్రీడాకారిణి సింధు...




## లోపలి పుటలలో....




కైసేత, ముఖచిత్ర అలంకరణ : **కలిమిశ్రీ**

ఫొటోలు : **తమ్మా శ్రీనివాసరెడ్డి**

రేఖాచిత్రాలు : **బాలి, చిదంబరం** పకపకలు : **సరసి**



రచనలు, ఉత్తరాలు పంపుటకు చిరునామా

**డాక్టర్ సామల రమేష్‌బాబు**, సంపాదకుడు, **అమ్మనుడి,**

జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004.

దూరవాణి: కార్యాలయం : *0866-2439466* సంపాదకుడు : *9848016136*

e-mail : editorammanudi@gmail.com

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

మాసపత్రిక

• నుడి • నాడు • నెనరు

సంపాదకుడు డా॥ సామల రమేష్‌బాబు

శాలివాహన శకం 1938 : దుర్ముఖినామ సంవత్సర శ్రావణ
*(సెవ్వాపి) అమావాస్య గురువారం మొదలు భాద్రపద
*(ముంగానాపి) బహుళ అమావాస్య శుక్రవారం వరకు
* సెవ్వాపి * ముంగానాపి : తెలుగు నెలలు

## చందా వివరాలు

| | | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|---|
| శాశ్వత చందా | : | రూ.5000 | రూ.7500 | -- |
| 5 సం॥ | : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ | : | రూ. 700 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ | : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు NEFT / RTGS ద్వారా **'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.
**AMMA NUDI - AXIS BANK, TENALI**
అక్కౌంట్ నెం. **915020010550189**
**IFSC Code : UTIB0000556**
ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆ వెంటనే దయతో - చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను జాబుద్వారాగాని, ఫోన్ మెసేజి ద్వారాగాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా
**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి**
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com

**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంపగలము. ఇందుకోసం మీ ఇ-మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

### చందాదారులకు సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరుతో పూర్తి చిరునామాను, పిన్‌కోడ్ నెంబరుతో సహా తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి.
4. మీ చిరునామా మారినట్లయితే దయచేసి వెంటనే తెలియజేయండి.

## రచయితలకు సూచనలు

1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగు వారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి. 2. రచనలను యూనికోడ్‌లో గాని, అనుఫాంట్స్‌లో గాని టైప్ చేసి లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి editorammanudi@gmail.com కు పంపాలి. లేదా కొరియర్ / రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో పంపవచ్చు. **3. రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీపత్రాన్ని స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము.** 4. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.

## కథారచయితలకు, కవులకు విన్నపం

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తున్నది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.

2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగు వారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైను) లకు మించకూడదు.

**నడుస్తున్న చరిత్ర** (2013 నవంబరు వరకు)
**అమ్మనుడి** (2015 మార్చి నుండి...)
**పాత సంచికలు విడిగా గాని,**
**సంపుటి (వాల్యూం) బౌండులుగా గాని**
**కావలసినవారు సంప్రదించండి.**
అమ్మనుడి, జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ,
హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-4.
ఫోన్ : 98480 16136, 0866-2439466




## మా తెలుగు సింధుకూ...విజయాక్షరహారం

నిద్రలేని సమరక్రీడ శిక్షణ విరిసిందా?
భద్రసాహసాల మాత రుద్రమ్మే పూనిందా!
రియోలో బ్యాటుతో ఉయ్యాలై చెలగినావు
అయోమయంలో ఎదుటివారు అబ్బురపడ ఆడినావు
ఇంతుల నతిసాహసాల గెలుపులే ఇక విందు
ఇరువదొక్క ఏడుల తెలుగమ్మాయిగ కనువిందు
అందరు తమ ఎదల నిన్ను అందలాల కెక్కించగ
అందరు డ్రైనేజి స్కీము కులమేలను లెక్కించగ!
ఆబగ ప్రేమగ 'తెలుగు తల్లుల' చేతులనుండి
యాబదారు అక్కరాల దండలు నీ మెడనిండా!
విజయరామణీయకం విఖ్యాతం నీ చరితం
వెండియు వెండియు గెలుపుల కీరితికే స్వాగతం
రజిత కీర్తి ఖచిత రచిత భవనవాస యువతీ!
సహితాధిక విజయార్జిత శిఖరమ్మై నిలుచుత!
కోట్ల కోట్ల కళ్ళవెలుగు భూగోళము నందు
ఆటల 'బేడ్‌మింటను' వెలిగావు తెలుగు సింధూ!

**–సన్నిధానం నరసింహశర్మ,** 92920 55531

## 'అమ్మనుడి'లో ప్రచురణ కోసం వార్తలను పంపేవారికి సూచనలు

1. అమ్మనుడిలో – తెలుగు భాష, సంస్కృతి, సాహిత్య సభల వార్తలను ప్రచురిస్తాము. అయితే తెలుగు భాషోద్యమానికి చెందిన వార్తలకు తొలి ఎంపిక వుంటుంది. అయితే పంపే వారు ఆ కార్యక్రమాన్ని నిర్వహించే సంస్థకు చెందినవారై వుండాలి. వార్త వివరాలు, ఫొటోలతో పాటు ఆ సభకు చెందిన ఆహ్వాన పత్రాన్ని, ఉత్తరాన్ని జతచేయాలి. సోషల్ గ్రూప్స్–గూగుల్ గ్రూప్స్, వికీపీడియాలలో పెట్టుకొనే సమాచారాన్ని ఆధారంగా తీసుకొని వార్తలను ప్రచురించజాలము. నేరుగా editorammanudi@gmail.com కు మెయిల్ చెయ్యాలి. లేదా విడిగా పోస్టులో పంపవచ్చును. 25వ తేదీ దాటిన తర్వాత వచ్చే వార్తలను వెంటనే రానున్న పత్రికలో వేయలేము. వార్త ప్రాధాన్యతను బట్టి క్లుప్తంగా ఆ తర్వాతి నెలకు పరిశీలించబడుతుంది.
2. తెలుగు భాషారక్షణ, అభివృద్ధికి చెందిన వార్తలు, ఆసక్తి కలిగించే ప్రభుత్వ/ప్రజలకు చెందిన విశేషాలను పంపించవచ్చు.
3. రెండు తెలుగు రాష్ట్రాలకు బయట వున్న తెలుగు వారికి చెందిన వార్తలను 'అమ్మనుడి'లో ప్రచురణకై ప్రత్యేక శ్రద్ధతో పరిశీలిస్తాము. పంపించండి.

వార్తలు పంపవలసిన చిరునామా:

**సంపాదకుడు, జి–2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ–520004.**

దూరవాణి: కార్యాలయం : *0866-2439466*

సంపాదకుడు : *9848016136*

e-mail : editorammanudi@gmail.com

❄

## మీరు 'అమ్మనుడి' చందాదారులేనా?

'అమ్మనుడి' పత్రికకు చందాదారులు పంపే చందా సొమ్మే ఆధారం. కనుక–

1. తాము చందాదారులైతే మీకు పంపే పత్రికపై చందా ఏ నెల వరకు ఉన్నదీ పేర్కొని వుంటుంది. దయచేసి దానిని గమనించి, సకాలంలో మీ చందా సొమ్మును పంపించి పత్రికను ఎల్లప్పుడూ అందుకోండి.
2. తాము చందాదారులు కాకపోయినా, తమకు గౌరవప్రతిగా (కాంప్లిమెంటరీగా) ఉచితంగా అందుతూ వుండవచ్చు. అటువంటి మిత్రులకు పత్రిక నచ్చితే, దయచేసి చందాను పంపించి తోడ్పడగలరు. పత్రిక నచ్చకపోయినా, మీకు ఆసక్తి లేకపోయినా 'పత్రికను పంపవద్దు' అని దయచేసి ఒక కార్డుపైగాని, ఎస్.ఎం.ఎస్/మెయిల్ గాని పంపించి సహకరించగోరుతున్నాము.
3. పత్రికకు చందాను చెల్లించేవారు తమ ఇష్టాన్ని బట్టి శాశ్వత చందా (రు.5000/లు) గాని, 5 సం॥ల చందా (రు.1000/లు) గాని, 3 సం॥ల చందా (రు.700/లు) గాని పంపి పత్రికకు ఆర్థికంగా తోడ్పడగలరు. వీలుగాకపోతే సం॥చందా రు.240/లు పంపించి ఏటా పునరుద్ధరించుకొనవచ్చు.

**–ప్రచురణకర్త,** అమ్మనుడి

# తెలుగువారిగా మీ ఉనికిని చాటుకొనేందుకు ఈ పాటింపులు తప్పనిసరి

**ఆహ్వాన పత్రికలు** : మీ ఇంట్లో జరిగే పెళ్ళిళ్ళకు, పుట్టినరోజు, షష్టిపూర్తి మొ॥ ఏ వేడుకకైనా పిలుపు (ఆహ్వానం)లను తెలుగులో ముద్రించండి. తెలుగువారు కానివారిని కూడా మీరు పిలుస్తున్నట్లయితే వారి కోసం ఆ ఆహ్వాన పత్రిక మీదే వేరొకవైపు గాని, విడిగా గాని ఆంగ్లంలో లేదా అవసరమైన మరో భాషలో కూడా ముద్రించండి కానీ తెలుగులో ప్రముఖంగా ఉండాలి.

మన ఉనికికి గుర్తులు మన భాష, మన సంస్కృతి మాత్రమే. వాటిని వదలిపెట్టిన తర్వాత మనకు గుర్తింపు, మర్యాద ఉండవు. ఇతర భాషలను, సంస్కృతులను గౌరవిస్తూనే మన ప్రత్యేకతను మనం కాపాడుకొందాం.

మీరెక్కడ నివసిస్తున్నా– తెలుగు ప్రాంతం కానిచోట నివసిస్తున్నా– ఈ సంప్రదాయాన్ని పాటించండి. కంప్యూటర్లలో 'యూనికోడ్'లో ప్రపంచమంతటా తెలుగు అక్షరాలు అందుబాటులో ఉన్నప్పుడు మనకెందుకు చింత!

### విజిటింగ్ కార్డులు..అవి మన గుర్తింపు చీటీలు

మనం గుర్తింపు చీటీలను –విజిటింగ్ కార్డులను– వేయించుకోవడం ఈ రోజుల్లో పరిపాటి అయింది. ఉద్యోగరీత్యా, వ్యాపార రీత్యా గాని అవి అవసరమవుతాయి. అటువంటి అవసరాలు లేకపోయినా, మన చిరునామా, ఫోన్, ఇ–మెయిల్ వివరాలను తెలుపడానికి గాని– అన్నిటికీ ఈ గుర్తింపు చీటీలు/విజిటింగ్ కార్డులు ఇప్పుడు మన జీవితంలో ఎంతో అక్కరపడుతున్నాయి. వాటిని ఇంగ్లీష్‌లోనే వేయించాలనే 'రూల్' ఏమీ లేదు. తెలుగులో వాటిని ఇవ్వడం మనకు ఆత్మగౌరవం. అవసరమైతే తెలుగు అక్షరాల క్రిందే ఇంగ్లీషులో కూడా ఇద్దాం..లేదా కార్డుకు మరోవైపున ఇద్దాం. ఏమంటారు?

## తెలుగుజాతి (ట్రస్టు) విన్నపం

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివసిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరిగింది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు అందుకోసం పనిచేస్తున్నారు. అయితే, అనివార్య కారణాల వల్ల నడుస్తున్న చరిత్ర పత్రికను 2013 నవంబరు నుంచి నిలిపి వేయవలసి వచ్చింది. మళ్ళీ పత్రికను ప్రచురించడంతోపాటు తెలుగు నుడి, చరిత్ర, జాతి ముందడుగుకు అవసరమైన పుస్తకాల ప్రచురణను, ప్రచార కార్యక్రమాలను చేపట్టాలని తలపెట్టాము. ఇందుకోసం 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును నమోదు చేయించాము. (92/ 2014). తెలుగు అమ్మనుడిగా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది.

2015 మార్చి నుంచి **అమ్మనుడి** పత్రికను ప్రచురిస్తున్నాము. పుస్తకాల ప్రచురణ కార్యక్రమంలో భాగంగా తొలుత స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'**ను విడుదల చేశాము. త్వరలోనే మరికొన్ని ప్రత్యేకమైన పుస్తకాలను వెలువరించ బోతున్నాము. ఈ ట్రస్టును బలమైన పునాదులపై, తగినన్ని వనరులతో బలపరచటానికి మీ అందరి చేయూత కావాలి. ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.




**ట్రస్టుకు విరాళాలనిచ్చి తోడ్పడ గోరుతున్నాము.**

| | |
|---|---|
| రాజ పోషకులురు. 1,00,000/–లు | పోషకులు రు. 25,000/–లు |
| విశిష్ట పోషకులు రు. 50,000/–లు | ప్రోత్సాహకులు రు. 10,000/–లు |

**దాత ఫొటోను, క్లుప్తంగా పరిచయాన్ని 'అమ్మనుడి' పత్రికలో ప్రచురిస్తాము.**

**దాతలందరినీ శాశ్వత చందాదారులుగా పరిగణించి పత్రికను ప్రతినెలా పంపిస్తాము. ట్రస్టు ప్రచురించే పుస్తకాలను కూడా ఉచితంగా పంపిస్తాము.**

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి. యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.

అక్కౌంట్ నెం. 914020020387880 I.F.S.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136 ట్రస్టీలు : **పారుపల్లి కోదండరామయ్య** 9505298565, **డా॥వెన్నిసెట్టి సింగారావు** 9393015584, **స.వెం.రమేశ్** 8500548142, **సామల లక్ష్మణబాబు** 9440448244

సంపుటి : 2 సంచిక : 7
**అమ్మనుడి**
సెప్టెంబరు 2016

సంపాదకీయం

# ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రికి జేజేలు

ఎట్టకేలకు ముఖ్యమంత్రి గౌ॥శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారు కరుణించారు. మన మొరలనాలకించారు. ఆయన 2014లో కొత్త ఆంధ్రప్రదేశ్‌కు ముఖ్యమంత్రి అయినప్పటినుండీ తెలుగు భాషోద్యమకారులు వేడుకొంటూనే వున్నారు...నేరుగానూ, పత్రికా ప్రసార మాధ్యమాల ద్వారానూ. చివరగా ఈ తెలుగు భాషాదినోత్సవానికి ముందుగా అత్యవసర అంశాలను మాత్రమే ప్రస్తావిస్తూ ముఖ్యమంత్రి గారికి ఒక లేఖను అందజేయడంతో పాటు, ఆంధ్రజ్యోతి దినపత్రికలో ప్రచురణ ద్వారా అందరికీ తెలియపరచింది– తెలుగు భాషోద్యమ సమాఖ్య. ఈ లేఖపై సమగ్ర స్పందనే తెలుగు భాషాదినోత్సవ సందర్భంగా విజయవాడలో జరిగిన ప్రభుత్వ సభలో ముఖ్యమంత్రిగారి ఉపన్యాసంలో భాగంగా వచ్చింది. వారి ఉపన్యాసానికి ముందుగా ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఉపసభాపతి గౌ॥శ్రీ మండలి బుద్ధప్రసాద్ చేసిన ప్రసంగంలో ప్రస్తావించిన కీలక అంశాలన్నింటిపై ముఖ్యమంత్రిగారు స్పందించారు. తగిన సమయంలో సరైన సలహాలనిచ్చి ముఖ్యమంత్రి గారికి తోడుగా నిలిచిన శ్రీ మండలి బుద్ధప్రసాద్ తెలుగు భాషోద్యమ సమాఖ్య వ్యవస్థాపకుల్లో ఒకరన్న సంగతిని మనం మరువరాదు.

ముఖ్యమంత్రి గారి ప్రసంగంలో ఒక ముఖ్యాంశం– తెలుగు అభివృద్ధి ప్రాధికార సంస్థ(తెలుగు డెవలప్‌మెంట్ అథారిటీ)ని ఏర్పాటు చేస్తామని ప్రకటించడంతోపాటు దాని రూపురేఖలను, విధివిధానాలను రూపొందించేందుకు శ్రీయుతులు మండలి బుద్ధప్రసాద్, పల్లె రఘునాథరెడ్డి, పరకాల ప్రభాకర్, ఎన్.శ్రీకాంత్ (భాషా సాంస్కృతిక శాఖ కార్యదర్శి)లతో ఒక కమిటీని ప్రకటించి, నెలరోజుల్లోగా నివేదికనివ్వాలని వారిని ఆదేశించడం. తర్వాత రోజునే ఇందుకు సంబంధించిన జీ.వో.కూడా వచ్చేసింది.

2012లో ఫిబ్రవరి 21న అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవం నాడు హైదరాబాదులో సమాఖ్య నడిపిన నిరసనదీక్షకు నాటి ప్రతిపక్ష నాయకుడిగా చంద్రబాబు గారు వచ్చి సుమారు అరగంట పైగా ప్రసంగించి బల పరిచిన సమాఖ్య డిమాండ్లలో మొదటిది– తెలుగుకు ప్రత్యేక మంత్రిత్వశాఖను, దాని క్రింద ఒక అభివృద్ధి ప్రాధి కార సంస్థను ఏర్పాటు చెయ్యాలని. ఆ ఏడాది చివరిలో తిరుపతిలో జరిగిన ప్రపంచ మహాసభలలో నాటి ముఖ్యమంత్రిగారు దీన్ని ఆమోదిస్తూ ప్రకటించి, 2013 డిసెంబరు 31 జి.వొ.నెం.909ని ఇచ్చారు. మంత్రిత్వ శాఖను మాత్రమే ఇచ్చి ప్రాధికార మండలిని ఏర్పాటు చెయ్యకపోవడం వల్ల ప్రయోజనం లేని వ్యవస్థ ఏర్పాటయింది. దీనిపై నాటి నుండీ సమాఖ్య ఆందోళన చేస్తూనే వుంది. చివరకు ఆలస్యంగానైనా ఈ లోటును పూర్తి చేయడానికి ముఖ్యమంత్రిగారు సిద్ధపడినందుకు సంతోషంగా వుంది. రాష్ట్రంలో తెలుగును ఒక సమర్థవంతమైన, అత్యాధునికభాషగా తీర్చిదిద్దేందుకు, బోధనాపాలనా రంగాల్లో తెలుగును క్రియాశీలం చేసేందుకు ఒక ఆయుధంగా దీన్ని చెయ్యాలన్నదే భాషోద్యమకారుల లక్ష్యం.

భాషా సంస్కృతులకు సున్నితమైన సంబంధం వుంది. కాని, భాషకు ఉన్న ప్రత్యేక అవసరాల్ని గుర్తించ కుండా వాటిపై శ్రద్ధ వహించకుండా–సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణతోనే భాషాసేవ పూర్తి అవుతుందని అనుకోకూడదు. కొన్నివందల ఏళ్ళ క్రిందటి భాషావసరాలు వేరు; నేటి అవసరాలు వేరు. ఇది గుర్తించిన వారు గనుకే గిడుగు, గురజాడలు వాడుక భాషోద్యమాన్ని నిర్వహించారు. భాషను ప్రజాస్వామీకరించే దిశగా కావలసిన దారులనేర్పరిచారు. భాషా ప్రయోజనాలను సర్వజనోపయోగ్యం చేసుకొనేందుకు దాన్ని నేటి అన్ని అవసరాలనూ తీర్చేదిగా అన్ని రంగాల్లో వాడుకలోకి తెచ్చుకోవాలి. ఇందుకు మౌలికం, కీలకమూ విద్యారంగం. అది ప్రాథమిక విద్యతోనే మొదలవుతుంది. ఆ దశలోనే ఇప్పుడు తెలుగును నులిమివేస్తున్నారు. ఆ రకంగా తెలుగుజాతి మూలాలనే తుంచివేస్తున్నారు. దీన్ని గమనించి పెద్దలు, భాషోద్యమకారులు–పాఠశాల విద్యంతా మాతృభాషలో వుండాలని, కనీసం ప్రాథమిక విద్యలో నైనా మాతృభాషలోనే ఉండాలని మొత్తుకొంటున్నారు. ఇందుకోసం శ్రీ

బుద్ధప్రసాద్ 2003లోనే శాసనసభలో ప్రయివేటు బిల్లును ప్రవేశపెట్టగా పెద్ద చర్చ జరిగింది. ఈ అంశాన్ని అందరూ ఒప్పు కున్నవారే కానీ, వెంటనే ఇంతటి చర్య తీసుకోవడానికి ప్రభుత్వానికి ఇబ్బందులున్నాయనీ, బుద్ధప్రసాద్ గారు తమ బిల్లును ఉపసంహరించుకోవాలనీ మంత్రి శ్రీ మండవ వెంకటేశ్వరరావు కోరారు. అందుకు బదులుగా 1వ తరగతి నుండి 10వ తరగతి వరకు– అది ఏ మీడియం బడి అయినా– రాష్ట్ర అధికార భాష తెలుగును ఒక సబ్జెక్టుగా తప్పనిసరి చేస్తామని వాగ్దానం చేయడంతో బిల్లును బుద్ధప్రసాద్ గారు వెనక్కు తీసుకున్నారు. ఆ పర్యవసానంగానే జి.వో.నెం.86ను ప్రభుత్వం ఇచ్చింది. నాటి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు గారే. కానీ, ఆ జి.వోను ఎన్నడూ చిత్తశుద్ధితో ప్రభుత్వాలు అమలు చెయ్యలేదు. పోయిన ఏడాది తెలుగు భాషాదినోత్సవం నాడు– ఒక సబ్జెక్టుగా తెలుగును తప్పనిసరిగా బోధించేట్లు చూస్తామని చంద్రబాబు నాయుడు గారే చెప్పారు. పనుల ఒత్తిడిలో మరచిపోయారు. అధికారుల సంగతి తెలిసిందే కదా. ఇప్పుడైనా జి.వో.నెం.86ను గుర్తుకు తెచ్చుకున్నందుకు వారికి ధన్యవాదాలు. అయితే ఆచరణ ఎలా వుంటుందో వేచి చూడాలి. ఇక– ఇంటర్మీడియట్‌లో తెలుగు సంగతి. దీనిపై గత 13 ఏళ్ళుగా అందరూ వాగ్దానాలు చేసినవారే. కాని అమలు కానే లేదు. ఇప్పుడు తాజాగా ముఖ్య మంత్రి గారు చేసిన వాగ్దానం అమలులోకి వస్తుందో లేదో చివరిసారిగా వేచి చూడాలి.

ఈ అంశాలతోపాటు మరొక ముఖ్యమైన అంశం. ఆంధ్రప్రదేశ్ ఒక భాషారాష్ట్రంగా తన ఉనికిని కాపాడుకోవడానికి తీసుకోవలసిన కనీస చర్యలు – పాలనలో తెలుగును అన్నిస్థాయిల్లో ఉపయోగించడంతోపాటు ఎటు చూచినా తెలుగు కని పించేటట్లు, వినిపించేటట్లు పాలనాపరమైన చర్యలు చేపట్టడం. అన్ని ప్రభుత్వ శాఖల్ని ఇందుకు సమాయత్తం చేయడానికి ముందుగా గౌరవనీయ ముఖ్యమంత్రి గారు తమ కార్యాలయం నుండే ఈ పనిని మొదలుపెట్టాలి. పదే పదే కీ.శే.ఎన్టీరామారావు గారి పేరును తలచుకొనే ముఖ్యమంత్రి గారు ఇందుకు ఆయనను ఎందుకు ఆదర్శంగా తీసుకోరు? అని ప్రశ్నించవలసి వస్తున్నది. ఎన్టీయార్ ముఖ్యమంత్రిగా కీలకమైన నిర్ణయాన్ని తీసుకున్నందువల్ల వెంటనే పాలన అంతా తెలుగులోకి మళ్ళింది. ఆ సంగతుల్ని గౌరవ ముఖ్యమంత్రిగారు గుర్తుకు తెచ్చుకోవాలి.

తెలుగుదేశం పార్టీ పేరులో తెలుగు వున్నదని, తెలుగుదనాన్ని, తెలుగుజాతి ఉనికిని కాపాడుకోవడానికే తాము కంకణం కట్టుకొన్నామని ప్రకటించిన చంద్రబాబునాయుడు గారు ఆ దిశగా కనీస చర్యల్ని అయినా ఎందుకు తీసుకోవడం లేదు? అల వాటులో పొరపాటుగా ఇంగ్లీషులోనే అమరావతి శిలాఫలకాన్ని వేసిన అధికారులను మందలించి, తెలుగులో కూడా ఆ శిలా ఫలకాన్ని–పేరు పలకను– వేయించడానికి ఎందుకు మీనమేషాలు లెక్కపెడుతున్నారు? ఇందుకోసం ఉద్యమాలు చెయ్యాలా? అమరావతిని సాంస్కృతిక కేంద్రం చేస్తామన్నారు ముఖ్యమంత్రిగారు. అందుకు తాము బాధ్యత వహిస్తామన్నారు. మ్యూజియంను ఏర్పాటు చేస్తామన్నారు. చాలా సంతోషం. అయితే – తెలుగుకు చోటు లేకుండా అమరావతి తెలుగువారి సాంస్కృతిక కేంద్రం ఎలా అవుతుంది? ఈ అంశంపై కూడా ముఖ్యమంత్రిగారు నిపుణుల సలహాను తీసుకుంటే బాగుంటుంది.

ఇప్పటికైనా– తమ వాగ్దానాలను అమల్లోకి తేవడానికి గౌ॥చంద్రబాబునాయుడు గారు పూనుకోవాలి. వీటికి సంబంధించి తక్షణం తగిన ఉత్తర్వులనివ్వడంతోపాటు వాటి అమలుకు అధికారులను సంసిద్ధం చెయ్యాలి. నూతన రాజధాని నిర్మాణంకోసం, ఆంధ్రప్రదేశ్‌ను సస్యశ్యామలం చెయ్యడంకోసం, ఆర్థికాభివృద్ధి దిశగా ఐ.టి.అభివృద్ధి దిశగా తీసుకుపోవడం కోసం నడుం బిగించిన ముఖ్యమంత్రివర్యులు తెలుగు వారి అభిమానానికీ, ఆత్మగౌరవానికీ తెలుగు భాషయొక్క ఉన్నతి, వినియోగం మాత్రమే ఆధారమన్న సంగతిని నిజంగా గుర్తిస్తున్నారా? రానున్న రెండేళ్ళ వ్యవధిలో ఇది నిరూపణ కావలసి వుంది. అప్పుడే రానున్న ఎన్నికలలో ఇది తెలుగుదేశం పార్టీకి సానుకూల అంశం కాగలదు.

చివరగా ఒక్కమాట. ఇంగ్లీషుకు దీటుగా ఉన్నతంగా తెలుగును అన్నివిధాలా వినియోగించుకోగలిగితేనే, అందుకుతగ్గట్లు తీర్చిదిద్దుకుంటేనే మనదైన వ్యక్తిత్వంతో కూడిన గొప్ప భవిష్యత్తును తెలుగుజాతి స్వంతం చేసుకోగలుగుతుంది. ప్రభుత్వ పరంగా ప్రోత్సాహాన్నివ్వండి. సింధు, గోపీచంద్, రజనీ లాంటి వాళ్ళు అన్నిరంగాల్లో దూసుకువస్తారు. అంతటి ప్రతిభ మన తెలుగుజాతిది.

తెలుగుభాషాదినోత్సవం సందర్భంగా కీలకమైన వాగ్దానాలు చేసినందుకు, వాటి అమలుకు చర్యలు గైకొంటున్నందుకు– ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు గారికి జేజేలు.

సామల రమేష్‌బాబు

**1-9-2016**

# కంప్యూటర్‌లో తెలుగు- ప్రస్తుత స్థితి, భవిష్యత్ కార్యాచరణ

-రహ్మానుద్దీన్ షేక్
96869 03386

**తె**లుగుభాషకు ప్రాచీనహోదా సాధించడం కోసం కష్టపడిన వారందరికీ వేవేల మప్పిదాలు. తెలుగుభాషకు ప్రాచీనహోదా రావడం వలన ఎవరికేమి ప్రయోజనం జరిగినా, తెలుగు ఒక భాషగా వేల సంవత్సరాలుగా మనుగడలో ఉందన్నది తెల్లమయింది. ఇన్నేండ్లుగా మనుగడలో ఉందంటే దేశ-కాల-సందర్భాల్లో వచ్చిన మార్పులను తట్టుకొని నిలబడి, కొత్తగా వచ్చి జనాదరణ పొందిన పదాలను హత్తుకొని, వృద్ధి చెందుతూ, ప్రపంచంలోనే అత్యధికంగా మాట్లాడే పది భాషల్లో ఒకటిగా, భారత ఉపఖండంలో మాట్లాడే భాషల్లో హిందీ, బంగాళీ తరువాత అతి పెద్ద భాషగా, ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాషల్లో అత్యధికులు మాట్లాడే భాషగా తెలుగు చెలామణి అవుతూంది. కాలానుగుణంగా తన రూప-సౌందర్య-లావణ్యాలను మార్చుకుంటూంటేనే తెలుగలా మనగలిగింది.

ఐతే మనమున్న ఈ ఇరవై ఒకటో శతాబ్దం శాస్త్ర సాంకేతిక యుగం వైపు అడుగులేస్తోంది. గత శతాబ్దంలో లిపి లేని కొన్ని వేల భాషలు కనుమరగవడం మనము చూశాము, తెలుగు లిపిని ఆధారం చేసుకుని బ్రతికిన రెండు-మూడు భాషలూ మనకు తెలుసు. ఆ లిపిలేని భాషలు కనుమరుగవడం ఎలా జరిగిందో అలాగే ఈ భాషలు సాంకేతికాలకు తగినట్టుగా మలచబడనట్లయితే తమ ఉనికిని కోల్పోతాయి. ఆయా భాషలను మాట్లాడే వారే నడుం కట్టకుంటే, ఇంకెవరో ఏదో చేస్తారని వేచి చూస్తూ ఉంటే భాషల అస్తిత్వం మెల్లమెల్లగా ప్రశ్నార్థకమవుతుంది. అదే భాష పూర్తి కంప్యూటరీకరణ చెందితే ఇవ్వాళ కాకపోతే రేపు భాషను తలకెత్తుకునే వారికి ఆ భాషను పునరుజ్జీవ పరిచే అవకాశం చాలా సులువుగా అందుతుంది. ఆధునిక భాషగా ఆ భాష అస్తిత్వం మరింత సార్ధకమవుతుంది. ప్రతి తెలుగువాడు ఈ మంచి పనిలో తన వంతు సాయం చేస్తే ఇది అసాధ్యమేమీ కాదు. ఇంటా-బయటా, బడిలో-గుడిలో తెలుగు వాడకం పెరగాలి. అలా పెరిగినప్పుడే తెలుగులో ఉపాధి కల్పన పెరిగి తద్వారా తెలుగు చదువులు పెరుగుతాయి.

ప్రపంచంలో ఏ దేశానికెళ్ళినా అక్కడ జనాలను గమనిస్తే కంప్యూటర్లు, మొబైళ్ళు మొ॥ ఉపకరణాలను వాళ్ళు వారి వారి మాతృభాషలలోనే వాడుకుంటున్నారు, ఒక్క మన దేశంలో తప్ప. **వాడకం పెరిగితే తెలుగులో మొబైళ్ళు తయారు చెయ్యటంలో అభ్యంతరం లేదంటారు తయారీదారులు. మొబైళ్ళు తెలుగులో ఉంటే వాడటంలో ఇబ్బంది లేదంటారు వాడుకరులు. మరి సమస్య ఎక్కడ ఉంది?**

**ఫోను కొనడానికి షాపుకెళ్ళి ఇందులో తెలుగుంటేనే కొంటాను అని అడగటానికి సిగ్గుపడే పరిస్థితి తొలగిపోయే వరకూ, కంప్యూటరు, స్మార్టు టీవీల్లో తెలుగు కనిపిస్తుందంటేనే కొంటామని తెలుగు వాళ్ళు గట్టిగా అడగనంత వరకూ, తెలుగులో ఎలక్ట్రానిక్ పరికరాలను తేవడం కష్టమే!**

భాషకు ఆధునిక హోదా రావాలంటే, కంప్యూటరులో తెలుగు ఉండాలన్నది అందరూ ఒప్పుకొనే విషయమే!

మరి మన తెలుగు, కంప్యూటరుకు ఎంతవరకూ జోడించబడింది? తెలుగును కంప్యూటరులో పూర్తిగా వాడాలంటే ఇంకేమేమి సవాళ్ళున్నాయి అన్న సంగతి తెలుసుకుందాం.

మౌలికంగా తెలుగు- కంప్యూటరుకు అనుగుణంగా ఉంది అనడానికి, మూడు మెట్లు కచ్చితంగా ఎక్కాలి. అవి:

1. **కంప్యూటరు, మొబైళ్ళలో తెలుగు చూడడం, వ్రాయడం**
2. **ఇంటర్నెట్ లో తెలుగు సమాచారం**
3. **తెలుగులో కంప్యూటర్లు, ఉపకరణాలు**

**ఈ మూడు సోపానాలు పూర్తయితే మౌలికంగా తెలుగు ఆధునిక భాష అవడానికి ఉన్న అడ్డంకులన్నీ తొలగిపోయినట్టే. ఆపై తెలుగు పదాలను కంప్యూటరుకిస్తే-అది మనకా మాటలు చదివి వినిపించడం (టెక్స్ట్ టు స్పీచ్), మనం మాట్లాడిన మాటలను లిపిబద్ధం చేయటం (స్పీచ్ టు టెక్స్ట్), మనం వ్రాసిన పాఠ్యంలో ఉన్న తప్పొప్పుల పరిశీలన (స్పెల్ చెక్), ఒక పదాన్ని సంబంధించిన పాఠ్యాలలో వెతికి చూపించటం (సెర్చ్ ఇంజన్) మొదలగునవి పూర్తి చేసుకుంటే తెలుగు ఆంగ్లానికి ఏ మాత్రమూ తీసిపోదు.**

తెలుగులో కంప్యూటరులో వ్రాయడం ఈవేళ చాలా సులువు. తెలుగు కీబోర్డులు అనేకం అందుబాటులో ఉన్నాయి. ఎవరికి నచ్చిన పద్ధతిలో వాళ్ళు టైపు చేసుకుంటున్నారు. ఫోనెటిక్, లిప్యంతరీకరణ, ఇన్‌స్క్రిప్ట్, మాడ్యులార్, ఆపిల్, సరళ, పోతన, ఐట్రాన్స్, WX, ఇలా తెలుగింట వంకాయలను ఎన్ని విధాలుగా వండుకుంటారో అన్ని విధాలుగా టైపు చేసుకునే కీబోర్డు లేఔట్లు ఉన్నాయి. ఇంకా, గూగుల్ వెతుకులాట పేజీలో తెలుగును ఎంచుకుంటే, వెతుకుపెట్టెలో టైప్ చేసే స్థలానికి కుడిపక్కగా కీబోర్డు బొమ్మ వస్తుంది, దానిపై క్లిక్ చేస్తే ఫోనెటిక్ కీబోర్డ్ వాడవచ్చు. ఈ ఫోనెటిక్ కీబోర్డు లేదా లిప్యంతరణ కీబోర్డుకున్న వెసులుబాటు, 26 అక్షరాలున్న ఆంగ్ల బొత్తాలకు 56 పైనే ఉన్న తెలుగు అక్షరాలను వ్రాయగలగడం. ఇది కొంచెం

సులువే! ఆంగ్ల 26 అక్షరాలకీ చిన్నబడి పెద్ద బడి ఉంది కదా! అలా 26 బొత్తాలు, కాప్స్ లాక్ లేదా షిఫ్ట్ బటన్ నొక్కిపెట్టి నొక్కితే 52 అవుతాయి. ఇక ం లాంటి చిహ్నాలు వాడి లేదా h, ae, oo ou, au, ai లాంటి అక్షరాలను కలిపి వాడి మనక్కావలసిన తెలుగు అక్షరాలన్నీ టైపు చేయవచ్చు. అమ్మ అని టైపు చెయ్యాలంటే amma అని టైపు చేస్తే సరిపోతుంది. కానీ ఈ కీబోర్డు అంత సులువూ కాదు. computer అని టైపు చేస్తే చొంపుతెర్ అని వస్తుంది, kaMpyUTar అని టైపు చేస్తే కంప్యూటర్ అని వస్తుంది. అంటే మనం ఇంగ్లిషునే మరో రకంగా వ్రాయటం నేర్చుకుంటున్నామన్న మాట!

ఇక ప్రతి కంప్యూటరులో (మొబైళ్ళలో ఇంకా లేదు) ఇన్‌స్క్రిప్ట కచ్చితంగా ఎక్కడో ఇమిడి ఉంటుంది, భాషా అమరికలలో మార్పు చేసి ఇన్‌స్క్రిప్ట్ కీబోర్డును వాడవచ్చు. ఇన్‌స్క్రిప్ట్ (ఇండియన్ స్క్రిప్ట్) కీబోర్డు మొదట్లో కష్టంగా ఉన్నా తెలుగు (భారతీయ భాషాల)కంటూ ప్రత్యేకించి రూపొందించబడింది కాబట్టి, అందులో కాస్త సాంకేతిక సిద్ధాంతాల జోడింపు వలన మిగతా కీబోర్డులకన్న 25% తక్కువ మీటలను వాడి నిర్దుష్టంగా టైపు చేయవచ్చు. తెలుగు అజంత భాష



కదూ, ఆ తత్వాన్ని గుర్తించినదీ కీబోర్డు. కుడి వైపు మీటలన్నీ హల్లులైతే, ఎడమ వైపు మీటలన్నీ అచ్చులు. మనం టైపు చేసే అక్షరాల్లోని ప్రతి పదం కూడా ఒక కుడి వైపు మీట, ఒక ఎడమ వైపు మీట కలిపి తయారవుతుంది కాబట్టి రెండు చేతులకూ సమానమైన వత్తిడి కలిగుతుంది. హాయిగా టైపు చేయవచ్చు. పైగా ఈ అక్షరానికి ఈ మీటలు అని గుర్తుపట్టే సాధన ఒక వారంలో నేర్చుకుంటే జీవితాంతం ఏ ఇతర సాధనాల మీద ఆధార పడక్కరలేదు.

ఇవి కాక ఎన్నో ఇంటర్నెట్ సాధనాలు మనకందుబాటులో ఉన్నాయి. lekhini.org దాదాపు అందరికీ పరిచయమున్న టైపింగ్ సాధనం. Lekhini.org/inscript, lekhini.org/sarala కూడా వాడి ఆయా కీబోర్డులలో టైపు చేయవచ్చు. పై విధానాలన్నీ కూడా యూనికోడ్‌లో టైపు చేయడానికి వాడే విధానాలు. అను ఫాంట్స్ వారి సాఫ్టువేర్ వాడి వచ్చే పాఠ్యం యూనికోడ్ కాదు కాబట్టి అన్ని చోట్లా అందరూ చదవడానికి సాధ్యపడదని అందరికీ తెలిసే ఉంటుంది.

ఇక కంప్యూటరులో తెలుగు చూడటం గురించి. విండోస్ 98 నాటి నుండే తెలుగు చూపించడం కొన్ని కొన్ని మార్పుల ద్వారా సాధ్యమే. విండోస్ ఎక్స్పీ వచ్చే నాటికి బంగాళీ సంస్థ ఐకాంప్లెక్స్ అనే ఒక చిన్న సాఫ్టువేర్ ద్వారా తెలుగు యూనికోడ్ ఫాంటు ఒకటి (గౌతమి), తెలుగు ఇన్‌స్క్రిప్ట్ టైపింగు అందుబాటులోకి తెచ్చింది. విండోస్ విస్టా నుండి నేటి విండోస్ పది వరకూ పూర్తి స్థాయిగా తెలుగుని చదువుకునే వెసులుబాటు ఉంది. లినక్సు, మాకింటోష్ లలో తెలుగు చూడటానికి వీలుగా పోతన, వేమన, లోహిత్ తెలుగు అనే ఫాంట్లు గత దశాబ్ద కాలం నుండి అందుబాటులో ఉన్నట్టుగా తెలుస్తోంది. మొబైళ్ళలో కూడా తెలుగు కనపడటానికున్న అడ్డంకులు తొలగిపోయాయి. ఐఫోన్, ఐప్యాడ్‌లలో ఐఓఎస్ 4 నుండి తెలుగు లిపి(ఫాంట్) అంతర్నిర్మితంగా ఉండటం వలన తెలుగు చదువుకో వచ్చు. ఇంటర్నెట్‌లో అందుబాటులో ఉన్న ఫాంట్లను జోడించి మరింత అందంగా తెలుగును చూడొచ్చు. బ్లాక్‌బెరీ, నోకియా లాంటి స్మార్టు ఫోనుల్లో, Marshmallow కన్నా తక్కువ స్థాయి ఆండ్రాయిడ్ ఫోన్లలో తెలుగు కనపడదు. లాలీపాప్ ఆండ్రాయిడ్ వెర్షన్ నుండి గూగుల్ వారి నోటో ఫాంట్ పుణ్యమా అని లక్షణంగా తెలుగు చదువుకోడానికి కుదురుతుంది. అయితే తెలుగు లేని పై స్మార్టు ఫోనుల్లో(బ్లాక్ బెరీ వగైరా) ఒపెరామిని అనే ఒక అప్లికేషన్‌ను చేర్చి, బిట్‌మ్యాప్ ఫాంట్లు వాడి తెలుగును చూడొచ్చు.

కంప్యూటరులో తెలుగు టైపింగు గురించి మరింత తెలుసుకునేందుకు etelugu.org/telugu-typing జాలగూడుకు వెళ్ళండి. మీ ఫోను, స్మార్ట్ టీవీ, కంప్యూటరు, లాప్టాపులలో తెలుగు చూడడం, వ్రాయడంలో ఏమైనా సమస్యలుంటే support@etelugu.org కి ఒక వేగును (ఈమెయిల్) పంపండి.

**రెండో మెట్టు గురించి చెప్పుకోవాలంటే ఇంటర్నెట్ (జాలం)లో తెలుగు సమాచారం విపరీతంగా పెరగాలి. మనలో చాలా మందికి ఉన్న అపోహ ఏమిటంటే ఇంటర్నెట్ అంటే ఇంగ్లిష్, ఇంగ్లిష్ తప్ప వేరే ఏమీ ఇంటర్నెట్ లో ఉండవు, ఉన్నా అందులో ఉన్న విషయం సచ్చు-పుచ్చులే! ఈ పంథా మారనంత వరకూ ఇంటర్నెట్ లో ఇంగ్లిష్‌కి ధీటుగా తెలుగును నిలబెట్టడం కష్టమే. ఇంటర్నెట్ అంటే ఇంగ్లిష్ అన్న మాట ఎంత అబద్ధమో వికీపీడియా ద్వారానే తెలుస్తుంది. వికీపీడియా ప్రపంచభాషలలో విజ్ఞానాన్ని సాధారణ జనావళికి అందించడం కోసం రూపొందించిన ఒక స్వచ్ఛంద జాలగూడు(website). మొత్తం 300 భాషలలో పూర్తిస్థాయిగా మరో 300 భాషల్లో అంకుర స్థాయిలో వికీపీడియా ఉంది. పూర్తిస్థాయి భాషలలో ఉన్న సమాచార మంతా 3 కోట్ల వ్యాసాలుగా ఉంది, అందులో ఇంగ్లిష్‌లో ఉన్నవి 50 లక్షలు మాత్రమే! అంటే వికీపీడియాలో కేవలం ఆరో వంతు ఇంగ్లిష్ అనమాట, మిగతా ప్రపంచ భాషలు మిక్కిలి వ్యాసాలతో అందుబాటులో ఉన్నాయి. మరి సమస్య ఎక్కడుంది? ఆంధ్రుల చరిత్రను తెలుగులో కాకుండా ఇంగ్లిష్‌లో చదువుతూ వేమన పద్యాలని ఇంగ్లిషులో చదివి ఆనందించే మనలోనే ఉంది!**

ప్రతి ఒక్కరూ నేడు ఏదో విధంగా ఇంటర్నెట్‌లోకి వస్తూ పోతూ ఉన్నారు. అక్కడ గడిపే సమయంలో మీరు వ్రాసేది కొంతలో కొంత తెలుగులో ఉంటే అది చాలు. మీరు పంపే వేగుల్లో చివరన తెలుగులో మీ సంతకం చేర్చండి. మీ పేరు, కనీసం మారుపేరు తెలుగులో

లోహిత్ తెలుగు
గిడుగు
గురజాడ
ధూర్జటి
లక్కిరెడ్డి
మల్లన్న
మండలి
నందిని
నాట్స్
గూగుల్ నోటో సాన్స్
గూగుల్ నోటో సెరిఫ్
ఎన్టీఆర్
పెద్దన
పొన్నాల
పోతన
రామభద్ర
రమణీయ
రామరాజ
రవిప్రకాష్
శ్రీకృష్ణదేవరాయ
సుభద్ర

సుగుణ
సూరన్న
సురవరం
సురవర సంహిత
సురవర స్వర్ణ
తెనాలి రామకృష్ణ
వజ్రం
వేమన
సీడాక్ అమ్మ
సీడాక్ అమృత
సీడాక్ ఆత్రేయ
సీడాక్ రాజన్
సీడాక్ ద్రౌపది
సీడాక్ గోల్కొండ
సీడాక్ కృష్ణ
సీడాక్ మేనక
సీడాక్ పావని
సీడాక్ సితార

వ్రాయండి. తెలుగులో మీ పేరును చూసి తెలుగులో వ్రాయవచ్చా? అన్న కుతూహలంతో ఎందరో మిమ్మల్ని అనుసరించవచ్చు.

ఇప్పటికే ఇంటర్నెట్‌లో ఎంతో సమాచారం తెలుగులో అందుబాటులో ఉంది. ఈనాడు, ఆంధ్రజ్యోతి, సాక్షి, సూర్య, ప్రజాశక్తి మొ॥ వార్తాపత్రికలు యూనికోడ్ తెలుగులో ఉన్నాయి. ఈమాట, భూమిక, వాకిలి, సారంగ, పొద్దు, సుజనరంజని, ప్రాణహిత, ప్రజాకళ, అచ్చంగా తెలుగు లాంటి పత్రికలు ఉన్నాయి. అరవై ఐదువేల వరకూ వ్యాసాలతో తెలుగు వికీపీడియా ఉంది. రెండు లక్షల పదాల నిఘంటువు (విక్షనరి), 32 పైచిలుకు నిఘంటువుల కలబోత ఆంధ్ర భారతి కొందరు రోజుకు పది సార్లు పదాలు-అర్థాలు చూసుకునే సదుపాయాన్నిచ్చాయి. మూడు వేల బ్లాగుల ద్వారా ప్రపంచవ్యాప్త తెలుగువారు తమ భావాలను కవితలు, కథలు, నెమరువేసుకోడాలు, ధారావాహికలు, బొమ్మలు, కార్టూన్ల ద్వారా పంచుకుంటున్నారు. తెలూబ్లాగు, రచ్చబండ, తెలుగుమాట, తెలుగుపదం, పద్యసుబోధకం, సాహిత్యం, తెలుగుమాట, మొ॥ చర్చా వేదికలలో తెలుగు భాషకూ, సాహిత్యానికి సంబంధించిన చర్చలు జరుగుతూనే ఉన్నాయి. ఇక నేడు ఎందరో వాట్సాప్, టెలిగ్రాం, ఫేసుబుక్కులలో తెలుగులోనే వ్రాస్తూ, మాట్లాడుతూ, చర్చిస్తున్నారు. వీటిలో కొన్ని అందరికీ కనబడేలా ఉన్నా, ఇంకొన్ని కొందరికే కనబడేలా, మరికొన్ని వాళ్ళకే కనబడేలా ఉండటం వల్ల అందరికీ కనపడక ఆ చర్చల్లో ఒకవేళ అందరికీ ఉపయోగపడే విషయాలున్నా బయట ప్రపంచానికి తెలీడం లేదు.

ఇదంతా ఏదో ఒక ప్రభుత్వమో, ప్రయివేటు సంస్థో పనికట్టుకొని చెయ్యలేదు కదా! మామూలు జనాలే చేసేస్తున్నారు. అంటే- తెలుగు భాషకు ఇంటర్నెట్ లో ప్రాచుర్యం లేదు, తెలుగులో వ్రాస్తే ఎవ్వరూ చదవరు లాంటి మాటలన్నీ వట్టివే, అలాంటి మాటల్లో ఏ మాత్రమూ నిజం లేదు!

కానీ ఈనాటికీ ఆంధ్రప్రదేశ్-తెలంగాణ ప్రభుత్వ జాలగూళ్ళు (వెబ్సైట్లు), ప్రవాస తెలుగు సంఘాలవారి సైట్లు తెలుగులో లేవు. ఇవన్నీ తెలుగులో ఉండాలి అన్న నిక్కచ్చి మనవాళ్ళకుండాలి!

తెలుగులో టైపు చెయ్యడం, కంప్యూటరులో తెలుగును అందమైన ఫాంట్లలో చూడటం సాధ్యమని అందరూ అన్ని చోట్లా ప్రచారం చెయ్యాలి. ఇంటర్నెట్‌లో ఇంత తెలుగు సమాచారం ఉందన్న విషయం ఒకరికొకరం తెలియజేసుకోవాలి.

ఇక మూడో మెట్టు-కంప్యూటరులు, మొబైళ్ళు ఇతర ఉపకరణాలు తెలుగులో ఉండటం. అంటే మనం వ్రాసిన విషయాలే కాక, చుట్టూ కనిపించే ఆంగ్ల పదాలన్నీ కూడా తెలుగులో కనిపించడం.

విండోస్, లినక్స్, మొబైళ్ళలో చాలా వరకూ, వికీపీడియా, గూగుల్ ఉత్పత్తులు, ఫైర్ఫాక్స్ జాలవిహారిణి, ఓపెన్ ఆఫీస్ లాంటివన్నీ ఇవాళ తెలుగు అంతరవర్తిని(ఇంటర్ఫేస్)తో అందుబాటులో ఉన్నాయి.

ఇక్కడో విషయం చెప్పుకోవాలి. తెలుగులో లోకలైజ్ (స్థానికకరణ) చేస్తున్నవారంతా సాఫ్ట్‌వేర్ నిపుణులు. తెలుగులో వారికి ప్రవేశం తక్కువనే చెప్పాలి. తెలుగులో సరయిన నిఘంటువు గానీ, ప్రామాణికమైన తెలుగు సాంకేతిక పదాలు గానీ అందుబాటులో లేకపోవడం వలన ఉన్న నిఘంటువులలోని సంస్కృత పదాలను ఆంగ్ల పదాలకు బదులుగా తెలుగు తర్జుమాకి వాడుతున్నారు. ఇలా వచ్చినవే అంతర్జాలం(ఇంటర్నెట్), అంతరవర్తిని(ఇంటర్ఫేస్), గణిని/సంగణిని/గణకయంత్రం(కంప్యూటర్), వాడుకరి(యూజర్), సంకేత పదం(పాస్వర్డ్) లాంటి పదాలు.

అయితే ఈ పదాలు శాశ్వతం కాదు. ఎవరైనా పూనుకొని ఆయా సాఫ్టువేరుల స్థానికీకరణ చేసే జట్టులతో కలిసి సరైన-మెరుగైన పదాలను సూచించి, అంతరవర్తినిని మేలైనదిగా చేయవచ్చు.

translatewiki.net, telugu-l10n, ubuntu-te లాంటిచోట్ల మనమంతా తెలుగు స్థానికీకరణకు తోడ్పాటు ఇవ్వవచ్చు.

*(మరిన్ని విషయాలను వచ్చే సంచికలో తెలుసుకుందాం!)*

శిశువు శారీరక వికాసానికి తల్లిపాలు
మానసిక వికాసానికి తల్లి భాష
గుండెలోతుల్లోంచి వచ్చేదీ, మనసు
విప్పి చెప్పగలిగేది అమ్మనుడిలోనే.
అమ్మనుడిపై నెనరు లేనివాడు
కన్నతల్లినీ, పుట్టిన నేలనీ
ప్రేమించలేడు..

# వెలుగు చాటిన తెలుగు

-డా॥సామల రమేష్‌బాబు
98480 16136

మద్రాసు హైకోర్టులో సోమవారం వెలువడిన తీర్పుతో-ప్రాచీన విశిష్ట భాషలు (క్లాసికల్ లాంగ్వేజెస్)గా కేంద్ర ప్రభుత్వం పలువిడతలుగా గుర్తింపు ఇచ్చిన తమిళం, సంస్కృతం, తెలుగు, కన్నడం, మలయాళం, ఒడిసా భాషలన్నింటి పరువు నిలబడింది. పరువు అని ఎందుకు అంటున్నానంటే-ప్రజాభాషలన్నిటినీ విశిష్టమైనవిగా, సమానమైనవిగా గుర్తించాలనే శాస్త్రీయ సూత్రాన్ని విస్మరించి, రాజకీయ వత్తిడులకు తలొగ్గి 2004, అక్టోబర్ 12న భారత సర్కారులోని గృహమంత్రాలయం వారిచ్చిన ప్రకటన భాషా రాజకీయాల తుట్టెను కదపడంతోనే ఈ గొడవ మొదలైంది. ద్రావిడ మూలాల నుంచి కాలక్రమంలో విడివడి స్వతంత్ర భాషలుగా నిలదొక్కుకున్న వాటిలో మొదటిదైన తెలుగు భాషీయులకు, సోదర భాష అయిన కన్నడ ప్రజలకూ అవమాన భారాన్ని కలిగించిన ఆ ప్రకటన తర్వాత వారి మొరలను ఆలకించకుండానే 2005 నవంబరు 25న మరొక నోటిఫికేషన్ ద్వారా సంస్కృతాన్ని కూడా క్లాసికల్ లాంగ్వేజ్‌గా ప్రభుత్వం ప్రకటించింది. పుండుమీద కారం అద్దినట్లు భావించిన తెలుగు, కన్నడ ఉద్యమకారులు పెద్ద యెత్తున ఉద్యమాన్ని సాగించారు.

తెలుగుకు సంబంధించినంతవరకు తెలుగు భాషోద్యమ సభ్యులు 2006, ఫిబ్రవరి 21న హైదరాబాదులో చేసిన నిరాహార దీక్షా కార్యక్రమంలో ఉద్యమం ఒక మలుపు తిరిగింది. ఆ మర్నాడు శాసనసభలో నాటి ప్రతిపక్ష నాయకుడు చంద్రబాబునాయుడు తెలుగుకు క్లాసికల్ భాషాప్రతిపత్తి కోరుతూ ప్రయివేటు తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. చివరకు ప్రభుత్వం అధికార తీర్మానాన్ని ప్రవేశపెట్టడంతో ఏకగ్రీవంగా సభ కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతూ ఒక తీర్మానం చేసింది. అక్కడినుంచి మరి రెండున్నరేళ్ల ఉద్యమం అనేక రకాలుగా ప్రభుత్వంపై వత్తిళ్లను పెంచింది. చివరకు 2008, అక్టోబర్ 31న కేంద్రం నుండి తెలుగుకూ, కన్నడానికి కూడా క్లాసికల్ ప్రతిపత్తినిస్తూ ప్రకటన వెలువడింది,.

ఈ ప్రకటనలు రావడంతోనే కడుపు మండిన తమిళ సోదరులు కొందరు గాంధీ అనే ఒక న్యాయవాది చేత మద్రాసు హైకోర్టులో దావా వేయించారు. తెలుగుకూ, కన్నడానికి ఈ హోదా ఇవ్వడానికి అర్హత లేదని వాళ్ల వాదన. ఆ వ్యాజ్యం సుమారు 8 ఏళ్లు గడిచి, ఇప్పటికి తీర్పు వెలువడింది. తీర్పు సారాంశమేమంటే తమిళానికి క్లాసికల్ హోదా ఇచ్చిన కమిటీయే తక్కిన భాషలకూ ఇచ్చిందనీ, కనుక ఇందులో తాము చెప్పేదేమీ లేదు గనుక, మీ గొడవంతా ఆ కమిటీతోనే తేల్చుకోమని దావాను కోర్టు కొట్టేసింది. ఈ ఎనిమిదేళ్ల వ్యవధిలో చాలా కథ నడిచిపోయింది. మాకూ హోదా ఇవ్వాల్సిందేనని ముందు మలయాళం వారు తర్వాత ఒడిసావారు ప్రభుత్వాన్ని నిలదీశారు. వారికీ ఆ హోదాను ఇచ్చేసింది ప్రభుత్వం.

అసలు ఈ క్లాసికల్ భాషా రాజకీయం ఎందుకు, ఎక్కడ, ఎలా మొదలైందో నాలుగు మాటలు ఇప్పుడు గుర్తుకు తెచ్చుకోవడం తప్పుకాదు. 2004లో లోక్‌సభకు జరిగిన ఎన్నికల్లో డిఎంకె పార్టీ తమిళానికి ఈ ప్రాచీన విశిష్ట హోదాను సంపాదిస్తామని తమ ఎన్నికల మ్యానిఫెస్టోలో చేర్చింది. తమిళభాష పట్ల దాని ప్రాచీనత పట్ల, విశిష్టత పట్ల వారికి ఉన్న పట్టుదల ఆదరణ తెలిసిందే. రాయిపుట్టి, మన్ను పుట్టకముందే పుట్టిన శ్రేష్ఠమైన తొలి భాష తమిళం అని ద్రావిడ భాషావాదులు ప్రచారంలో పెట్టిన నమ్మకాన్ని సాక్షాత్తు ఒక జి.ఒ.లో తమిళనాడు ప్రభుత్వం ఉటంకించిందంటే చాలామంది ఆశ్చర్యచకితులు కావచ్చు.

2006లో తమిళాన్ని నిర్బంధ బోధనాంశం చేస్తూ తమిళనాడు వెలువరించిన జి.ఒ.ఈ ఉటంకింపుతోనే మొదలవుతుంది. అందువల్లనే 2004లో కేంద్రంలో ఏర్పడిన యుపిఎ ప్రభుత్వంలో భాగంగా చేరిన డిఎంకె, యుపిఎ నుంచి రాబట్టిన కనీస కార్యక్రమంలో కూడా తమిళ క్లాసికల్ ప్రతిపత్తినిస్తామనే హామీని రాబట్టిందనే వాస్తవాన్ని ఎవరూ పట్టించుకోలేదు. కాని అది రాజకీయంగా ద్రవిడ పార్టీల మధ్య పోటీలో ఇది ఒక ముఖ్యాంశం. దానికనుగుణంగానే డిఎంకె మంత్రులు ప్రత్యేకించి ప్రభుత్వం చేత క్లాసికల్ లాంగ్వేజెస్ అనే ఒక వర్గీకరణను ఏర్పాటు చేస్తూ నిర్ణయం తీసుకొని, ముందుగా తమిళానికిచ్చి, ఆ తరువాత సంస్కృతానికున్న ప్రతిష్టను కాపాడుకోవడానికి దానికీ ప్రతిపత్తినిచ్చారు. ద్రావిడ వాదులు దాన్ని కూడా అంగీకరించలేరు కాని, వ్యూహాత్మకంగా మిన్నకుండి, ఆ తర్వాత తెలుగుకు, కన్నడానికి, క్లాసికల్ హోదానివ్వగానే రెచ్చిపోయి హైకోర్టులో వ్యాజ్యానికి దిగారు. సరే. మొత్తం మీద ఆంధ్రప్రదేశ్ (సమైక్య) ప్రభుత్వం తరపున ఎబికె ప్రసాద్, అధికార భాషాసంఘం అధ్యక్షులుగా ఉన్నప్పుడు మద్రాసు హైకోర్టులో తెలుగు తరపున సమాధానాన్ని సమర్పించారు. ఆ తర్వాత కొన్ని వాయిదాల కాలక్షేపం అయ్యేనాటికి రెండు తెలుగు రాష్ట్రాల ఏర్పాటు జరిగిపోయింది. ఉభయ రాష్ట్రాల తరపున సంయుక్తంగా ఒక న్యాయవాది వాదించారు. మద్రాసుకు చెందిన తెలుగు ఉపాధ్యాయుడు తూమాటి సంజీవరావు కూడా ఈ వ్యాజ్యంలో తెలుగు తరపున జోక్యం చేసుకొని ఏక వ్యక్తి సైన్యంగా పనిచేశారు. ఇటు రెండు తెలుగు రాష్ట్రాల్లో చివరిదశలో తగినంతగా శ్రద్ధ వహించలేదనేది నిజం. కొంతలో కొంత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కంటే తెలంగాణ ప్రభుత్వమే క్రియాశీలకంగా వ్యవహరించిందని చెప్పుకుంటే అది అబద్ధం కాదు. మొత్తం మీద ఇప్పుడు ఏదో సామెత చెప్పినట్టు-గండం గడిచింది పిండం బయటపడింది! ఇందుకు మన రెండు ప్రభుత్వాల్లో ఎవరూ ఏదో కష్టపడిపోయినట్లు, విజయం సాధించినట్లు ఆనంద పడిపోనక్కరలేదు.

దివంగత భద్రిరాజు కృష్ణమూర్తి గారు ఈ క్లాసికల్ స్టేటస్‌ను నిర్ణయించే కమిటీలో కీలక వ్యక్తుల్లో ప్రముఖుడు. ప్రభుత్వం చెప్పినట్టు ఆ కమిటీ ముందు తమిళానికి ఇచ్చేసింది, ఆ తర్వాత సంస్కృతానికి న్యాయం చేసింది అంటూనే తక్కిన భాషలకూ తలుపులు తెరచి పెట్టేట్లు, అనుకూలతలను లభించేట్లు గానే అర్హత నిబంధనలను రూపొందించినట్లు ఆయన నాతో ఒకసారి అన్నారు. విజయవాడలో జరిగిన సభలో కూడా ఆయన నర్మగర్భంగా ఈ విషయాన్ని చెప్పారు. ఈ కేసు వీగిపోనుందని, కమిటీదే తుది నిర్ణయమని, కోర్టు దాన్నే

చెప్తుందని ఆయన కనుమరుగవ్వడానికి కొన్నాళ్ల ముందు నాతో అన్నారు. ఇప్పుడదే జరిగింది. అందువల్ల ఈ మొత్తం కథలో గర్వించాల్సింది–ప్రభుత్వాలు కాదు, పేర్లు చెప్పుకోవలసి వస్తే– ముందుగా తెలుగు భాషోద్యమ సమాఖ్యతోపాటు, 2003 నుంచే ఈ అంశాన్ని బయటకు తెచ్చి చివరిదాకా తానే ఒక ఉద్యమంగా పనిచేసిన 'నడుస్తున్న చరిత్ర' మాసపత్రికనూ, అన్ని పత్రికా ప్రసార మాధ్యమాలనూ, కృష్ణాజిల్లా రచయితల సంఘంతో పాటు తక్కిన రచయితల సంఘాలను, రాష్ట్ర ప్రభుత్వం తరపున పనిగట్టుకొని కృషి చేసిన మండలి బుద్ధప్రసాద్, ఎబికె ప్రసాద్‌లను చెప్పుకోవాలి. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, ద్రావిడ విశ్వవిద్యాలయం వారూ, ఇంకా అనేకమంది పండితులు, తెలుగుతల్లి ముద్దుబిడ్డలు చేసిన కృషి దీని వెనుక ఉంది. కోర్టు వ్యాజ్యంలో ఒక్కడే వెంటాడుతూ, మన ప్రభుత్వాల ప్రతినిధులకు కూడా సలహాదారుడై పోరాడిన తూమాటి సంజీవ రావును అభినందించాలి.

కమిటీ నిర్ణయాల్నే ఖాయం చేసేశారు కనుక ఇక–ఈ కేసు న్యాయరంగంలో ముందుకు జరిగేదేమీ లేదు. తమిళ ప్రత్యేక జాతీయత అనే తీవ్రవాదానికి ఒక మెట్టుగా భాషకు, అంతర్జాతీయతను సాధించుకోవాలనే తమిళుల పట్టుదలకు ఈ తీర్పువల్ల వచ్చే ఇబ్బంది ఏమీ లేదు. వారి పనిని వారు చేసుకుపోతూనే ఉన్నారు. వారు తమిళాన్ని ప్రాచీన విశిష్ట భాషగానే కాదు, ఒక అధునాతనమైన భాషగా కూడా రూపొందించుకోవడానికి నిరంతరం కృషి చేస్తున్నారు. ప్రపంచీకరణ నేపథ్యంలో ఆంగ్లభాష ఆధిపత్యవాదాన్ని సమర్థంగా ఎదుర్కొంటూ దానితో సహజీవనం చేయగలుగుతున్నారు. అక్కడ తమిళం గర్వంగా తలెత్తుకొని నిలబడుతూనే, అన్ని రంగాల్లో తన బావుటాను నిలబెట్టుకొంటూనే, ఆంగ్లానికి అవసరమైనంత చోటు ఇస్తున్నది. ఆవిధంగా అక్కడ రెండు భాషల సూత్రం స్థిరపడిపోయింది. 2008 అక్టోబరు 31న తెలుగు కన్నడాలకు కూడా క్లాసికల్ ప్రతిపత్తి నిచ్చిన తర్వాత మైసూరులోని భారతీయ భాషల కేంద్ర సంస్థ (సిఐఐఎల్)లో తెలుగుకు, కన్నడానికి విడివిడిగా పరిశోధనా సంస్థలను స్థాపించి, పనిని కొనసాగించడానికి ఉత్తర్వులు వచ్చేశాయి. ఇందుకు కావలసిన నిధుల విడుదల కూడా జరిగిపోయింది. 'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ క్లాసికల్ తెలుగు' పేర 2010నుంచీ ఒక వ్యవస్థను రూపొందించే పనీ మొదలైంది. నిజానికి అప్పటి కేంద్ర మానవ వనరుల శాఖ మంత్రి పురందేశ్వరి మైసూరులో ఒకే రోజున తెలుగు, కన్నడ భాషల పరిశోధనా సంస్థలనూ ప్రారంభించాలని సమయ నిర్ణయం జరిపోయింది. ఇంతలో– తెలుగువాళ్లకు చెందిన సంస్థ మైసూరులో ఎందుకుండాలి? అది తెలుగునేలపైనే ఉండాలనే డిమాండును యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ ముందుకు తెచ్చారు. ఆయనను పలువురు సమర్థించారు కూడ. దానితో మైసూరులో తెలుగు పరిశోధనా సంస్థ వాయిదా పడింది. కన్నడ కార్యక్రమం మొదలై నిరాటంకంగా సాగిపోతున్నాయి. తెలుగుకోసం వచ్చే నిధులు ఎటుపోతున్నాయి? మురిగిపోతాయి కదా– అయితే తెలుగుకు ఏమీ చెయ్యలేదనకుండా మైసూరులోని సిఐఐఎల్ వారు ఏదో మొక్కుబడిగా సమావేశాలు ప్రచురణలూ చేస్తున్నారట. అసలు ఈ పరిస్థితికి కారణం ఎవరు? మైసూరులోనే తెలుగు పరిశోధనా సంస్థను కూడా ప్రారంభించితే బాగుండేది కదా. ఇదంతా మనకు మనమే చేసుకున్నామని కొందరు బాధపడుతున్నారు.

తెలుగుకు క్లాసికల్ హోదా ఇచ్చినా, పనులు కాకపోవడానికి హైకోర్టులో ఉన్న వ్యాజ్యం కారణం అనే ప్రచారం కొందరి బుర్రల కెక్కేసింది. అయితే నిజం ఏమిటంటే ఆ కోర్టుతీర్పునకు లోబడే ఈ హోదానిస్తున్నామని కేంద్రం ఎన్నడో కోర్టుకు స్పష్టం చేసింది. కేంద్ర ఆర్థిక సహాయాన్ని అడ్డుకొనే ఆదేశాలను, కోర్టు ఇవ్వలేదు. కనుక– పరిమితమైన ప్రణాళికతో, నిధులతో కొంత పని గత అయిదేళ్లలో జరిగి వుండేది. మనకు మనం మైసూరులో పరిశోధనా సంస్థ ఏర్పాటును అడ్డుకోకుండా ఉంటే..కాదు కాదు, ఆ సంస్థను నాటి ఆంధ్ర ప్రదేశ్ రాజధానిలోనో మరో చోటనో ఏర్పాటు చేసుకొని ఉంటే, ఇప్పటికే ఎంతో పని జరిగి ఉండేది.

అయితే ఇదంతా నాటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారి పట్టనితనం వల్ల, చేతగానితనం వల్ల జరిగిపోయింది. ఆ సంస్థ కోసం కేవలం ఒక పెద్ద భవనం, మరికొన్ని ఎకరాల స్థలం రాష్ట్ర ప్రభుత్వం ఇవ్వాలి. అంతకుమించి ఒక్కపైసా కూడా రాష్ట్ర ప్రభుత్వం ఇవ్వవలసిన అవసరం లేదు. నియామకాలు, నిర్వహణ అంతా మైసూరులోని సిఐఐఎల్ వారిదే. ఇందులో ఎవ్వరికీ జోక్యం చేసుకునే వీలు లేదు. ముగ్గురు ముఖ్యమంత్రులు మారారు. రాష్ట్రం రెండు రాష్ట్రాలైంది. కొంత స్థలాన్ని, ఒక భవనాన్ని ఇందుకోసం ఇవ్వడం చేతగాని ప్రభుత్వాలు మనల్ని పరిపాలిస్తున్నాయి. దీనికి ఎవరిది బాధ్యత?

*(ఆంధ్రభూమి దినపత్రిక –ఆగస్టు 9)*



ఆగస్టు 17న హైదరాబాద్ త్యాగరాయగానసభలో సతీష్ గొల్లపూడి రచించిన 'న్యూజిలాండ్' నానీలు ఆవిష్కరణ సభలో డా॥దీక్షితులు, డా॥చిల్లర భవానీదేవి, సతీష్ గొల్లపూడి, ఆవిష్కర్త ఆచార్య ఎన్.గోపి, బైస దేవదాసు.

ఏ రాష్ట్రంలో ఉన్నా, ఏ దేశంలో ఉన్నా
తెలుగువాళ్ళంతా ఒక్కటే..
తెలుగులో సంతకం...
తెలుగుదనానికి సంకేతం

హైకోర్టు తీర్పు

–డా॥సామల రమేష్‌బాబు
98480 16136

# భాషా రాజకీయాలకు గొడ్డలిపెట్టు

ఈ ఆగస్టు 8 సోమవారం నాడు మద్రాసు హైకోర్టు ఇచ్చిన తీర్పు ఎంతో అర్థవంతంగా, శాస్త్రీయ దృక్పథంతో ఉంది. ఆ ఉన్నత న్యాయ స్థానం ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ సంజయ్‌కిషన్ కౌల్, న్యాయమూర్తి ఆర్.మహదేవన్‌లతో కూడిన మొదటిబెంచి ఇచ్చిన ఈ తీర్పు అనేక విధాలుగా చరిత్రలో నిలిచిపోయేదిగా ఉంది. వాయిదాల దోబూచులాటల్లో ఏడేళ్లు గడిచిపోగా గత ఏడాదిగా ఈ కేసుపై ప్రత్యేక శ్రద్ధ వహించిన ప్రధాన న్యాయ మూర్తి సుప్రీంకోర్టుకు న్యాయమూర్తిగా వెళ్లేముందు దీనిపై న్యాయాన్ని ప్రకటించడం పట్ల శ్రద్ధ వహించడం మనం గమనించాల్సిన సంగతి.


జస్టిస్ సంజయ్‌కిషన్ కౌల్

ఆయన వెలువరించిన తీర్పులో ప్రసిద్ధ అమెరికన్ గ్రంథకర్త ఆలివర్ వెండెల్ హోమ్స్‌ను ఊటంకిస్తూ 'ప్రతి భాషా ఒక దేవాలయమే నని, అందులో ఆ భాషను మాట్లాడేవారి ఆత్మ విలసిల్లుతుంటుందని' స్పష్టం చేశారు. ప్రజాభాషలన్నిటినీ గౌరవిస్తూ ఆయన ఇచ్చిన తీర్పును ప్రభుత్వాలు, పార్టీలు, ప్రజలు కూడా సహృదయంతో స్వీకరిస్తే అందరికీ మేలు జరుగుతుంది.

'భాషా రాజకీయాలు' అనగానే మనకు వెంటనే హిందీ వ్యతిరేక ఉద్యమం, ఇంగ్లీషు వ్యతిరేక ఉద్యమం, భాషా రాష్ట్రాల ఉద్యమాలు గుర్తుకు వస్తాయి. ఒక ప్రత్యేక భాషకు సంబంధించిన వారు తమ భాషను కాపాడుకోవడానికి, పెంపు చేసుకోవడానికి కృషి చేయడం, అందుకోసం ప్రజాస్వామ్య పద్ధతుల్లో ఉద్యమించడం వారి హక్కు. దాన్నెవరూ కాదనరు. తమ భాషపై పరభాషలు పెత్తనం చేయడాన్ని వ్యతిరేకించడం ప్రజాస్వామ్య పోరాట పరిధుల్లోకే వస్తుంది. తమ భాషే ఉన్నతమైనదని, ఇతర భాషలను గౌరవించడం వల్ల, లేదా ప్రోత్సహించడం వల్ల తమ భాష దెబ్బతింటుందని, అందువల్ల తమ ప్రత్యేకతను, ఔన్నత్యాన్ని ఎవరూ ప్రశ్నించరాదు అనే ఆధిపత్య ప్రదర్శన తక్కిన భాషాజాతుల వారి వ్యతిరేకతను ఎదుర్కొనక తప్పదు. అటువంటి ఆధిపత్య భావజాలాన్ని న్యాయస్థానాలు సమర్థించనేరవు. ఇప్పుడు సరిగ్గా జరిగింది అదే! 2004 అక్టోబరు 12న కేంద్ర హోంశాఖ ఒక ప్రకటన చేసింది. 'క్లాసికల్ లాంగ్వేజెస్' అనే ప్రత్యేక విభాగాన్ని ఏర్పాటు చేయాలని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించిందనీ, దాని ప్రకారం ఆ భాష సాహిత్యం లేదా చరిత్ర ప్రాచీనత వెయ్యేళ్లకు పైబడి ఉండాలని, ఆ భాషను మాట్లాడేవారు తరాలుగా విలువైన వారసత్వంగా భావించుకునే సాహిత్య సంపద ఉండాలనీ, దాని సాహిత్య సంప్రదాయం ఇతర భాషా సమూహాల నుంచి అరువు తెచ్చుకొన్నదిగా కాక స్వతంత్రమైనదిగా ఉండాలని నిర్ణయించినట్లు ఆ ప్రకటనలో తెలిపారు. ఈ అర్హతలను తమిళభాష కలిగి ఉన్నందు వల్ల దానిని క్లాసికల్ భాషగా గుర్తిస్తున్నట్లు తెలుపుతూ, ఇకపై ఈ విషయంలో తీసుకోవలసిన చర్యలను సాంస్కృతిక శాఖ చేపడుతుం దని ఆ ప్రకటన వివరించింది.

ఈ ప్రకటనతో సాటి భాషలైన తెలుగు, కన్నడ ఆత్మాభిమానం దెబ్బతిన్నట్లు మేధావులు, రచయితలు భావించారు. ఇంతలో ఏమైందో ఏమో కేంద్ర సాహిత్య అకాడమీ ద్వారా నియమితులైన నిపుణుల కమిటీ (ఈ కమిటీయే తొలుత తమిళానికి 'క్లాసికల్' ప్రతిపత్తిని ఇస్తూ నిర్ణయించింది) అత్యంత గోప్యంగా అక్టోబరు 29న సమావేశమై క్లాసికల్ భాషగా గుర్తించబడడానికి తొలుత తాము నిర్ణయించిన అర్హతల్లో మొదటి దాన్ని మార్పు చేసింది. మొదటి నిర్ణయం ప్రకారం ప్రాచీనత వెయ్యేళ్ల ప్రాచీనత ఉండాలనే నిబంధనను మార్చి అది 1500–2000 సంవత్సరాల ప్రాచీనత ఉండాలని మార్చారు. పైగా ఆ భాషకు చెందిన ప్రాచీన సాహిత్యానికి, దాని ఆధునిక భాషా రూపానికీ మధ్య కొన్నేళ్ల పాటు సంబంధం లేకుండా ఉండవచ్చునన్న నాల్గవ నిబంధనను చేర్చారు. ఈ రెండు మార్పులు చేయడంలో కచ్చితంగా కుట్ర ఉందని, తెలుగు, కన్నడ భాషలకు ఆ ప్రతిపత్తి రాకుండా ఉండటానికి ఈ మార్పులను చేశారని వెల్లడైంది. తమిళానికిచ్చినట్లే తమకూ ఈ హోదాను ఇవ్వాలనీ, పరిశోధనకు, భాషాభివృద్ధికి వారికివ్వ నిర్ణయించినట్లే అన్ని సౌకర్యాలను, సహాయాలను తమకూ ఇవ్వాలని, తెలుగు, కన్నడ భాషా ప్రజల నుంచి ఉద్యమం బయలు దేరింది.

2005 నవంబరు 25న కేంద్ర ప్రభుత్వం 'సంస్కృతాన్ని' కూడా క్లాసికల్ భాషగా గుర్తిస్తూ మరొక హడావిడి ప్రకటన జారీ చేసింది. నిజానికి భారతదేశ రాజ్యాంగం ప్రకారం 8వ షెడ్యూలులో 22 భాషల్ని సమానంగా గుర్తించారు. వీటిలో హిందీని అధికార భాషగా అంగీకరించాలని రాజ్యాంగం నిర్ణయించింది. అన్నిటినీ జాతీయ భాషలుగా గుర్తించాలనే డిమాండు నాటికీ నేటికీ అలాగే కొనసాగు తూనే ఉంది. 2004 అక్టోబరు 12న తమిళానికి 'క్లాసికల్' ప్రతిపత్తి నివ్వడానికి నిర్ణయించేందుకే భారతీయ భాషల్లో కొత్తగా 'క్లాసికల్ భాషలు' అనే వర్గీకరణను కేంద్రం ప్రకటించింది. ఆ తర్వాత గాని వారికి గుర్తురాని అంశం ఏమిటంటే గత 60 ఏళ్లుగా సంస్కృతం, అరబిక్, పరియన్, పాళీ, ప్రాకృత భాషలు క్లాసికల్ భాషలుగా గౌరవి స్తున్న సంప్రదాయం ఉందని, ఆ భాషల్లో 60 ఏళ్లకు పైబడిన వృద్ధు లకు ప్రతి ఏటా స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా సన్మానాలు జరుగుతున్నాయని. తమిళానికి ప్రాచీన భాష హోదా ఇచ్చి, సంస్కృతా నికి ఇవ్వకపోవడం పట్ల కినిసిన పండితులు ఒత్తిడి తేగానే ఉలిక్కిపడిన కేంద్ర ప్రభుత్వం సంస్కృతాన్ని కూడా 'క్లాసికల్'గా గుర్తిస్తూ 2005 నవంబరు 25న ప్రకటించింది. ఈ పరిణామాలతో ఆత్మరక్షణలో పడ్డ కేంద్రంపై తెలుగు, కన్నడ భాషోద్యమకారుల ఒత్తిడి పెరిగింది. రెండు రాష్ట్రాల ప్రభుత్వాలు తమ చట్ట సభల తీర్మానాలతో కేంద్రంపై ఒత్తిడిని పెంచాయి. దాంతో కేంద్రం గౌరవంగా బయటపడే ప్రయ

త్నాలు చేసి, ద్రావిడ విశ్వవిద్యాలయంలోనూ, సిఐఐఎల్ (మైసూరు లోని భారతీయ భాషల కేంద్ర సంస్థ)తోనూ సదస్సుల నిర్వహణ చేయించి, సమ్మిళిత అభిప్రాయాల సేకరణ చేసి చివరకు 2008 అక్టోబరు 31న మధ్యాహ్నం ఆంధ్రప్రదేశ్, కర్ణాటక రాష్ట్రాల ఆవిష్కరణ దినోత్సవం రోజున రెండు భాషలకూ క్లాసికల్ ప్రతిపత్తిని ప్రకటించింది.

ఆశించని ఈ పరిణామం ద్రావిడ భాషాధిపత్య వర్గాల అవకాశాన్ని దెబ్బతీసింది. నిజానికి డిఎంకె పార్టీ 2004లో తమ ఎన్నికల వాగ్దానాల పత్రంలోనే తాము అధికారంలోకొస్తే కేంద్రాన్ని ఒప్పించి తమిళానికి క్లాసికల్ భాషా ప్రతిపత్తిని సాధిస్తామనీ, తర్వాత తమిళాన్ని రెండవ జాతీయ భాషగా ప్రకటనను తెప్పిస్తామని వాగ్దానాలను గుప్పించింది. అన్నాడిఎంకెపై పైచేయి సాధించడంలో ఇదొక అంశం వారికి. ఎన్నికల తర్వాత కేంద్రంలో యుపిఎ ప్రభుత్వంలో డిఎంకె చేరడానికి ఒక షరతుగా కనీస ఉమ్మడి కార్యక్రమంలో తమిళానికి 'క్లాసికల్' హోదానిస్తామనే అంశాన్ని పెట్టించుకున్నారు. ఆ తర్వాత కొద్ది నెలల్లోనే కమిటీని వేయించి, దాని ద్వారా 'క్లాసికల్ భాష' ప్రకటనను అదే ఏడాది నవంబరు 12నే ప్రకటింపజేసుకున్నారు. దాని ప్రకారం గుర్తింపే కాకుండా, తమిళ భాషా కేంద్ర సంస్థనూ, పరిశోధన కేంద్రాన్ని స్థాపించుకోవడానికి, అంతర్జాతీయ, జాతీయ స్థాయిల్లో గుర్తింపు, గౌరవాన్ని పొందే పథకాలను, రూ.100 కోట్ల కేంద్ర సహాయాన్ని పొందుతారు. కేంద్రీయ విశ్వవిద్యాలయాల్లో తమిళ పీఠాలు ఇంకా ఎన్నో ఆ రకంగా ప్రత్యక్ష, పరోక్ష నిరంతర ఆర్థిక వనరుల తోడ్పాటు, రాజకీయ ప్రాబల్యం వీళ్లాశించారు. తెలుగు, కన్నడాలు పోటీకి వస్తాయని, కేంద్రాన్ని ఒప్పిస్తాయని వారు ఊహించ లేదు. దీంతో డిఎంకె అభిమాని అయిన న్యాయవాది ఆర్.గాంధీ చేత మద్రాసు హైకోర్టులో వ్యాజ్యం వేయించారు. 'క్లాసికల్ భాష' హోదాకు కావలసిన అర్హతలు ఆ రెండు భాషలకూ లేవనేది ఆ వ్యాజ్యంలో ఒక అంశం కాగా, వారికి గుర్తింపు ఇస్తే 'తమిళభాష'కున్న ప్రత్యేకత పోతుందనేది మరొక అంశం. ఈ రెండు అంశాల మీద మద్రాసు ఉన్నత న్యాయస్థానం తీర్పు ఇచ్చింది. 'క్లాసికల్ భాషలను' గుర్తించడానికి కేంద్రం నియమించిన నిపుణుల కమిటీ నిర్ణయాలే తుది నిర్ణయాలనీ, వాటిపై ఏదైనా చెప్పవలసివస్తే వారికే చెప్పుకోవాలని స్పష్టం చేసింది. ఇతర భాషలకు ఇచ్చే గుర్తింపు వల్ల తమిళానికి ఖ్యాతి తగ్గుతోందనే మాట తప్పు అనీ, ఏ భాషా ఖ్యాతి అయినా, ఆ భాషా ప్రజల కృషి, తీరుతెన్నులు, అభివృద్ధిపై ఆధారపడి ఉంటుంది తప్ప ఒక దానివల్ల మరొక భాషఖ్యాతి ఎప్పుడూ దెబ్బతినదని స్పష్టం చేసిన న్యాయమూర్తులు 'అన్ని భాషలూ దేవాలయాల వంటివే'ననే సూక్తితో తమ తీర్పుకు ఒక ఔన్నత్యాన్ని, శాశ్వతత్వాన్ని కలిగించారు.

ఇక్కడ మనం గమనించవలసింది ఒకటే! ప్రజాస్వామ్యంలో భాషల గుత్తాధిపత్యం చెల్లదు. ఇప్పుడు ప్రపంచీకరణ విధానాల దాడిలో నలిగిపోతున్న భారత్ వంటి దేశాల్లో ఇంగ్లీష్ భాషా సామ్రాజ్య వాదం పాలన, విద్యావ్యవస్థల్ని దురాక్రమణ చేస్తోంది. మన ప్రభుత్వాలు కూడా ప్రపంచీకరణ మాయలో కొట్టుకుపోతున్నాయి. ఇటువంటి సమయంలో దేశీయ భాషలన్నిటినీ ప్రజా భాషలుగా గుర్తించి, అభివృద్ధి పరచుకోవడం మన కర్తవ్యం. అదే భాషా జాతుల వ్యక్తిత్వాన్ని కాపాడుకోవడానికి, ప్రజాస్వామ్యాన్ని జాతీయతను కాపాడుకోవడానికి దారి తీస్తుంది. ఇప్పుడు మద్రాసు ఉన్నత న్యాయస్థానం ఇచ్చిన తీర్పు వల్ల గెలిచింది ప్రజల భాషలు. ఓడింది భాషోన్మాదం. దీన్ని తెలుగు వాళ్లం ముఖ్యంగా గమనించాలి. ఈ వ్యాజ్యంలో తెలంగాణ రాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఎవరెంత వాదించారు. ఎవరు ఏ దశలో ప్రవేశించారు అన్న చర్చకు మనం తావివ్వకూడదు. విశిష్ట భాష (క్లాసికల్ లాంగ్వేజి) కేంద్ర సంస్థను మా రాష్ట్రానికే తెచ్చుకుంటామనీ రెండు రాష్ట్రాల బాధ్యులు పరస్పరం ప్రకటనివ్వడం మనకే మేలు చేకూర్చదు. ఉభయ రాష్ట్రాల ముఖ్యమంత్రులు కలిసి కూర్చొని తమ మాతృభాష 'తెలుగు'ను విశిష్ట భాషగా పెంపుదల చేసుకునేందుకు సమిష్టిగా ఆలోచించి చర్యల్ని చేపట్టాలి. రెండు రాష్ట్రాలైనా రెండూ తెలుగు రాష్ట్రాలే. ఏ ఇతర భాషకూ లేని ప్రత్యేకమైన బాధ్యత మనకు మరొకటి ఉంది. అసమగ్రంగా, అసమంజసంగా జరిగిన భాషా రాష్ట్రాల ఏర్పాటు వల్లగాని, అనేక చారిత్రక, సామాజిక కారణాల వల్ల గాని ఇప్పుడు రెండు తెలుగు రాష్ట్రాల్లో కలిపి 9 కోట్లమంది తెలుగు వారుంటే, బయట మరో 9 కోట్ల మంది తెలుగువారు ఉన్నారు. వీరందరూ తెలుగు అభివృద్ధినే కోరుకుంటున్నారు. కనుక రెండు తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులూ కలిసి సమిష్టి వ్యూహంతో తెలుగు భాషాభివృద్ధికై కృషి చేయడానికి ఇదొక మంచి అవకాశం.

(ప్రజాశక్తి దినపత్రిక-ఆగస్టు 14)

# ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు గారికి తెలుగు భాషోద్యమ సమాఖ్య లేఖ

అయ్యా!

తేది : 27-8-2016

విషయం: కొత్త ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని తెలుగు రాష్ట్రంగా తీర్చిదిద్దడానికి
అత్యవసరంగా చేపట్టవలసిన చర్యలపై విన్నపం-
ఆగష్టు 29న తెలుగు భాషాదినోత్సవంనాడు ప్రకటనకై విజ్ఞప్తి.

తొలి భాషా రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన సంగతి తెలిసిందే. ఇప్పుడది రెండుగా విడిపోయినా, రెండూ తెలుగు రాష్ట్రాలే అన్న సంగతి లోకవిదితం. నవ్య ఆంధ్రప్రదేశ్‌కు తొలి ముఖ్యమంత్రిగా ఎంతో శక్తిమంతులైన తమరు ముఖ్యమంత్రి కావడంతో తమ నుంచి ప్రజలు ఎంతో ఆశిస్తున్నారు. 2016, ఆగష్టు 29న తెలుగు భాషా దినోత్సవం సందర్భంగా తాము పరిశీలించి, తగుచర్యలు గైకొంటారని ఆశిస్తూ ఈ క్రింది అంశాలను మీకు తెలియజేస్తున్నాము.

(1) కొత్త రాజధాని నిర్మాణంలోను, వ్యవసాయ, పారిశ్రామిక, ఐటీ తదితర రంగాల్లోనూ తాము సరికొత్త ప్రణాళికలతో ముందుకు సాగిపోతున్నారు.ఎంత ఆధునికతను సాధించినా, మౌలికంగా మనది తెలుగు రాష్ట్రం గనుక – అన్నివిధాలా, అన్నిరంగాల్లో తెలుగును కాపాడుకోవాల్సి ఉంది. ఇంగ్లీషును ఎంతగా మనం ఉపయోగించుకుంటున్నా, తెలుగుకు తర్వాతి స్థానమే ఇంగ్లీషుది అన్న సంగతి తమకు తెలియనిది కాదు. మన గుర్తింపును, పరువును స్థానికంగానే కాదు, జాతీయంగా, అంతర్జాతీయంగా కాపాడేది మనం, తెలుగువారమన్న అస్తిత్వం(ఉనికి) మాత్రమే.

కాని, ఈ విషయాన్ని మన ప్రభుత్వ అధికారులు, అన్నిరంగాల్లో ఉన్న పెద్దలు గుర్తించేట్లు చేయవలసిన బాధ్యత ముఖ్యమంత్రిగా తమపై ఉన్నదని మనవి చేస్తున్నాం. రాజధాని శంకుస్థాపన జరిగిన నాటి నుంచి ఇప్పటివరకూ జరుగుతున్న కార్యక్రమాల్లో తెలుగుకు అధికారికంగా తగిన గుర్తింపు రావడం లేదు. కనుక వెంటనే తాము జోక్యం చేసుకొని, రాష్ట్రంలో జరిగే అన్ని అధికారిక, అనధికారిక కార్యక్రమాల్లో – పరిపాలనలో – తెలుగుకు ప్రాధాన్యం ఇవ్వాలని, తెలుగు తర్వాతే ఇంగ్లీషును అవసరమైన చోట్ల ఉంచాలనే విధాన నిర్ణయాన్ని ఉత్తర్వు (జీవో)గా ఇచ్చి, దాన్ని కఠినంగా అమలుచెయ్యాలని కోరుతున్నాం. ఈ చర్య తమపై ప్రజల్లో ఎంతో గౌరవాన్ని పెంచుతుందని మనవిచేస్తున్నాం. దీనితోపాటు 'దుకాణాలు, సంస్థలచట్టం' ప్రకారం ప్రతి బోర్డు మీదా, ప్రకటనల్లోనూ తెలుగు తర్వాతి స్థానమే ఏ ఇతర భాషలకైనా ఉండాలన్న అంశాన్ని కఠినంగా అమలులోకి తెస్తూ ప్రత్యేక ఉత్తర్వులివ్వాలని కోరుతున్నాం.

(2) ఒకటో తరగతి నుంచి 10వ తరగతి వరకు తెలుగును ఒక బోధనాంశంగా తప్పనిసరి చేస్తూ 2003లో తమ హయాంలోనే జీవో నెం. 86ను తెచ్చారు. కానీ, నాటి నుంచి నేటి వరకు దానిని సరిగ్గా అమలుపరచడం లేదు. 10వ తరగతి వరకు ప్రభుత్వ పరీక్షలు లేనందున ప్రయివేటు పాఠశాలల్లో దాదాపు తెలుగును చెప్పడం మానేశారు. లేదా– మొక్కుబడిగా వారానికి ఒకటి రెండు పిరియడ్స్ చెప్పి – చివరకు 10వ తరగతిలో విద్యార్థులపై వత్తిడి తెస్తున్నారు. ఇందువల్ల తెలుగు రాష్ట్రాల్లో తెలుగులో సున్నా మార్కులు తెచ్చుకొంటున్న విద్యార్థులే ఎక్కువ అవుతున్నారు. ఇది ప్రమాదకరమైన సంగతి. ప్రభుత్వ పాఠశాలల్లో తెలుగు ఉపాధ్యాయులను తగిన సంఖ్యలో నియమించనందువల్ల, ప్రభుత్వ స్కూళ్లలోనూ గందరగోళ పరిస్థితి నెలకొన్నది. తాము వెంటనే జోక్యం చేసుకొని, ఈ సమస్యను సరిదిద్దేందుకూ, జీవో నెం.86ను సక్రమంగా అమలు జరిపేందుకు చర్యలు ప్రకటించాలని కోరుతున్నాం.

(3) పై అంశంతోపాటు మరొక అంశాన్ని కూడా తమరు 2015లో జరిగిన తెలుగు భాషా దినోత్సవం నాడు వాగ్దానం చేశారు. అది – ఇంటర్మీడియట్‌లో తెలుగు లేకుండా చేస్తున్న దుర్మార్గం గురించి. దీనిని సరిచేస్తానని, తెలుగును తప్పనిసరి చేస్తానని ఆనాడు తాము చెప్పినా, ఇతర పనుల తొందరలో దీనిని పూర్తిగా మరచినట్లున్నారు. వెంటనే తగు చర్యల్ని ఈ తెలుగు భాషా దినోత్సవం నాడు ప్రకటించగలరని ఆశిస్తున్నాం.

(4) ఏ మీడియం (మాధ్యమంలో) పాఠశాల చదువు ఉండాలనే అంశంపైన రకరకాల చర్చలు జరుగుతున్నాయి. కనీసంగా 5వ తరగతి వరకు మాతృభాషా మాధ్యమాన్ని ప్రభుత్వ, ప్రయివేటు పాఠశాలలన్నిటా తప్పనిసరి చేయాలనే నిపుణుల అభిప్రాయాన్ని మన్నించి, ఆ విధమైన విధాన నిర్ణయాన్ని తెచ్చి, దేశానికే ఆదర్శంగా నిలుపవలసినదిగా తమను కోరుతున్నాము. ఇంగ్లీషును ఒక సబ్జెక్టుగా 1వ తరగతి నుంచే బోధించవచ్చు. 6వ తరగతి నుంచి మీడియంను నిర్ణయించుకునే స్వేచ్ఛను వారికివ్వవచ్చు. అదే సమయంలో 10వ తరగతి వరకు సమాంతరంగా తెలుగు మాధ్యమం కావాలనుకునే వారికి కూడా అవకాశాన్ని కొనసాగించాలని కోరుతున్నాం. ఈ రకమైన విధాన నిర్ణయానికి తెలంగాణ ప్రభుత్వం మొగ్గుచూపుతూ కేంద్రానికి రాసినట్లు వార్తలు తెలుపుతున్నాయి. తాము ఈ విషయమై నిశితంగా అధ్యయనం చేసేందుకు భాషావేత్తలు, బోధనావేత్తలు, మేధావులతో ఒక సమావేశాన్ని జరిపి, తగిన

విధాన నిర్ణయం తీసుకోవాలని కోరుతున్నాం.

(5) ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన 60 ఏళ్లకు 2012లో తెలుగు భాషోద్యమకారులు ఉద్యమించి, ప్రపంచ తెలుగు సభలను నిరసించి, బహిష్కరించి – ప్రభుత్వం నుంచి జీవో నెం. 909/31.12.2013ను సాధించుకున్నారు. దాని ద్వారా తెలుగుకు మంత్రిత్వ శాఖ ఏర్పడింది. కానీ తెలుగు భాష కోసం (సాంస్కృతిక విషయాలు కాదు) ఆ శాఖ చేసిందేమీ లేదు. ఇందుకోసం ఆ శాఖ క్రిందనే – ఒక తెలుగు ప్రాధికార మండలి (తెలుగు డెవలప్‌మెంట్ అథారిటీ)ని ఏర్పాటు చెయ్యాలని కూడా ఉద్యమకారులు కోరినా, దానిని నాటి ప్రభుత్వం పట్టించుకోలేదు. ఈ డిమాండ్లను నాటి ప్రతిపక్ష నాయకుడిగా తాము పూర్తిగా బలపరిచి వున్నారు. 2014 ఎన్నికల్లో తాము గెలిచి, వాటిని అమలులోకి తెస్తామని వాగ్దానం చేశారు. తెలుగు మంత్రిత్వ శాఖ ఏర్పడింది గనుక – తోలుబొమ్మ లాంటి అధికార భాషా సంఘం అవసరం ఏమీ లేదు. కనుక దానిని రద్దు పరచి, నిపుణులతో తెలుగు డెవలప్‌మెంట్ అథారిటీని ఏర్పాటు చెయ్యాలని కోరుతున్నాం.

ఈ తెలుగు భాషాదినోత్సవం నాడు తాము పై అంశాలపై స్పందించాలని కోరుతున్నాం. తెలుగును ఒక సెంటిమెంటుగా కాక, ఒక జాతియొక్క శక్తిమంతమైన అస్తిత్వ అంశంగా, ప్రజాస్వామ్య యుగంలో ప్రజల ఆయుధంగా గుర్తించి, ప్రజల భాషలోనే పాలన, బోధన పూర్తిగా జరపాలని కోరుతున్నాం. అప్పుడే నిజమైన ప్రజాస్వామ్య పాలన కాగలదని మనవి చేస్తున్నాం. ధన్యవాదాలతో......

**డా॥ సామల రమేష్‌బాబు,** అధ్యక్షుడు.

**కొత్తపల్లి రవిబాబు,** ఉపాధ్యక్షుడు.

**డా॥ వెన్నిసెట్టి సింగారావు,** కార్యదర్శి.

**ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ప్రకటనపై**
**ఆంధ్రజ్యోతి దినపత్రిక సంపాదకీయ వ్యాఖ్య ఇది :**

# తెలుగుకు వెలుగు

**తె**లుగు భాషాదినోత్సవం సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రకటించిన చర్యలు, ఇచ్చిన హామీలు భాషాభిమానుల్లో ఉత్సాహాన్ని నింపుతున్నాయి. ఏడాదికోమారు గిడుగు జయంతినాడు భాష విషయంలో వల్లమాలిన ప్రేమ ప్రకటించి, అనంతరం తిరిగ్గా విస్మరిస్తున్న తరుణంలో, తెలుగును నిలబెట్టే కొన్ని నిర్దిష్టమైన చర్యలకు తెలుగు రాష్ట్రం ఒకటి నడుంకట్టడం సంతోషాన్ని కలిగిస్తున్నది. ఉత్తరాంధ్రకు చెందిన గిడుగును అన్వయించుకోవడంలో ఉన్న ఇబ్బందుల కారణంగా కావచ్చు తెలంగాణలో తెలుగుభాషాదినోత్సవం అధికారికంగా జరగలేదు. తెలుగు భాషను కాపాడేందుకు తెలంగాణ ప్రభుత్వం కూడా విస్పష్టమైన చర్యలకు పూనుకోవడం అవసరం.

తెలుగు ప్రాధికార సంస్థ (తెలుగు డెవలప్‌మెంట్ అథారిటీ) ఏర్పాటుకు నిర్ణయించడం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రకటించిన చర్యల్లో అత్యంత ప్రధానమైనది. 2012 ప్రపంచ తెలుగుమహాసభల సందర్భంగా భాషోద్యమకారులు ఉద్యమించి, తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాల్లో మాదిరిగానే ఇక్కడ కూడా తెలుగుభాషకు ప్రత్యేక మంత్రిత్వ శాఖను సాధించుకున్నారు. ఆ ఏడాది డిసెంబరు 31న విడుదలైన జీవో 909 ప్రకారం మంత్రిత్వశాఖ అయితే ఏర్పడింది కానీ, దీని కింద ప్రాధికారసంస్థ కూడా ఏర్పాటు కావాలన్న తెలుగు భాషోద్యమ సమాఖ్య డిమాండ్ నెరవేరలేదు. అధికారభాషా సంఘం అధికార భాషగా తెలుగును ఎలా అమలు చేయాలన్నదే చెబుతుంది.

సలహాసంఘం మాత్రమే కనుక దానికి పెద్దగా అధికారాలు కూడా ఉండవు. అందువల్ల, తెలుగును ఆధునిక భాషగా అభివృద్ధి చేయడం సహా, పాలన, విద్య తదితర అన్ని రంగాల్లో దానిని కచ్చితంగా అమలు చేయడానికి సర్వాధికారాలున్న అథారిటీ ఏర్పాటు కావడం చాలా అవసరం. అథారిటీ ఏర్పాటుకు సంబంధించిన విధి విధానాల రూపకల్పనకు నలుగురు సభ్యులతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కమిటీని ఏర్పాటుచేయడం ఈ దిశగా తొలి అడుగు. ముప్పైరోజుల్లో ఈ కమిటీ నివేదిక ఇస్తుందని, కార్యాచరణ మొదలవుతుందని ప్రకటించడంతో పాటు, తెలుగుభాషకు సంబంధించిన అన్ని విషయాల్లోనూ సర్వాధికారాలూ దఖలు పడబోతున్న ఈ ప్రాధికారసంఘం వ్యవహారాల్లో ప్రభుత్వం వేలుపెట్టబోదని చంద్రబాబు హామీ ఇవ్వడం సంతోషం కలిగిస్తున్నది.

పంచాయితీస్థాయి నుంచి సచివాలయం వరకూ పరిపాలనా రంగంలోనూ, పాఠశాలనుంచి స్నాతకోత్తర కళాశాలల వరకూ విద్యా రంగంలోనూ, మిగతా అనేక రంగాల్లో అన్ని స్థాయిల్లోనూ తెలుగును పూర్తిగా అమలు చేయించడానికి ఈ సంస్థకు సంపూర్ణాధికారాలు ఉంటాయని చెబుతున్నారు. వాణిజ్య వ్యాపార సంస్థల బోర్డులపైన తెలుగు కచ్చితంగా ఉండాలన్న నియమం సహా ప్రభుత్వం భాషకు సంబంధించి విడుదలచేసే ప్రతి జీవో కచ్చితంగా అమలు జరగడానికి ఈ ప్రాధికార సంస్థ ఏర్పాటు ఉపకరిస్తుంది.

ఒకటి నుంచి పదవతరగతి వరకూ తెలుగును ఒక సబ్జెక్టుగా తప్పనిసరి చేయడానికి ఉద్దేశించిన 2003 నాటి జీవో 86ను కఠినంగా అమలుచేసేందుకూ, ఇంటర్మీడియట్‌లో కూడా తెలుగును తప్పనిసరి చేసేందుకు ఉత్వర్వులు ఇవ్వడానికీ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి సంసిద్ధత ప్రకటించారు. తెలుగునేల మీద ఏ యాజమాన్యంలో ఉన్న స్కూలైనా, తెలుగేతర బోధనామాధ్యమానికి చెందిన స్కూలైనా అది అధికారభాష కనుక పదో తరగతి వరకూ తెలుగును తప్పని

సరిగా ఒక సబ్జెక్టుగా చెప్పాలన్నది నియమమే కానీ ఆచరణలో పూర్తిగా అమలుకు నోచుకోవడం లేదు. అలాగే, ఇంటర్మీడియట్‌లో కూడా తెలుగును తప్పనిసరి చేయాలన్నది భాషోద్యమకారుల సుదీర్ఘ కాలపు డిమాండ్. తెలుగుస్థానంలో ఫ్రెంచి, జర్మన్‌లతో పాటు, మార్కులు అధికంగా తెచ్చిపెట్టే సంస్కృతం ఇప్పుడు వచ్చికూర్చుంది. సంస్కృతాన్ని తెలుగులో రాయనివ్వడం, కాస్తోకూస్తో రాస్తే చాలు అత్యధిక మార్కులు ఇచ్చేయడంతో ఇంటర్మీడియట్ స్థాయిలో తెలుగు కనుమరుగైపోతున్నది. ఇంటర్మీడియట్‌లో కూడా తెలుగును తప్పని సరి చేయాలంటే కార్పొరేట్ విద్యాసంస్థల ఒత్తిళ్ళను ప్రభుత్వాలు అధిగమించక తప్పదు.

భాషావిధానం శాస్త్రీయంగా ఉండాలి. పిల్లవాడు ఇంటిభాషకు అలవాటుపడివుంటాడు కనుక తనకు తెలియనిదానిని మాతృభాషలో సులభంగా నేర్చుకోగలుగుతాడు. ప్రపంచవ్యాప్తంగా ఉన్న ఈ అవగాహన కారణంగానే, కనీసం ఐదోతరగతివరకూ మాతృభాషలోనే విద్యాభ్యాసం జరగాలనీ, అప్పుడే జ్ఞానంతో పాటు ఇతర భాషలు కూడా సునాయాసంగా వస్తాయని భాషోద్యమకారుల వాదన. ఇంగ్లీష్ కూడా ఒక భాషగా ఉంటూనే, ఐదు వరకూ తెలుగుమాధ్యమంలోనే చెబుతూ, అనంతరం ఎవరి ఇష్టప్రకారం వారు మాధ్యమాన్ని నిర్ణయించుకొనేందుకు వీలుగా తెలుగు, ఇంగ్లీష్‌మీడియం స్కూళ్ళను సమాంతరంగా కొనసాగించడం ఉత్తమం. కానీ, తల్లిదండ్రుల అభీష్టం పేరిట ప్రభుత్వాలు ఎల్‌కేజీ నుంచే ఇంగ్లీష్ మీడియం కోసం వెంప ర్లాడుతున్నాయి. ఉభయ తెలుగు రాష్ట్రాల మధ్య విభిన్నమైన సమస్యలు ఉన్నప్పటికీ, భాషకు సంబంధించినంత వరకూ తమ తమ ప్రత్యే కతలను కాపాడుకుంటూనే ఉమ్మడిగా తెలుగు భాషోద్ధరణకు కృషి చేయవచ్చును.

*(ఆగస్టు 31న ఆంధ్రజ్యోతి సంపాదకీయం)*

# వర్ణమాల

**–డా॥ఎన్.గోపి**

నా చిన్నప్పుడు
తెలుగు వర్ణమాలను
గోడకు తగిలించాను.
గాలికి ఊగే దాని లయకు
యాభయ్యారు బొమ్మలు ఉయ్యాలలూగేవి
రాలిపోయేవి కాదు.
ఆ కాలంలో 'అమ్మ', 'ఆవు' వంటివి
వాటి గదుల్లో భద్రంగా ఉండేవి.
'ఇల్లు' ఓ నిరుపేద స్వప్నంలా కనపడేది.

మా అబ్బాయి బాల్యంలో
తెలుగు పక్కన
ఆంగ్ల వర్ణమాలను తగిలించాను.
గాలి వచ్చినప్పుడల్లా అవి కొట్లాడుకునేవి.
తొందరలోనే ఆంగ్లం
తెలుగు పక్కన తన తేజస్సును పెంచుతుంది.
'ఋషి' అలా చూస్తుండిపోయాడు.
'పలక' మాయమైపోయింది.
'ఉదుత', ఎలుగుబంటి, ఏనుగు, ఒంటె
జూలోకి వెళ్ళిపోయి నీరసిస్తున్నాయి.
'ఈగ' ఇప్పుడు ఒక సినిమా పేరయ్యింది.

మా మనుమడు వచ్చి
ఈ రెండింటిని తేలిగ్గా చూస్తున్నాడు.
వాడి చూపులకు
ఇంగ్లీషు చార్ట్ కూడా
గజగజా వొణికిపోతున్నది.
వాడి పెదవులపై
కొత్త రాగాలు పాకుతున్నాయి.

ఆపిల్ అంటే వాడికి ఫ్రూట్ కాదు
అదొక మొబైల్ కంపెనీ పేరు.
ఆండ్రాయిడ్ కూడా కావచ్చు.
'సి' ఫర్ కంప్యూటర్
'డి' అంటే డాగ్ కాదు డేటాబేస్
ఫేస్‌బుక్‌లో కొత్తముఖాలు
'లైక్'ల్తో హల్‌చల్ చేస్తున్నాయి.
'జి' అంటే గూగుల్ అని వేరే చెప్పాలా!

ఐస్‌క్రీం ఎవరికైనా నోరూరిస్తుంది
బహుశా రేపు ఇది ఐపాడ్‌గా మారవచ్చు
'ఎం' ఫర్ మ్యాంగో అనగానే
నాలుకపై తీపి చిగురిస్తుంది
ఇప్పుడది మొబైల్‌గా పలుకుతుంది.
లయన్ ప్రస్తుతం పిల్లిలా ముడుచుకుంది
'ఎల్' ఫర్ లాప్‌టాప్‌గా ఒడిలో కెక్కి కూచుంది.
'ఆర్' అంటే రోబో అనేది పాతబడిపోయి
రీఛార్జ్ అంటే వెంటనే కనెక్టు అవుతుంది.

'టీ'ని మోడీ ట్విట్టర్‌గా మార్చేశాదు
'వాచ్'లోని బంగారు కాంతుల్ని
తదేకంగా తిలకించేవాళ్ళం
ఇప్పుడది
'వాట్సప్'గా ధగధగలాడుతుంది.

అయ్యా!
తెలుగు వర్ణమాలను కీర్తిస్తూ
నాయకులు పండుగలు చేసుకుంటున్నారు.
అలా చేసినందుకు
అవార్డులు కూడా అందుకుంటున్నారు
తెలుగు సిలబసుల్లో చోటు దొరక్క
అక్షరాలు ఆయాస పడుతున్నాయి.
తెలుగు వైభవం
కాగితాలకే అతుక్కుపోతుంది.
ఉత్సవాలన్నీ
తద్దినాలుగా మారుతున్నాయి.
అక్షరాలు అనాథలై కన్నీరు కారుస్తున్నాయి
ఆదుకోవడమే అసలైన భాషాసేవ.



తెలంగాణలో భాషోద్యమం

# మాతృభాష తెలుగుతోనే బంగారు తెలంగాణ

## కరీంనగర్‌లో తెలుగు భాషాపరిరక్షణ సదస్సు ప్రకటన



**తె**లంగాణాలో ఈ విద్యా సంవత్సరం నుండి ప్రభుత్వ ప్రాథమిక సెకండరీ పాఠశాలల స్థాయిలో తెలుగుకు బదులు ఆంగ్ల మీడియం ప్రవేశపెట్టడంపై మేధావులు, తెలుగు భాషావేత్తలు, రచయితల నుండి నిరసనలు వ్యక్తమైనాయి. మాతృభాష తెలుగుకు పంగనామాలు పెట్టే ప్రభుత్వాల విధానంపై ఇప్పుడిప్పుడే తెలంగాణాలో కదలిక మొద లైంది. వరంగల్‌లో జూన్ 25,26, 27 తేదీలలో తెలంగాణా ఎడ్యు కేషనల్ అండ్ కల్చరల్ ఫోరం ఆధ్వర్యంలో మేధావులు, రచయితల సమాలోచనలు జరిగాయి. ఈ సమాలోచనల తీర్మానం ప్రకారం ప్రతి జిల్లా కేంద్రంలో తెలుగు భాషా విధానాలపై సదస్సు నిర్వహిం చాలి. ఇందులో భాగంగానే కొత్తగా ఏర్పాటైన తెలుగు భాషాపరిరక్షణ సమాఖ్య ఆధ్వర్యంలో కరీంనగర్‌లో జులై 31న తొలి సదస్సు జరిగింది. అంతగా ప్రచారం లేకున్నా సదస్సు మాత్రం పలు తీర్మా నాలను ఆమోదించి, మాతృభాష పరిరక్షణకై నడుం బిగించింది. ఈ సదస్సులో రాష్ట్ర అసెంబ్లీ స్పీకర్ ఎస్.మధుసూదనాచారి, ఎం.పి బి.వినోద్‌కుమార్, రాష్ట్ర ఆర్థిక మంత్రి ఈటెల రాజేందర్, విద్యావేత్త చుక్కా రామయ్య, కార్యక్రమ నిర్వాహకుడు డా॥వెలిచాల కొండల రావు, తెలంగాణ అధికార భాషా సంఘం అధ్యక్షుడు దేవులపల్లి ప్రభాకరరావు, శాతవాహన యూనివర్శిటీ అసిస్టెంట్ రిజిస్ట్రార్ కిషోర్, సాహితీవేత్తలు గంద్ర లక్ష్మణరావు, జమ్మికుంట డిగ్రీ కళాశాల ప్రధా నాచార్యులు డా॥కల్వకుంట రామకృష్ణ, నమిలికొండ జయంత్‌శర్మ, దాస్యం సేనాధిపతి, కళాశాల కరస్పాండెంట్ ఆగమరావు, మాజీ ఎమ్మెల్యే ఆదిపల్లి మోహన్, ప్రిన్సిపాల్ చందా శ్రీనివాస్ తదితరులు పాల్గొన్నారు. తెలంగాణ రాష్ట్ర పర్యాటక కార్పొరేషన్ ఛైర్మన్ పేర్వారం శ్రీరాములు కూడా పాల్గొని, తెలుగు భాషా పరిరక్షణోద్యమానికి తమ మద్దతు పలికారు.

కార్యక్రమ నిర్వాహకులు విద్యావేత్త డా॥వెలిచాల కొండలరావు మాట్లాడుతూ, వరంగల్‌లో జూన్ 25న జరిగిన సాహితీవేత్తల సమా లోచనల మేరకు, తెలుగు భాషా పరిరక్షణ సమాఖ్య అవతరించిందని, మేధావులు, ప్రొఫెసర్లు, స్వచ్ఛంద సంస్థలు, ప్రజాప్రతినిధులతో కలిసి ప్రతి జిల్లా వ్యాప్తంగా తెలుగు భాషా సదస్సులు పెట్టాలని నిర్ణయించు కున్నట్లు, అందులో భాగంగానే కరీంనగర్‌లో సదస్సును నిర్వహిస్తు న్నట్లు తెలిపారు. తెలుగు రాష్ట్రాలలో భాష అమలు, వాడుక ఇంటి నుండే ప్రారంభం కావాలని, స్పష్టమైన ఆలోచన, తగిన కార్యాచరణ వుంటే తెలుగు మళ్ళీ పూర్వవైభవం సంతరించుకుంటుందని అసెంబ్లీ స్పీకర్ శ్రీ మధుసూదనాచారి అన్నారు.

రాష్ట్ర ఆర్థికమంత్రి శ్రీ ఈటెల రాజేందర్ మాట్లాడుతూ, నాకు పెద్దబాలశిక్ష చదివితేనే మాతృభాషైన తెలుగుభాష జ్ఞానం, మానవతా విలువలు తెలిసేవని అన్నారు. ఆంగ్లమాధ్యమం వైపే తల్లిదండ్రులు మొగ్గు చూపుతున్నారని, రాజకీయనాయకులు ఎవ్వరూ సమస్య మూలాల్లోకి వెళ్ళడం లేదని ఆవేదనను వ్యక్తం చేశారు. ప్రజల వైఖ రుల్లో మార్పు రాకుంటే మాతృభాషా పరిరక్షణ ఎలా సాధ్యమవు తుందని ప్రశ్నించారు. టీచర్లు, మేధావులు, సాహితీవేత్తల పిల్లలు కూడా ఆంగ్లమాధ్యమం వైపే అభిమానం చూపిస్తూ, సదస్సులు అంటూ పెడితే ఏం లాభముంటుందని ప్రశ్నించారు.

తెలుగు భాషను మాతృభాషగా కాపాడుకోవడానికి విస్తృత చర్చలు జరగాలి. ప్రపంచవ్యాప్తంగా విద్యా లక్ష్యాలపై స్వయంపోషక స్థితిపై చర్చ జరుగుతోందని, మాతృభాషా పరిరక్షణ పెద్ద ఉద్యమంగా ప్రజల్లో కదలికలు తీసుకొని రావాలని ప్రముఖ విద్యావేత్త డా॥చుక్కా రామయ్య ఉద్బోధించారు.

తెలంగాణాలో తెలుగు భాషాభివృద్ధి జరగాలి. ఉమ్మడి రాష్ట్రం ఏర్పడిన తర్వాత 18 ఏళ్ళకు రాష్ట్ర అధికార భాషాసంఘం ఏర్పా టైందని, ఇకనైనా తెలంగాణాలో భాషా, సాహిత్యాల అభివృద్ధి జరిగి తీరాలని తాను కాంక్షిస్తున్నట్లు తెలంగాణా రాష్ట్ర అధికార భాషా సంఘం ఛైర్మన్ దేవులపల్లి ప్రభాకరరావు అన్నారు.

ఆచార్య కోవెల సుప్రసన్న, తెలుగు అకాడమీ పూర్వ సంచా లకులు ఆచార్య కె.యాదగిరి, హైదరాబాద్ విశ్వవిద్యాలయం ఆచా ర్యులు డా॥గారపాటి ఉమామహేశ్వరరావులు మాట్లాడుతూ, ఆంగ్ల మాధ్యమాలపై పెరిగిన మోజును తగ్గించాలని, సామాన్యులలో మాతృ భాషపట్ల ప్రేమను పెంచాలని, ఇందులకు రెండు తెలుగు రాష్ట్రాలలో ఉద్యమకారులు కదిలి రావాలని అన్నారు. భాషా పరిరక్షణ ఉద్యమం సమైక్యంగా జరగాలని, ఉపాధి, విజ్ఞానం మాతృభాషతోనే ముడిపడి వున్నాయన్న నిజాన్ని అందరం ఒప్పుకొని తీరాల్సిందేనని అన్నారు.

డా॥కొండలరావు మాట్లాడుతూ, తెలంగాణాలో తెలుగుభాషా పరిరక్షణ ఒక ఉద్యమంలా కదిలి వస్తోందని, ఇందులకు ఈ సదస్సు పునాదులు వేసిందని అన్నారు. తెలుగు మాతృభాష అమలుకై ఎన్నెన్నో అడ్డంకులు, లేనిపోని భ్రమలున్నాయని, వీటిని ఛేదించాలని అన్నారు. తెలుగుభాష మృగ్యం కాకుండా చూసుకోవాల్సిన బాధ్యత టీచర్లు, మేధావులపై వుందని, తమ బాధ్యతలను నెరవేర్చేలా కృషి చేయాలని పిలుపునిచ్చారు.

**–సంకేపల్లి నాగేంద్రశర్మ,** కరీంనగర్

కరీంనగర్ తర్వాత మహబూబ్‌నగర్‌లో కూడా సభ విజయవంతంగా జరిగింది. వివరాలు మాకు తెలియరాలేదు. సెప్టెంబరు 7న నిజామాబాద్‌లో జరుగనుంది. –సం.

-కాటూరు రవీంద్రత్రివిక్రమ్
98495 68901

# తెలుగమ్మాయి సింధు విజయం దేశానికే కీర్తికిరణం

ఒకప్పుడు దేశాలమధ్య ఆధిక్యత కోసం నిరంతరం యుద్ధాలు జరుగుతుండేవి. అశాంతి, అపారజననష్టం, అంతం కానిశతృత్వం వంటివి ప్రపంచశాంతికి భంగం కల్గిస్తుండేవి.

ఈ పరిస్థితిని చక్కదిద్దటానికి ప్రపంచ దేశాల మధ్య క్రీడా పోటీలు ఏర్పాటు చేశారు. అదే 'ఒలింపిక్స్'గా కొనసాగుతోంది. ఓటమిని క్రీడాస్ఫూర్తితో స్వీకరించటానికి అలవాటు పడినాక దేశాల మధ్య సత్సంబంధాలకు అది పునాది అయింది.

ఏ దేశానికాదేశం, ఏ ఖండానికి ఆ ఖండం కాలవ్యవధుల నిర్ణయంతో క్రీడల పోటీలు నిర్వహించటం ఆనవాయితీగా మారింది. ఎన్ని పోటీలు జరిగినా ఒలింపిక్స్ ప్రాధాన్యత దానిదే, ప్రపంచ ప్రేక్షకులంతా కన్నార్పకుండా, ఉత్సుకత, ఉత్కంఠతో వీక్షించే క్రీడలు 'ఒలింపిక్స్' పందేలు.

ఒలింపిక్స్‌లో సత్తా చాటటానికి ప్రతిదేశమూ కసరత్తు చేస్తుంటుంది. ఆర్థిక, ఆయుధ ఆధిపత్యాలు ఉన్న అగ్రదేశాలనుండీ, బడుగు దేశాల వరకు ఒలింపిక్స్ క్రీడల్ని దేశగౌరవాన్ని ఇనుమడింపజేసే అరుదైన గౌరవంగా భావించి పోటీల్లో పాల్గొంటారు.

అమెరికా, రష్యా, బ్రిటన్, చైనా దేశాలు పతకాల సాధనలో ముందుంటాయి. అమెరికా రష్యాల మధ్య ఈ పోటీ మరీ ఎక్కువ. గత ఒలింపిక్స్‌లో చైనా తన సత్తా చాటింది. ఈమాటు అమెరికా ముందంజలో ఉంది. భారతదేశానికి సంబంధించి, ఒలింపిక్స్‌లో మన స్థానం క్రిందన వెతుక్కోవల్సిందే. మనకి మిల్ఖాసింగ్, మల్లీశ్వరి, ధ్యాన్‌చంద్, అభినవ్ బింద్రా, పరుగుల ఉషాలాంటి మేటి క్రీడాకారులు లేకపోలేదు. కానీ, అగ్రదేశాలతో పోటీపడేస్థాయికి ఇంకా మనం చేరుకోలేదు. చేరుకోగలమా అనేది ప్రశ్నార్థకం.

ఇలాంటి పరిస్థితిలో పుల్లెల గోపీచంద్ 'షటిల్'లో మెరిశాడు. అతని పేరు మీద క్రీడా శిక్షణ సంస్థ హైదరాబాదులో ఏర్పాటయింది. అందులో శిక్షణపొందిన పి.వి.సింధు విజయసోపానాలు అధిరోహిస్తూ ఒలింపిక్స్ అంతిమపోరు వరకు చేరుకోవటం సామాన్య విషయం కాదు. చేరుకొన్నాక వత్తిడిని అదుపులో ఉంచుకొంటూ ప్రత్యర్థి బలహీనతలు గుర్తిస్తూ, పాయింట్లు సాధించాలి.

ప్రపంచ క్రీడా స్థాయిలో మొదటిస్థానంలో ఉన్న మారియా ఆటలో కొన్ని కిటుకులు పాటిస్తుంది. ఎక్కడా తొణకదు, బెణకదు, వత్తిడిని పూర్తిగా అదుపులో ఉంచుకుంటుంది. ఆత్మవిశ్వాసాన్ని చెదరనివ్వదు. ప్రత్యర్థి బలహీనతల్ని జాగ్రత్తగా గుర్తించి, వాటిమీద దాడి చేస్తుంది. రెండవ ఆట నుండీ విజృంభిస్తుంది. ఆట చేజారకుండా ఎంతో శ్రద్ధ చూపుతుంది. ఇవన్నీ ఆమె విజయానికి కారణాలే.

అంతిమపోరులో సింధు మొదటి ఆటగెలిచి ఆశలు చిగురింపజేసింది. కొన్ని ప్రతర్థి ఆటల వేటులకు స్థిరత్వం కోల్పోయింది. ఒకమాటు నిబ్బరం పోయాక పతనాన్ని అడ్డుకోవటం కష్టం. వత్తిడి తప్పు మీద తప్పు చేయిస్తుంది. ఆత్మవిశ్వాసాన్ని నీరుగారుస్తుంది. చివరకు ఓటమి పాలు జేస్తుంది. సింధు విషయంలోనే కాదు ఎవరి విషయంలో నైనా, ఏ క్రీడలోనైనా ఇలాగే జరుగుతుంది. నైపుణ్యం ఉండీ ఓడిపోవటం ఎక్కువ బాధను కల్గిస్తుంది. క్రీడాకారునికి, అభిమానులకీ కూడా.

క్రీడానైపుణ్యం మాత్రమే కాదు, ప్రతికూల పరిస్థితుల్లో కూడా తట్టుకుని నైపుణ్యాన్ని కాపాడుకోగల స్థైర్యాన్ని సమృద్ధిగా కలిగించి సంపూర్ణ శిక్షణ ఇవ్వాలి. లేకపోతే గెలవగలిగీ ఓడిపోతారు.

'సింధు' తన ఓటమిని క్రీడాస్ఫూర్తితో స్వీకరించి ప్రత్యర్థి నైపుణ్యాన్ని ప్రశంసించటం ఆరోగ్యకరమైన అలవాటు, అందుకు ఆమె అభినందనీయురాలు. రజిత పతకం తెచ్చినందుకే ఆమె మీద వరాల జల్లు కురిసింది. బంగారు పతకం తెచ్చి ఉంటే, ఆ అభినందనల్ని ఆమె మోయలేకపోయేదేమో. ఇది వర్థమాన క్రీడాకారులకు ఒక ఆకర్షణ. ఒలింపిక్స్ విజయం వ్యక్తిగతంగా కన్న, అంతర్జాతీయ, దేశీయ స్థాయిల్లో ప్రతిష్ఠాత్మకమైంది. మనదేశంలో అన్ని క్రీడలూ ఉన్నాయి. వాటిలో కూడా రాజకీయ ప్రమేయాలున్నాయి. సుప్రీంకోర్టు ఇటీవల క్రికెట్ బోర్డుకి పట్టిన రాజకీయ గ్రహణాన్ని వదిలించింది. అవినీతి, ఆశ్రిత పక్షపాతం, లైంగిక వేధింపులు, క్రీడారంగాన్ని కుదేలు చేస్తున్నంత కాలం మనం ఒలింపిక్స్‌లో విజయ విహారం చెయ్యడం పగటికలే అవుతుంది.

క్రీడాకారులకు సరైన ప్రోత్సాహం లేదు. నిస్పృహతో కొందరు మేటిక్రీడాకారులు ఆత్మహత్యలు చేసుకోవటం హృదయ విదారకం.

మనకి పటిష్ఠమైన క్రీడా ప్రణాళిక, వనరులు, ప్రోత్సాహం, ప్రభుత్వ సహాయం సహకారం ఎంతో అవసరం.

ఒక్కరోజులో ఎవరూ అద్భుత క్రీడాకారులు కాలేరు. క్రీడా జీవితం బాల్యంలోనే మొదలవుతుంది. అంకిత భావంతో నిత్యకృషి చేస్తునే ఉండాలి. అంచెలంచెలుగా స్థాయిని పెంచుకోవాలి, పోటీలు పాటవ పరీక్షలు. వాటి ఆసరాతో క్రీడాకారులు ఎదుగుతూనే ఉండాలి. తమ రికార్డుల్ని తామే అధిగమించాలి.

ఈమాటు ఒలింపిక్స్‌లో మన మహిళలు తమ శక్తిని ఎంతో గొప్పగా ప్రదర్శించారు. ఇది తర్వాత తరాలవారికి ఆదర్శం కావాలి.

"సాధించిన దానితో సంతృప్తిని చెందకుండా" మరిన్ని ఉన్నత లక్ష్యాలతో కృషిని కొనసాగించేందుకు నిబద్ధులు కావాలి. ప్రపంచం అచ్చెరువొందేలా వచ్చే ఒలింపిక్స్‌లో పతాకాల పంటను పండించాలి. అలా జరుగుతుందని ఆశిద్దాం.

'సింధు' తెలుగమ్మాయి కావడాన్ని మనం ఇక్కడ ప్రత్యేక గర్వకారణంగా చెప్పుకోవాలి. ఆమెకు శిక్షణ ఇచ్చిన పుల్లెల గోపీచంద్ కూడా తెలుగువాడే. చిత్తూరుజిల్లాకు చెందిన ఇ.రజని కూడా ఒలింపిక్ పోటీలో ముందడుగు వేస్తున్నసంగతిని మనం గమనించాలి. తెలుగుజాతి గర్వకారణంగా నిలిచిన మన పుత్రికారత్నాలను మనసారా అభినందిద్దాం. ❊

-కీ.శే. ఆదిభట్ల నారాయణదాసు

# బడి పద్దెము



శ్రీ ఆదిభట్ల నారాయణదాసు గారు (31 ఆగస్టు 1864-2 జనవరి 1945) ప్రఖ్యాత హరి కథకులు. ఆదిభట్ల నారాయణదాసు గారికి 'హరికథాపితామహ' అనే బిరుదు వుంది. వారి ఊరి పేరు కూడా కలిసి వచ్చేట్టు శ్రీమత్ అజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసుగారని అందరూ వ్రాసేవారు. అచ్చతెలుగుపై ఆయనకు గల మక్కువను బట్టి ఆయనను సంస్కృత వ్యతిరేకిగా పొరపాటు పడరాదు. సంస్కృతభాషలో ఆయన దిట్ట. హరికథా పితామహుడుగా 10 హరికథల్ని ఆయన తెలుగులో రచించి స్వయంగా గానం చేశారు. సంస్కృతంలో కూడా 'శ్రీకృష్ణకథాసారము' అనే హరికథను ఆయన రచించి, గానం చేశారు. బాటసారి అనే లఘు కావ్యంతోపాటు కొన్ని శతకాలను ఆయన రచించారు. షేక్స్పియర్, కాళిదాసుల కవిత్వానికి తెలుగుసేతగా 'నవరసతరంగిణి'ని వ్రాశారు. విష్ణుసహస్రనామాలను అచ్చతెలుగు చేశారు. ఋగ్వేదాన్ని, భగవద్గీతను అచ్చతెనుగులో రచించారు. ఇవి ఆయన రచనల్లో కొన్ని మాత్రమే. బహుభాషా పండితుడై వుండియు, ఆయనకు భాషలపట్ల, ముఖ్యంగా తెలుగుపట్ల గల స్పష్టత-అందరికీ ఆదర్శం. అందుకు కొందరు పండితశ్రేష్ఠులనుకొనేవారు ముఖం తిప్పుకున్నా, ఆయన పాండిత్యానికి జోహారులర్పించక తప్పలేదు.

అచ్చతెలుగు కోసం ఆయన చాలా కృషి చేశారు. అచ్చతెలుగులో ఆయనకున్న పట్టుకు, పట్టుదలకు సాటిలేదు. మచ్చుకు ఇది చదవండి. -సం.

తీయన మెత్తన - తేఁట తెల్లంబు
నుదులలో నచ్చతె - నుంగు నయంబు ॥ ౧ అడుగు

వాడుకన్దోలినాటు - పల్కులన్దప్ప
మణిలేదుమానిసి - మాటలగొప్ప ॥ ౨ ॥

అచ్చ తెలుఁగువార - లచ్చ తెనుఁగు
తెలియనియెడ వారి - తెల్విదొసంగు ॥ ౩ ॥

తేఁటతీయని యచ్చ - తెలుఁగు రాకున్న
తెలుఁగు వారికిఁకెద్ది - తెలియుట సున్న ॥ ౪ ॥

ఉట్టికెగురలేక - యుఱుకునా మింట
తన్నెఱుంగక యొరు - న్దాఁగనునంట ॥ ౫ ॥

తాఁబొత్తిటన్విన్న - తన తల్లిపాట
తెలియఁజాలకిఁకెట్లు - తెల్పుఁబైమాట ॥ ౬

తిన్నఁగా ఁదనయిల్లు - తెలియనిజోసి
చుక్కలనెటు గడిం - చున్గనుమూసి ॥ ౭

అంద ఔట్టినమాట - లాడినఁ బర్వు
బయలగునని వింత - పల్కునచ్చెర్వు ॥ ౮

తెలియుటన్జప్పన - తేఁట తెనుంగు
తెల్పీ తెలియని సు - ద్దియెడలరంగు ॥ ౯

తనుఁబెంచు తల్లి మీఁ- దన్గూర్మిజార్చు
తనువంచు వగలాడి - తాపులకోర్చు ॥ ౧౦

తనకన్నవారల - న్దన పుట్టుచోటు
తన బాస తెలియని - ద్రాబటాటోటు ॥ ౧౧

ప్రాఁబల్కులన్వేల్పు - బాసచే డాబు
గొలిపి టక్కరనించు- కొనుఁదనజేబు ॥ ౧౨

మరియాదగోరిన - మంచివాఁడనఁడు
తనమాటదక్క విం - తపలుకు వినఁడు ॥ ౧౩

అచ్చ తెలుఁగువారి - కచ్చ తెనుంగు
ఒక్క కొలమువారి - కొక్కటెరంగు ॥ ౧౪

వేల్పుబాసారిన - వెలయునా మెప్పు
సిరితోడఁబోవు నా - చీఁకటితప్పు ॥ ౧౫

బరువగుటేగాక - పరువూడ్చు నెర్వు
నగుబాటగు న్బాడి - నన్బెడదర్వు ॥ ౧౬

పుట్టుపల్కెంతయు - న్ముద్దులమూఁట
కొనితెచ్చుకొన్న తె- గుల్పెఱమాట ॥ ౧౭

తనయూరు తన యొడ - ల్తన పుట్టుపల్కు
తనచవి తనబిడ్డ - తనకింపుగుల్కు ॥ ౧౮

తొడవుదాల్చిన పేద - దొరయగుటెట్లు
బడుగు పెండ్లికొడుకు - పడయుఁజీవాట్లు ॥ ౧౯

సాజముకాని వే - సము జోలిపోడు
వేల్పుబాసాడఁడె - ప్డేతగువాఁడు ॥ ౨౦

వేల్పులకేచెల్లు - వేలుపుపల్కు
మానిసికిన్దగు - మానిసికుల్కు ॥ ౨౧

వెక్కిరింపఁదగదు - వేలుపుమాట
నిక్కపుమానిసి - నిక్కియిచ్చోట ॥ ౨౨

కొఱగాని దేబెగై - కొనువాలకంబు
వేల్పుసోదెలువల్కు - వెట్టిమొగంబు ॥ ౨౩

అడవిలో వేల్పు బా - సాడనీజోగి
టాటోటు నోటఁబ - ట్టనిపల్కు సేగి ॥ ౨౪

లోటురాఁబోదు వే - ల్పునుడి రాకున్న
దఱుగదు పెఱుగద - ద్దములోని జొన్న ॥ ౨౫

దయ్యపుపలవింత - తగదు మానిసికి
కొఱగాని మాటవా - కొననేల నసికి ॥ ౨౬

నెలలోని మచ్చకుం – దేలైననేమి
నత్తిమాటలందీఱు – నా తెల్వివేమి ॥ ౨౭
తానెత్తి యెత్తింపఁ – దగు నాటుమాట
బ్రతుకు హాయిగ బయ – ల్పదు నెల్లనోట ॥ ౨౮
వింట నల్లినమిద్దె – వేలుపు బాస
తగదు మానిసులకా – దయ్యపుగోస ॥ ౨౯
ఎల్లతెఱింగిన – దే తెల్గుబాస
తక్కినదంతయు – న్దయ్యపుగోస ॥ ౩౦
ఒండొరులకు నేస్త – మొనరింపఁజాలు
మానిసులకు నాటు – మాటలే మేలు ॥ ౩౧
పనికిమాలినకట్లు – పడరానిపాట్లు
దయ్యపుతిట్లు తుం – టరి పనిముట్లు ॥ ౩౨
కుళ్లాయిపెట్టిన – కోఁతి రాజగున
వింతనుడులవాని – పెద్దనఁదగున ॥ ౩౩
తలపోయనేల నం – దఱు మనుచోట ॥ ౩౪
మనుగడకున్నాటు – మాటలే చాలు
పడనేల దయ్యపు – పల్కు తంటాలు ॥ ౩౫
నెమ్మది మాని మా – నిసులెల్ల సతము
పోరాడుటకు దయ్య – పుంబల్కు కతము ॥ ౩౬
కూళసోమరిపోతు – కొంటెదొంగలను
లేవు దయ్యపునుడి – లేని బెంగలను ॥ ౩౭
టక్కు డెక్కులకుఁ దుం – టరి వెచ్చములకు
బొంతదయ్యపు బాస – పొరపొచ్చెములకు ॥ ౩౮
కొలము తప్పులకు వె – క్కురు వేసములకు
బాదు దయ్యపునుడి – బలుమోసములకు ॥ ౩౯
సన్నాసి వేల్పుబా – సన్జొరనీరు
బ్రతుకొండొరులపొత్తు – వలచినవారు ॥ ౪౦
వేలుపుబాస పో – విడిచి నేర్పరులు
నిజమరులై మేల్కొ – నెద రెల్లతఱులు ॥ ౪౧
తలఁపుపుట్టించు విం – తగ నాటు బాస
తలఁపెంతయుఁగలంచు – దయ్యపుగోస ॥ ౪౨
మెలఁకువ వంటిదె – మ్మెయి నాటుబాస
దబ్బఱకలఁబోలు – దయ్యపుగోస ॥ ౪౩
దారితప్పక నడ్పఁ – దగు నాటుబాస
తబ్బిబ్బుగావించు – దయ్యపుగోస ॥ ౪౪
కూటికక్కూర్తి ని – గుడు కూళనోట
వెల్లడింపఁజనదు – వేలుపుమాట ॥ ౪౫
మానిసులందఱ – న్మన్నించునోరు
పడయఁదగు న్వేల్పు – బాస నాపేరు ॥ ౪౬
మంచి సలుపునాటు – మాటలకన్న
జగమున వేల్పు బా – స మఱిసున్న ॥ ౪౭
నాటుమాటల నేర్చి – నన్గానరాని
మాటలగున్నాటు – మాటలెందేని ॥ ౪౮
మానిసివేలుపు – మాటాడరాదు
నంబిజన్నము చేయ – నాయము కాదు ॥ ౪౯
వేల్పుబాసకుఁ దల – విఱిచిన తెనుఁగు
నీరుల్లిపాయ కం – టించిన పునుఁగు ॥ ౫౦
తగులమునన్జిక్కు – తంటాలముచ్చు
తెలిసియో తెలియకో – తెలుఁగనవచ్చు ॥ ౫౧
చెప్పఁదరము కాని – జేజేలమాట
యెట్లు పల్కన్దగు – నెడ్డెలనోట ॥ ౫౨
వెల్లడికావచ్చు – వేలుపుమాట
మూఁడుకాళ్ళ ముసలి – ముద్దలనోట ॥ ౫౩
నాటుమాటలు పొత్తు – నడుపు నెల్లరికి
దయ్యపునుడులగు – న్దప్పు కల్లరికి ॥ ౫౪
తరలిపోయిన యవ్వ – దయ్యపు గోస
బ్రతికున్నతల్లి యి – ప్పటి నాటుబాస ॥ ౫౫
దండుగే నోటికి – దయ్యపు గోస
పండుగే చెవులకి – ప్పటి నాటుబాస ॥ ౫౬
వ్రాతకంటె న్బల్కు – పదిరెట్లు మేలు
నీడకన్న నిజంబు – నెమ్మదినేలు ॥ ౫౭
నోటిమాటల చవి – న్బోఁగొట్టు వ్రాఁత
మీఁటెట్లు తెలుపు నె – మిలి తీయకూఁత ॥ ౫౮
వంగవరుగు చేసి – వాడుకొన్నట్లు
పలుకులు వ్రాలుకాఁ – బడె నలుతట్లు ॥ ౫౯
మూఁగసన్నల జగం – బునకెల్ల మేలు
తేఁటగీఁతల నచ్చ – తెలుఁగుచే వ్రాలు ॥ ౬౦
అమొదలక్కరముల – కన్నింటికొను
కొనకొండు పెక్కుల – గుఱ్ఱానురాను ॥ ౬౧
అ ఆ ఇ ఈ ఉ ఊ – ఐ ఎ ఏ ఔ లు
ఓ ఒల్కు తుకనంటి – యొదవిన వ్రాలు ॥ ౬౨
క చ జ ట డ ణ త ద – గ న మ య హాలు
ప ర ఱ ల ళ వ స హ – బాల్పొల్లు దేలు ॥ ౬౩
మొత్తముపై వ్రాలు – ముప్పదిమూఁడు
చదువుచు వ్రాయున – చ్చపు తెల్గువాఁడు ॥ ౬౪
వ్రాతగుర్తు లు గాని – వ్రాలుకావెందు
నెఱయరసున్న వెం– తేబాసలందు ॥ ౬౫
వ్రాలు రెండే తర్చు – పల్కుల కెల్ల
నోటిమాటల తుద – న్బొల్లుంటకల్ల ॥ ౬౬
ముకుచెవినాల్కక – న్బొందులైదింటఁ
దెలియుమై తాలుపు – దినుసులొండొంట ॥ ౬౭
తలఁపు ముత్తెన్నుల – న్దా నెఱిఁగించు
సడిరూపు తాఁకుల – సన్న గావించు ॥ ౬౮
జగమెల్ల సడిచూపు – సన్నలనడఁగు
సడియురూపు వ్ర్వాఁత – సన్నల న్గదఁగు ॥ ౬౯
ఎల్లపల్కులఁదెలుఁ – గే మేలు బంతి
ప్రజలలోన న్దెల్గు – వాఁడే వలంతి ॥ ౭౦
తెన్గునాడే నలు – దెసల నా డెమ్ము
పాటలాటలు తెల్గు – వారలసొమ్ము ॥ ౭౧
ఎల్లబాసలకుఁ దె – ల్గే కడుమేలు
పాడు చాడుచు మచ్చ – పడని యిల్లాలు ॥ ౭౨
పుట్టుకతోఁబొగ – పునఁ దోచుకూర

తెలుఁగుపల్కు చెలి పెం - డిలి కట్టుబీర ॥ ౭౩
వడితుది రెండవ - వ్రాలు సబాము

పరగు తెల్గునకొందు - బాస గులాము ॥ ౭౪
నడికట్లు తలకట్లు - నయమెల్లచోట్ల

నడివ్రాల కొప్పారు - బద్దెముపట్ల ॥ ౭౫
ముప్పదిముగురు వే - ల్పులుగానఁ దెనుఁగు

ముప్పదిమూఁడు వ్రా - ల్పొనరించు టనుఁగు॥ ౭౬
ఏచపలుకు సొగ - సెటు తెల్పుఁగమ్మ

పలుకునకు సురులే - వడివ్రాతబొమ్మ ॥ ౭౭
మైమాడ్కి జంత్రము - మది దెల్పలేదు

కొమ్మువలె నొప్పెమ్మ - కోర్కెలీఁబోదు ॥ ౭౮
పొత్తమొజ్జవలెని - మ్మున్నప్పుటెట్లు

నాల్కకలముకన్న - నయము వేరెట్లు ॥ ౭౯
వ్రాఁతయెరపుసొమ్ము - పల్కుసొజమ్ము

వ్రాఁత కొంటెతనమ్ము - పల్కునిజమ్ము ॥ ౮౦
చదువరికంటెఁ దాఁ - జాకియే మేలు

కోరి చదివి తెచ్చు - కొంద్రు తంటాలు ॥ ౮౧
మోసకాంద్రకుఁబొత్త - ములు పనిముట్లు

వ్రాత తెచ్చున్మంచి - వారికిక్కట్లు ॥ ౮౨
మానిసులకుఁదక్కు - మైతాల్పులట్లు

మునుపు లేవక్కర - ములపడిట్లు ॥ ౮౩
తలఁపు తెల్పున్ హెచ్చు - తగ్గులవ్రోఁత

వ్రాఁతయుం జదువును - వచ్చెఁదర్వాత ॥ ౮౪
తెల్పిపాయఁబు ము - దిరినకొలంది

రావలసెఁజదువు - వ్రాఁతయిబ్బంది ॥ ౮౫
తనతప్పు తలఁచని - త్రాగుఁబోతట్లు

దుదుకునఁజదువరి - త్రుళ్లునట్టిట్లు ॥ ౮౬
చదువువ్రాఁతలు మత్తు - సలుపు మానిసికి

నిక్కాఁక పుట్టించు - నెమ్మేని కసికి ॥ ౮౭
కలము పట్టనివాఁడు - గట్టిగా బ్రతుకు

వ్రాఁత కాఁడు న్గాపు - రము చేయఁగొతుకు ॥ ౮౮
విసము విసము చేత - విఱిగిపోవలయు

చదువున నగు తెగు - ల్చదువునఁబొలయు ॥ ౮౯
కూటికయి చదువు - కొనుఁబెంకెవాఁడు

గుండెయెండి మఱెందు - కున్నన్కి రాఁడు ॥ ౯౦
మగతనమూడ్చు సో - మరి చదువేల

పొట్టకక్కుర్తి డా - బులుకొట్టు బేల ॥ ౯౧
మంచినడతకన్న - మఱి చదువెద్ది

పాటు మానిసి హోయి - బ్రతుకునకుద్ది ॥ ౯౨
గడుసుమానిసికన్న - దోఁగవ్వ మేలు

కూటికై సన్నాసి - కొట్టు దబ్బాలు ॥ ౯౩
కూడుగుడ్డ గడించు - కొను తెల్విత్తప్ప

మానిసి బ్రతుకున - మఱి లేదు గొప్ప ॥ ౯౪
పనిచేయ కుత్తడం - బముచూపు చెడ్డ

మై బిగిచెడి వంత - మైఁ బట్టునడ్డ ॥ ౯౫
అడుచుం బాడుచు - హోయిగా బ్రతుకు

పాటుమానిసి కెడ - బడు నెమ్ములతుకు ॥ ౯౬
అందఱునెదెలియు మా - టాడినఁజాలు

మానిసికిన్నాటు - మాటలే మేలు ॥ ౯౭
తనయింటి బాసవ్రాఁ - త యెఱుఁగువాఁడు

సోదె దయ్యపుగోస - జోలికిఁబోఁడు ॥ ౯౮
అచ్చ తెలుఁగు మాట - లాడిన జాణ

పలువురౌనఁబాట - పాడినగాణ ॥ ౯౯
అచ్చ తెనుఁగు వ్రా - యన్పల్క లేక

వదరు దయ్యపు బాస - నడిబడిమూఁక ॥ ౧౦౦
జగమునకు న్మేలు - సల్పనివ్రాత

తగదెంతయు న్గూళ - దయ్యముకూఁత ॥ ౧౦౧
తెనుఁగనఁ దెలిసిన - దే తెల్పుమాట

జేజేల నుడిపల్కఁ - జెల్ల దేనోట ॥ ౧౦౨
అచ్చపునాటు మా - టాడుటే నీటు

కలగల్పు బాసలు - కబ్బము చేటు ॥ ౧౦౩
సరిగ మేల్సల్పున - చ్చపు నాటుమాట

కన్న వేలుపు బాస - కలుగ దెచ్చోట ॥ ౧౦౪
నోఁటబట్టనిచిక్కు - నుడివెఱ్ఱులల్లి

వేల్పు బాసయని పే - ర్పెట్టిరి తొల్లి ॥ ౧౦౫
పలుకుబడియు వ్రాఁత - వాడుకన్బట్టి

తనతల్లివలెఁ దెల్పం - దగు గనిపెట్టి ॥ ౧౦౬
కందము సీసము - క్కరముతర్వోజ

యచ్చ తెలుగుపద్దీ - యములగునోజ ॥ ౧౦౭
ఒంటియడుగుపద్దె - మొప్పారదొండు

పద్దియఁబులకెల్ల - వడితప్పకుండు ॥ ౧౦౮
కాలురెండవ వ్రాయి - కారాదువేఱు

సీసమునందిట్టి - చిన్నియమాఱు ॥ ౧౦౯
అగుబడి తర్వోజ - యద్గుసంగోరు

పోలుదీనికిఁదొల్లి - పూగుత్తిపేరు ॥ ౧౧౦
రెండడ్గుగుల కొనల - రెట్టించు వ్రాయి

బడిపద్దియము గుర్తు - పట్టించుహాయి ॥ ౧౧౧
అమరు నీ బడిపద్దె - మచ్చ తెన్గునకు

కడమకానుపు గొద్ది - గడబిడకొనకు ॥ ౧౧౨
వల్లించుకొన సుళ్వు - పద్దెముకూర్పు

మాటలన్గుఱితిడ - మదిగొనదోర్పు ॥ ౧౧౩
తేటతీయని యచ్చ - తెనుఁగనువాఁడు

వాసికెక్కిన చదు - వరి మొనగాఁడు ॥ ౧౧౪ ❋

మాతృభాషల్ని అణచివేసే
ప్రభుత్వాలు ప్రజావ్యతిరేకమైనవి.
అభివృద్ధి నిరోధకమైనవి కూడ.
అలాంటి ప్రభుత్వాలను
అధికారంలో ఉండనీయకూడదు.

–ఒక సామాజిక ఉద్యమనేత

-డా॥మధురాంతకం నరేంద్ర
98662 43659

# సాహిత్య చరిత్ర రచన-సాధక బాధకాలు

**సాహిత్య చరిత్ర రచనలో తెలుగువాళ్ళు బాగా వెనకపడే వున్నారు. పోతన వంటి ప్రముఖ కవి జన్మస్థలం గురించి వివాదం అలాగే వెంటాడుతోంది. రచయితలూ, కవులూ, అందరు సాహిత్యకారులూ మొత్తం జాతి సంపద. చరిత్రను రాసుకోవడం నిర్దుష్టమైన అధ్యయనాల కోసమే గానీ దురభిమానాలను పెంచుకోవడం కోసం కాదు. గొప్ప సాహిత్య విమర్శలాగే సాహిత్య చరిత్ర రచన గూడా జాతి గొప్పస్థితిలో వున్నపుడే సాధ్యమవుతుంది. ఆ పని తెలుగులో ఆశించవలసిన స్థాయిలో జరగకపోవడానికి కారణాలేమిటో యిప్పటికైనా ఆలోచించాలి.**

**సా**హిత్య చరిత్ర రచన అన్నది చాలా ఆధునికమైన విభాగమని చాలామంది విమర్శకులు చెబుతుంటారు. యూరపులో యిది 18వ శతాబ్దంలో ప్రారంభమైందనీ, ఆ తరువాత కొద్దికాలానికే భారత దేశంలో గూడా ఆ పని మొదలయిందనీ స్టువర్ట్ బ్లాక్‌బర్న్, వసుధ దాల్మియా అనే విమర్శకులు పేర్కొంటారు. అయితే మొదట్లో రచనల్ని కాలానుగుణంగా జాబితా గట్టడమూ, వాటి మూలాలనూ, వ్యాఖ్యానాలనూ వొకచోట చేర్చడమూ వంటి పనులకే వాళ్ళప్పుడు ప్రాముఖ్యత నిచ్చారు. ఆయా గ్రంథాలను వొక విశాలమైన చారిత్రక, సాంస్కృతిక చట్రంలోకి తెచ్చి అర్థం చేసుకోవాల్సిన ఆవశ్యకతను వాళ్ళు పట్టించు కోలేదు. ఆధునిక సాహిత్య చరిత్రకారులు, సాహిత్యపు జాతీయ మూలాలనూ, భాషా విషయకమైన సంబంధాలనూ, రాజకీయ ప్రభావాలనూ ముఖ్యమైన అంశాలుగా గుర్తిస్తున్నారు.

కొన్ని నెలల క్రితం కేంద్ర సాహిత్య అకాడమీ వాళ్ళ సౌజన్యంతో శ్రీ వేంకటేశ్వరా విశ్వవిద్యాలయంలోని ఆంగ్లశాఖవాళ్ళు భారతీయ సాహిత్య చరిత్ర రచనల గురించి నిర్వహించిన సదస్సులో చాలా ఆసక్తికరమైన అంశాలు ప్రస్తావించబడినాయి. అందులో కొన్ని విషయాలు మొత్తం భారతీయ సాహిత్య చరిత్రకెంతగా ముఖ్యమైనవో, అంతగా తెలుగు సాహిత్య చరిత్ర రచనకూ అవసరమైనవే.

భారతీయ విమర్శ చాలావరకూ వ్యాఖ్యానధోరణిలోనే సాగింది. అందుచేత వివిధ కాలాల్లో సాహిత్యాన్ని తాత్విక, వేదాంత, నీతిశాస్త్రాల దృష్టితో పరిశీలించారు. ఆ అధ్యయనాలు అక్రమంగా చరిత్రకు ప్రత్యామ్నాయాలుగా తయారవుతాయని కొందరు విమర్శకులు గుర్తించారు. అయితే ఆధునిక విమర్శకులు ఆ అధ్యయనాలు యెప్పుడు ప్రారంభమైనాయో గుర్తించాలనీ, వాటిని కాలానుగుణంగా పేర్కొనడం యెప్పుడు మొదలయ్యిందో తెలుసుకోవాలనీ, సాహిత్య చరిత్రకూ, దేశ రాజకీయ చరిత్రకూ మధ్య వుండే సంబంధమెంత ప్రగాఢమైనదో తేల్చుకోవాలనీ వాదిస్తున్నారు. కాలనిర్ణయం, యుగవిభజన, ప్రక్రియా భేదాలు మొదలైన అంశాలను భాషా విబేధాలు, సాంఘిక రాజకీయ ప్రభావాలు మొదలైన విషయాల దృష్టితో పరిశీలించాలని భావిస్తున్నారు. భారతదేశపు అన్ని భాషల సాహిత్య చరిత్రలనూ పోల్చి చూడడమూ, సంస్కృత సాహిత్య చరిత్రను భారతీయులూ, విదేశీయులూ యెంత భిన్నంగా రాశారో తేల్చుకోవడమూ చాలా ముఖ్యమైన విషయాలుగా గుర్తించారు.

మధ్యయుగ కన్నడ సాహిత్య చరిత్రను రాస్తున్న ప్రముఖ కవి, నాటక రచయిత హెచ్.యస్.శివప్రకాశ్ భిన్న కులాలు, సమూహాలు, ప్రక్రియలకూ మధ్య జరిగిన సంఘర్షణలూ, సంధులూ, సర్దుబాటుల నన్నింటి సమాహారంగా సమగ్రమైన సాహిత్య చరిత్ర నిర్మాణానికి పూనుకుంటున్నానని వివరించారు. సాహిత్య చరిత్ర అన్నది కేవలం లిఖిత గ్రంథాలకు మాత్రమే పరిమితం గాదనీ, అది ప్రదర్శన రూపాల వాచకాలనూ పరిగణిస్తుందనీ ఆయన పేర్కొన్నారు. కన్నడ సాహిత్యం, లింగాయతులు, హరిదాసుల భక్తి రచనలను తప్పకుండా చేరుతాయని వాదించారు. అంతేకాకుండా దక్షిణ భారతదేశం వంటి ప్రాంతంలో కలిసి పెరుగుతున్న భాషా సాహిత్యాల మధ్య జరిగిన ఆదాన ప్రదానాలకు చాలా ప్రాధాన్యత వుందని జ్ఞాపకం చేశారు.

కొందరు సాహిత్య చరిత్రకారులు సాహిత్య ప్రమాణాలకే ప్రాముఖ్యతనిస్తూ నిర్దుష్టమైన చరిత్రను రాశారనీ, కొందరు వివిధ యుగాల ధోరణుల మధ్య వుండే తేడాలను చర్చించారనీ, మలయాళ విమర్శకులు యి.వి.రామకృష్ణన్, పి.ఆర్.రవీంద్రన్ భావించారు. కొద్దిమంది సామాజిక చరిత్రను పట్టించుకోలేదనీ, అది లోపమేననీ వాళ్ళు వాదించారు. సాంఘిక రాజకీయ ఆధునికతకూ, సాహిత్య ఆధునికతకూ మధ్య వున్న తేడాలను మలయాళ విమర్శకులు యెలా గుర్తించారో చెబుతూ, సంప్రదాయమూ, ఆధునికతలను బేరీజు వేయడానికి అభివృద్ధి అన్నదే కొలమానమని వాళ్ళు వాదించారు.

స్వాతంత్ర్యానికి ముందు వొకే రచయిత రాసిన సాహిత్య చరిత్రలకు భిన్నంగా మరాటీ సాహిత్య పరిషత్తు యేడు సంపుటాల సమగ్ర మరాటీ సాహిత్య చరిత్రను నిర్మించిన విషయాన్ని ప్రాచీ గుజార్పాద్యాయ ప్రముఖంగా పేర్కొన్నారు.

ఈశాన్య భారతదేశానికి చెందిన షిల్లాంగ్ నుంచీ వచ్చిన యెస్తర్ సియామ్ అనే విమర్శకురాలు అక్కడి భాష, 'కాశీ'కి చెందిన సాహిత్యం చాలావరకూ మౌఖికమైనతేననీ, వాళ్ళ జానపద గాథలూ, పురాణాలూ రకరకాల మౌఖిక ప్రక్రియలుగా రూపొందాయనీ, వాటినంతా గ్రంథస్థం చేయడానికీ, వాటి చరిత్రను నిర్దుష్టంగా రూపొందించడానికీ పాత పద్ధతులు సరిపోవనీ తేల్చి చెప్పారు.

తెలుగు సాహిత్యానికి ప్రాతినిధ్యం వహించిన ప్రముఖ విమర్శకుడు బి.తిరుపతిరావు భారతీయులు మొదటినుంచీ శృతపాండిత్యానికే ప్రాధాన్యతనిచ్చారనీ, జ్ఞాపకాల కిచ్చినంత ప్రాముఖ్యత గ్రంథస్థం చేయడానికి యివ్వలేదనీ, అందుకే పాశ్చాత్య సాహిత్య చరిత్రల్లో తారీఖులూ, దస్తావేజులకున్నంత నిర్దుష్టత, భారతీయ సాహిత్య చరిత్రలో కనబడదనీ నిరూపించి చూపెట్టారు.

తెలుగులో సాహిత్య చరిత్రకు వీరేశలింగం పంతులు గారి

ఆంధ్రకవుల చరిత్రతోనే శ్రీకారం చుట్టి నట్టుగా చెబుతారు. తరువాత పింగళి లక్ష్మీకాంతం గారి ఆంధ్ర సాహిత్య చరిత్ర, ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం, కొర్లపాటి శ్రీరామమూర్తి గారి తెలుగు సాహిత్య చరిత్ర వంటివి ప్రసిద్ధాలు. కన్నడ విమర్శకులు శివప్రకాశ్ చెప్పిన ప్రదర్శన వాచకాల ప్రాముఖ్యతను తెలుగు సాహిత్య రచయితలు అంతగా పట్టించుకోలేదు. తెలుగులో వున్నన్ని జానపద రామాయణ భారత భాగవత గాథలు మరే యితర భాషలోనూ వున్నట్టు కనిపించదు. తమిళనాడులో వున్న తొంభైశాతం జానపద ప్రక్రియల వాచ కాలు తెలుగులోనే వున్నట్టు తెలు స్తోంది. చాలాకాలంక్రితం తిరుచ్చిలో జరిగిన తమిళ జానపద సదస్సులో ప్రదర్శించబడిన చాలా ప్రక్రియల వాచకాలు తెలుగులోనే వున్నాయి. వీటి మూలాలను, పరిణామాలను, వ్యాప్తిని గురించిన పరిశోధనలు జరగలేదు.




శివప్రసాద్ గారు చెప్పిన మరో ముఖ్యమైన సంగతి- దక్షిణ భారతదేశపు భిన్న భాషా సాహిత్యాల మధ్య జరిగిన ఆదాన ప్రదానా లను గురించిన పరిశోధన. తెలుగు సాహిత్యానికి తమిళ సాహిత్యం తోనూ, కన్నడ సాహిత్యంతోనూ దగ్గరి ఆదాయ ప్రధానాలు కనబడ తాయి. మాతృభాషాభిమానమెంత అవసరమో, మన భాషకూ పొరుగు భాషలకు మధ్య వున్న సంబంధాలను తెలుసుకోవడమూ అంతే అవ సరం. భాషా ప్రయుక్త రాష్ట్రాలు అనవసరపు భాషాదురభిమానాలను పెంచాయి కానీ, ఆరోగ్యకరమైన సహజీవనాన్ని ప్రోత్సహించలేదు. స్వాతంత్ర్యానికి పూర్వం తొండనాడులో తమిళమూ తెలుగూ రెండూ సమాంతరంగా మనగలగడమూ, తమిళనాడులో కన్యాకుమారి నుంచీ కాట్పాడి వరకూ అనేక గ్రామాలకు గ్రామాలే తెలుగు గ్రామాలుగా నిలవగలగడమూ యిందుకు స్పష్టమైన వుదాహరణలు. త్యాగరాజు కీర్తనల ప్రసక్తిలేని తెలుగు సాహిత్య చరిత్ర నిర్దుష్టమైనదని యెలా భావించగలం?

ఇటీవలి కాలంలో ప్రచురించబడిన తొండనాడు కథలు, మొరసునాడు కథలు యిదివరకు వచ్చిన తెలుగు సాహిత్య చరిత్రల పరిమితులనే గుర్తు చేస్తున్నాయి. కర్ణాటకలోని కొన్ని జిల్లాలనూ, తమిళనాడులోని హోసూరు-కృష్ణగిరి జిల్లాలనూ, చిత్తూరు జిల్లాలోని పడమటి ప్రాంతాన్ని కలిపి ఆవరించిన మొరసునాడులో చిత్తూరు, హోసూరు ప్రాంతాల్లోని రచయితలు మాత్రం తెలుగులో రాయగలుగు తున్నారు. కోలారు, బళ్ళారి జిల్లాల్లోని కన్నడ రచయితలలో చాలా మంది మాతృభాష తెలుగే అయినా వాళ్ళు తెలుగులో రాయలేక పోయారు. అలాగే తొండనాడులోని తమిళ ప్రాంతపు రచయితలలో కొందరి మాతృభాష కూడా తెలుగే. ఆ ప్రాంతాల్లో పూర్వకాలాల్లో తెలుగు సాహిత్యం వెలుగొందింది. ఆ విషయాలనంతా తెలుగు సాహిత్య చరిత్రలో తప్పకుండా పొందుపరచి తీరాలి.

సాహిత్య చరిత్ర నిర్మాణంలో మరాఠీ సాహిత్య పరిషత్తు వాళ్ళ పద్ధతిని అనుసరించటం సబబుగా వుంటుంది. సాహిత్య చరిత్ర రచనలో నిర్దుష్టత లాగే నిర్మోహత (detachment) కూడా చాలా అవసరం. సమకాలీన సాహిత్యకారుల రచనల ప్రాముఖ్యతను అంచనా గట్టడం సాధ్యం కాదు. మానవ సహజమైన స్పర్థలూ, ఆవేశాలూ, అభిమానాలు నిజాన్ని కనపడనివ్వవు. ఇప్పటి రచనల అసలైన విలువ కొన్ని శతాబ్దాల తర్వాత, కనీసం కొన్ని దశాబ్దాల తర్వాతే నిగ్గు తేలుతుంది. ముప్పయి సంవత్సరాల ముందు ఆధునిక తెలుగు సాహిత్యంలో బాగా మోగుతూ వుండిన పేర్లు యిప్పుడు చాలా మాయమైపోవడం యిందుకు బలమైన సాక్ష్యాన్నిస్తోంది. కాబట్టి వీలయినంతవరకూ ఆధునిక సాహిత్యాన్ని గ్రంథస్థం చేయ డమూ, అన్ని ప్రక్రియలకూ సింహావలోకనాల్ని నిర్వహించి పర్యా లోకానాల్ని నిర్వహించడమూ అవసరం. యీ పనిని అనేక ప్రాంతాల్లో, అనేక మంది చేత చేయించగలిగినప్పుడు సమగ్రమైన పరామర్శలు వెలు వడుతాయి.

సాహిత్య చరిత్ర రచనలో తెలుగువాళ్ళు బాగా వెనకపడే వున్నారు. పోతన వంటి ప్రముఖ కవి జన్మస్థలం గురించి వివాదం అలాగే వెంటాడుతోంది. రచయితలూ, కవులూ, అందరు సాహిత్య కారులూ మొత్తం జాతి సంపద. చరిత్రను రాసుకోవడం నిర్దుష్టమైన అధ్యయనాల కోసమే గానీ దురభిమానాలను పెంచుకోవడం కోసం కాదు. గొప్ప సాహిత్య విమర్శలాగే సాహిత్య చరిత్ర రచన గూడా జాతి గొప్పస్థితిలో వున్నపుడే సాధ్యమవుతుంది. ఆ పని తెలుగులో ఆశించవలసిన స్థాయిలో జరగకపోవడానికి కారణాలేమిటో యిప్పటి కైనా ఆలోచించాలి. ❇

జాతి సాంస్కృతిక పతాక -మాతృభాష

బయటి తెలుగు బతుకు కతల మాలిక-4



# ఓ సంచారి అంతరంగం

కుప్పె నాగరాజు గారు కన్నడంలో రచించిన 'అలెమారియ అంతరంగ'కు రంగనాథ రామచంద్రరావు గారి తెలుగు అనువాదం

## శనిదేవుని దర్శనం

నాకు కుతూహలం కలిగించే విషయం ఏమిటంటే మనిషి మీద శనిలాంటి ఉగ్రదేవత ఎలా వస్తాడన్నది? నేను చిన్నప్పటి నుంచీ మా వాళ్ళు ఆడుతున్న శనిమహత్మ్యం నాటకంలో కనిపించే శనిపాత్రదారి రోషావేషాలు, అతని ఉగ్రస్వరూపం చూశాను. శనిపాత్రధారి ఆవేశభరితుడై తనను నిందించిన రాజు విక్రముడికి పెట్టకూడని కష్టాలు పెట్టి అతడికి సామ్రాజ్యాన్ని లేకుండా చేసి, కాళ్ళుచేతులను కత్తిరించి, అత్యుగ్రమైన శిక్షను ఇవ్వటం చూశాను. ఆ నాటకం చూస్తూ ప్రేక్షకులందరూ వణికిపోయి భయభక్తులతో శనిదేవుడికి భక్తిశ్రద్ధలతో నడుచుకోవటం గమనించాను. ఈ నేపథ్యంలో నాకు ఆ దేవుడి అర్చకుడి మీద వస్తున్న శనిమహాత్ముడిని చూడాలని కుతూహలం కలిగింది. వంటవాడైన బసోజికి హొసూరు శనిదేవుడి ఆలయానికి వెళుతున్న విషయాన్ని తెలిపి మా భాగం భోజనాన్ని తీసిపెట్టమని చెప్పి బయలుదేరాం. దేవాలయం చేరేలోపే వందలాది భక్తులు తమ కష్ట సుఖాలను దేవుడికి చెప్పుకుని వాటిని పరిహరించుకోవటానికి గుమిగూడారు. దేవుడు అప్పటికే ఆ మనిషిని ఆవహించాడు. ఆ మనిషి తెల్లటి అంగీ, పంచె కట్టుకుని చేతిలో ఒక పొడవైన బెత్తం పట్టుకుని ఉన్నాడు. మా నాటకంలో కనిపించే ఉగ్రవేషధారి శనికీ, ఈ శనికీ అజగజాంతర వ్యత్యాసం ఉంది. చేతిలో పట్టుకుని ఉన్న బెత్తాన్ని ముందుకు చాపి, ఒక్కరొక్కరినే పిలిచి వారి గురించి విచారిస్తున్నాడు. 'ఇంకా రెండు మూడు వారాలు నా సన్నిధికి రా, నీ సమస్య పరిష్కరిస్తాను'-ఇలా రకరకాలుగా చెబుతూ అనేకులకు అనేక విధాల పరిష్కారాలు సూచిస్తున్నాడు. దాంతోపాటు ఆ దేవుడి ఆవహించిన వ్యక్తి అప్పుడప్పుడు మండుతున్న కర్పూరాన్ని చేతిలో పెట్టుకుని; ఆ మంటను ఎలాగో భరిస్తూ భక్తుల్లో తన పట్ల భక్తిభావం కలిగేలా ప్రవర్తిస్తున్నాడు. చేతిలో నిమ్మపండు, విభూతి పట్టుకుని మంత్రించి భక్తులవైపు విసరుతున్నాడు. మేము ఈ చమత్కారాలన్నీ చూస్తూ భక్తిభావంతో చేతులు జోడించి నుంచున్నాము. ఆ శనిదేవుడు ఎక్కడ మా మీద కూడా తన వక్రదృష్టి సారిస్తాడోనని భయపడి ప్రతీ శనివారం తప్పకుండా అక్కడికి వెళ్ళేవాళ్ళం.

**తెలిసినా అనామకులు**

అమ్మలా నాన్న వారం, పదిహేను రోజులకొకసారి రాకపోయినా ఆయన మా ఊరి నుంచి మేళంతోపాటు ఊరూరు తిరుగుతూ వచ్చేవాడు. ఆయనతోపాటు కనీసం ముగ్గురు, నలుగురు ఉండేవారు. దాసరుల మేళం అంటే కచ్చితంగా ఇంత మంది ఉండేతీరాలి. ఒకడు ఏకతార వాయిస్తే, మరొకడు కంజీర, ఇంకొకడు చిరతలు, ఒకడు నేపథ్యం పాడితే దానికి కోరస్‌గా పాడటానికి మరో ఇద్దరు ఉండేవారు. ఆయన చెప్పే గేయకథలు, లావణిలు రక్తికట్టాలంటే ఇంత మంది గుంపు ఉండాల్సిందే. సామాన్యంగా ఇలాంటి మేళం ఎక్కువగా ఊరూర్లూ తిరగటం కోతల కాలంలోనే. వారం పది రోజులు ఇంటికి దూరంగా ఉండి తమ వృత్తిని చేసుకునేవారు. ఈ విధంగా మకాంపెట్టి భిక్షాటన చేయటాన్ని మా భాషలో "నిద్రపల్లి" అని పిలుస్తారు.



మా ఊరి నుంచి బయలుదేరిన మేళం బన్నికుప్పె మార్గంగా రత్నపురికి వచ్చి అక్కడి నుంచి వారంబి, హొసూరు మార్గంగా నల్లూరుపాల చేరేది. ఈ మార్గంలో నీటి వసతులున్న భూములలో వరి పండించేవారు. వరి కల్లంలో వీళ్ళు పదాలు పాడి రైతులకు సంతోషం కలిగించి శ్రమవల్ల వారికి కలిగిన ఆయాసాన్ని పోగొట్టి, చేటల నిండా ధవసధాన్యాలు సంగ్రహించేవాళ్ళు. ఇలా సంగ్రహించిన ధవసధాన్యాలను మూటకట్టి అక్కడే నమ్మకస్థులైన రైతుల ఇంట్లో భద్రపరిచి మరో ఊరికి పయనమయ్యేవారు.

ఆ ఊరు చుట్టూ చాలా గ్రామాలుండేవి. గ్రామీణ ప్రదేశమూ, వరిపొలాలు రెండూ ఉండటం వల్ల కనీసం ఒకవారం రోజులు ఈ స్థలంలో మకాంపెట్టే అవకాశం ఉండేది. ఉదయమే కాయకం నిమిత్తం పల్లెలకు బయలుదేరితే మధ్యాహ్నానికంతా తమ పని ముగించేవారు. తరువాత వేటకు వెళ్ళేవారు. వేటలో దొరికిన జంతువులు, పక్షులు, చేపలు మొదలైనవాటిని శుభ్రం చేసి ఆ బయలు ప్రదేశంలో ఉన్న పెద్దచెట్టు కింద పొయ్యిపెట్టి వంట చేసుకునేవాళ్ళు. వాళ్ళు అక్కడ ఉన్నన్ని రోజులు నాకు మంచి భోజనం దొరికేది. నా సహాధ్యాయులకు తెలియకుండా అక్కడికి వెళ్ళి భోజనం చేసి వచ్చేవాడిని. నేను బహిరంగంగా ఈ జనాంగానికి చెందినవాడిని అని చెప్పుకోవడానికి సాధ్యంకాక న్యూనతా భావంతో బాధపడేవాడిని. నా తండ్రి, అతని సహచరులు తమ వేషభూషణాల సమేతంగా పాఠశాలవైపు రావడానికి నేను అంగీకరించేవాడిని కాను. వాటన్నిటిని ఒక దగ్గర పెట్టి నన్ను చూడటానికి వాళ్ళు వచ్చేవారు. నేను పాఠశాల ముగించి వాళ్ళు మకాం పెట్టిన చోటికి చేరే సమయానికి వంట తయారు చేసి సారా అంగడి వైపు బయలుదేరేవారు. తాము కాల్చో, ఉడికించో సిద్ధం చేసిన మాంసపు ముక్కలు నంజుకుంటూ కడుపారా సారా తాగి, తిరిగొచ్చి భోజనం చేసి అక్కడే ఏదైనా ఇంటి అరుగుమీదో, పాడుబడిన గుడి కట్టమీదనో లేదా ఏ చెట్టుకిందనో పడుకుని నిద్రపోయేవారు. నేను భోజనం చేసి అక్కడి నుంచి హాస్టల్‌కు వచ్చి పడుకునేవాడిని. వారు ఉన్నన్ని రోజులు నా సంతోషానికి హద్దులే ఉండేవి కావు. వాళ్ళు మళ్ళీ అక్కడి నుంచి మరో దిక్కుకు బయలుదేరితే నాకు బాధ కలిగేది. వాళ్ళు మళ్ళీ ఎప్పుడు తిరిగొస్తారా అని ఎదురు చూసేవాడిని.

నేను అప్పటికే ఆ ఆశ్రమపాఠశాలలో చేరి 5-6 నెలలు గడిచి దసరా సెలవులు వచ్చాయి. సెలవులకు ఊరికి వచ్చాను. అమ్మా, నాన్న, అన్న, అక్క, తమ్ముడిని చూసి చాలా సంతోషం కలిగింది. మా దాసరుల వీధిలోని నా వయసు పిల్లలు నన్ను విచిత్రంగా చూసేవాళ్ళు. తల్లితండ్రులకు దూరంగా హాస్టల్‌లో ఒంటరిగా నేను ఎలా ఉంటున్నానో అని ఆశ్చర్యపడేవారు. పై కులం వాళ్ళు కోడంగయ్య కొడుకు దూరంలోని అదేదో ఊళ్ళో హాస్టల్లో చేరాడట, ఈ కులం పిల్లలూ పాఠశాలలో చేరారు కదా! అని ఆశ్చర్యపడితే; మా దాసరుల వీధివాళ్ళు ఆ బడి వదిలేసి దొంగతనంగా ఇంటికి పారిపోయి వచ్చిన



తమ పిల్లలను తిడుతూ, నా పట్ల ఒకింత సంతోషాన్ని కనబరుస్తూ, తమ పిల్లలు పాఠశాలను వదిలిపెట్టారు కదా అని అసంతృప్తి చెంద సాగారు.

చాలా కాలం తరువాత ఇంటికి వచ్చిన నాకు రాజమర్యాదలు జరిగేవి. అమ్మ ఇంట్లో సాకిన కోడిని కోసి ప్రత్యేకమైన వంట చేస్తే, నాన్న వేటాడి చేపనో, తాబేలో, అడవిలోని పక్షినో తెచ్చేవాడు. దాంతో పాటు బొమ్మచేసి తాయెత్తు కట్టి, దిగ్బంధనం చేసి బలిచ్చిన కోడిని తెచ్చేవాడు. నేను సెలవులకు వచ్చిన పదిపదిహేను రోజులు ఎలా గడిచిపోయాయో తెలిసేది కాదు. ఆ రోజుల్లో చాలా సంతోషంగా ఉండేవాడిని. సెలవులు ముగిసి మళ్ళీ ఆశ్రమ పాఠశాలకు తిరిగి వెళ్ళాలన్నప్పుడు చాలా బాధ కలిగేది.

## బంధు- మిత్రుల కష్టాలు

నేను మరల పాఠశాలకు బయలుదేరటానికి సిద్ధమై నుంచున్నప్పుడు బస్సు ఛార్జీకి ఇవ్వడానికి కూడా నా తల్లితండ్రులు ఇబ్బంది పడేవారు. అమ్మ కష్టకాలంలో అవసరానికి వస్తుందని ధాన్యపు కుండల్లో, కడవల్లో మూడు కాసులు, ఆరు కాసులు దాచి కూడ బెడుతూ ఉండేది. దాన్ని తీసి మొత్తం పోగేసి నాకు బస్సు ఛార్జీకి ఇచ్చి పంపేది. కొత్తబట్టలు, చెప్పులు మొదలైనవాటిని కొనిచ్చే ప్రశ్నే ఉత్పన్నమయ్యేది కాదు. ఆ ఆశ్రమపాఠశాలలోనే నా సైజుకు సరిపోని వదులు చొక్కా, నిక్కరు ఇచ్చారు. దాన్నే చక్కగా ఉతుక్కుని వేసుకునే వాడిని. ఈ దుస్తులు మా జాతి పిల్లలు వేసుకుంటున్న దుస్తులకన్నా చాలా బాగుండేవి. నేనే వారికన్నా మెరుగు అని అనుకునేవాడిని.

ఈ పాఠశాలలో చేరి సంవత్సరాలు గడిచినట్టే నా స్నేహితుల బలగమూ పెరిగింది. పాఠశాలలో ఉన్న ఒకే ఒక ఉపాధ్యాయుడికి తోడుగా మరొక మేడం వచ్చి చేరారు. ఆమె పేరు అమ్మణమ్మ. ఆమె కన్నడ పాఠాన్ని చాలా చక్కగా బోధించేవారు. పద్యాలను రాగ యుక్తంగా పాడి సారాంశాన్ని వివరించేవారు. మాకు అప్పట్లో 'పుణ్య కోటి' అనే ఒక గోవు కథ ఉండేది. ఈ పాఠం చెప్పేటప్పుడు మా మేడం అక్షరాలా భావుకురాలయ్యేవారు. ఉద్వేగభరితురాలయ్యేవారు. కన్నీటి కాలువలు ప్రవహింపజేసి, దుఃఖించి మొత్తం తరగతిలోని పిల్లలందరూ కన్నీరు కార్చేలా చేసి దుఃఖసాగరంలో ముంచేవారు.

స్నేహితుల బలగం పెరిగినట్టే, నా సహవాసం వారి పాటలకూ విస్తరించి, స్నేహితులతో కలసి నేను వారి ఇళ్ళకు వెళ్ళసాగాను. పక్షిరాజపురలో నాకు హక్కిపిక్కి జనాంగానికి చెందిన చంద్రసేన్ మరియు డీయఫ్ అని ఇద్దరు మిత్రులు అత్యంత ఆప్తులయ్యారు. సర్కారు ఈ సముదాయానికి స్థిరనివాసాలు ఉండాలని ఇళ్ళు కట్టించి ఇచ్చారు. అయితే వీళ్ళు ఆ ఇండ్ల పక్కన డేరాలు వేసుకుని అందులో నివసించసాగారు. వారి జంతువులు, పక్షులు, బయటనే ఉండేవి. ఈ సముదాయం సంవత్సరమంతా దేశమంతటా తిరుగుతూ వేట, వ్యాపారం, ఔషధాల విక్రయం ఇలా రకరకాల వ్యవహారాలు చేసే వారు. సంవత్సరంలో ఒకటో, రెండో నెలలు మాత్రం తమ ఊళ్ళకు వెళ్ళేవాళ్ళు. వాళ్ళు ఊళ్ళకు తిరిగివస్తే మొత్తం ఊరు కిలకిలా నవ్వేది. అన్ని అంగళ్ళు, హోటళ్ళు, సారాయి అమ్మే, చేపల చీకులు అమ్మే అంగళ్ళు ఈ జనంతో కిటకిటలాడేవి. వాళ్ళు దూర ప్రాంతాల నుంచి తెచ్చిన రకరకాల వాచీలు, రేడియోలు, టేప్‌రికార్డులు విలువైన ఇతర వస్తువులు ఆ ఊరి జనాన్ని నివ్వెరపరిచేవి. సంవత్సరం మొత్తం ఊరూర్లు సంచారం చేసి సంపాదించినదంతా కేవలం ఒకటి రెండు నెలల్లో ఖర్చుచేసి తమతో పాటు తెచ్చిన విలువైన వస్తువులను చివరికి ఆరుకాసులకు, మూడు కాసులకు అమ్మి మళ్ళీ దేశాటనకు వెళ్ళిపోయే వాళ్ళు.

హాస్టల్‌లో చేరిన ఈ జనాంగం పిల్లల్లో కొందరు తమ తల్లి తండ్రుల వెంబడి దేశాటనకు వెళ్ళిపోయేవారు. ఈ కారణం వల్ల హాస్టల్‌లో పిల్లల సంఖ్య కూడా తక్కువయ్యేది. ఈ సముదాయానికి చెందిన నలుగురైదుగురు ఆడపిల్లలు హాస్టల్‌లో ఉండేవారు. చివరికి వాళ్ళు కూడా వెళ్ళిపోయారు. వాళ్ళల్లో రాగిణి అనే అమ్మాయి చక్కగా చదువుకునేది. అయినా బడి మానిపించి ఇంటికి తీసుకెళ్ళిపోయారు.

నా స్నేహితుడైన చంద్రసేన్‌కు ఒక అన్న ఉన్నాడు. అతని పేరు సుకుందర. అతను బి.డి.ఓ. కార్యాలయంలో 'డి' గ్రూపు నౌకరుగా సర్కారు ఉద్యోగంలో చేరాడు. ఈ కారణంగా చంద్రసేన్ పాఠశాల వదిలి వెళ్ళలేదు. అతడు నాతోపాటు 8వ తరగతిలో చేరి 9వ తరగతికి వచ్చేంతలో పాఠశాల వదిలి తల్లితండ్రులతోపాటు వ్యాపారం చేస్తానని నేపాల్ వైపు వెళ్ళిపోయాడు. ఆ చిన్న వయస్సులోనే అతనికి పెళ్ళయిందని తెలిసింది.

ఇదే విధంగా ఆ హాస్టల్‌లో ఉన్న కాడుకురుబ జనాంగం పిల్లలు ఒక రోజు పాఠశాలకు వస్తే నాలుగైదు రోజులు గైరుహాజరయ్యేవారు. అడవులు, తుప్పలు తిరిగి గెనుసుగడ్డలు, కందమూలాలు, తేనె మొదలైనవాటిని వెతకటమే వారికి చాలా ఇష్టమైనట్టు అనిపించేది. అక్కడ గడిచిన ఇన్ని సంవత్సరాలలో నాకు ఆ సముదాయానికి చెందిన ఒక్క పిల్లవాడినీ స్నేహితుడిగా చేసుకోవడానికి కుదరలేదు. వాళ్ళల్లో కనీసం ప్రాథమిక విద్య అభ్యసించినవారిని చూడలేదు.

ప్రభుత్వం ఈ గిరిజనుల పిల్లల కోసం బ్రెడ్, బిస్కట్లు సరాఫరా చేసేది. వాటిని అందుకోవటానికి పిల్లలే ఉండేవారు కాదు. పాపం, మా శివణ్ణ మాస్టారు పాలు కాచి, బ్రెడ్ ముక్కలను ఒక బుట్టలో వేసి మా చేతికి ఇచ్చి ఆ కురుబ వాడకు వెళ్ళి అక్కడి పిల్లలకు ఇచ్చి రమ్మని పంపేవారు. వాళ్ళకు ప్రభుత్వం చేకూర్చిన సౌలభ్యాలను వాళ్ళకు అందించాలని ఆయనపడే తపన మెచ్చుకోదగ్గది. ఈ కారణం వల్ల నాకు ఆయన పట్ల ఉన్న గౌరవభావం మరింత పెరిగింది. ఈ విధంగా సంవత్సరాలు గడిచినట్టల్లా ఆ ఆశ్రమపాఠశాలలో సంచార జాతుల, ఆదివాసుల పిల్లల సంఖ్య క్షీణిస్తుండటంతో ఇతర సముదాయపు పిల్లలను పాఠశాలలో చేర్చుకోవటానికి ప్రభుత్వం అనుమతి ఇచ్చింది. ఇలా చేరినవారిలో రమేశ్ అని ఒక పిల్లవాడు ఉండేవాడు. వాడు చాలా తుంటరి. నన్ను ఎప్పుడూ ఏడ్పించేవాడు. వాడికి ఎలాగో నా సముదాయం గురించి, మా పూర్వపరాల గురించి తెలిసిపోయింది. నా ముఖం చూసినపుడల్లా (పాత ఇనుము-ఖాళీ సీసా) అని వెక్కిరించేవాడు. నేను తరగతికి లీడర్‌గా ఉండేవాడిని. ఇది అతను భరించలేకపోయేవాడు. అప్పుడప్పుడు నా మీదికి పోట్లాటకు వచ్చి నన్ను ఇబ్బంది పెట్టేవాడు. ఒక ఆదివారం నాడు పిల్లలమంతా పెద్ద కాలువకు బట్టలు ఉతుక్కోవటానికి, స్నానాలు చేయటానికి వెళ్ళాం. అప్పటికే నాకు ఈతకొట్టడం వచ్చేసింది. పెద్ద కాలువ మధ్యన బండరాయి ఉంది. ఆ బండరాతి మీద నుంచి డై కొట్టేవాళ్ళం. మొదట నేను డై కొట్టాను. నా తరువాత అతను కొట్టి, వెనుక

నుంచి వచ్చి నీళ్ళలోనే నా కాలు పట్టుకుని లాగాడు. నేను కంగారుపడి కేకలు పెడుతూ నీళ్ళల్లో పూర్తిగా మునిగిపోసాగాను. ఆ కాలువలో పశువుల ఒళ్ళు కడుగుతున్న ఒకతను వేగంగా నా దగ్గరికి వచ్చి నన్ను బయటికి లాగి ఒడ్డుకు చేర్చాడు.

# ఇంగ్లీషు నేర్చుకున్న మొదటి అనుభవం...

నేను నాలుగవ తరగతి పాసై అక్కడే 5వ తరగతిలో ప్రవేశం పొందాను. ఆ ఏడే ప్రథమ మిడిల్ స్కూల్ ప్రారంభమై మేము మొదటి బ్యాచ్ విద్యార్థులమయ్యాం. శివణ్ణ మాస్టారు మాకు ఎ.బి. సి.డి. ఆంగ్ల అక్షరాలు పరిచయం చేసి అక్షరాలు రాసే విధానం నేర్పించారు. నాకు ఆంగ్ల అక్షరాలను నేర్చుకోవటమే ఒక రోమాం చనం కలిగించే విషయంగా మారింది.

విద్యాగంధానికి చాలా దూరంగా ఉండిపోయిన మాకు గగన కుసుమాలైన ఈ అక్షరాలు దక్కటం నా పాలిట అత్యంత గొప్ప అదృష్టంగా భావించాను. నేను పాఠశాలలో కుదురుకుని అక్షరాలు నేర్చుకోవటానికి పూనుకోవటం మా జనాంగనానికి విచిత్రంగా తోచింది. ఊర్లు పట్టి తిరుగుతూ, స్థిరనివాసాలు కానక జంగమావస్థ లోనే ఉన్న మా జనమంతా తమ పిల్లలకూ విద్య నేర్పించాలని అనుకుంటున్నారేమో అన్నట్టు నేను సెలవుల్లో ఊరికి వచ్చినపుడు ఆ పాఠశాల గురించి, అక్కడి ఏర్పాట్ల గురించి, నా విద్యాభ్యాసం గురించి అనేక విధాల విచారించేవారు. మా తల్లితండ్రులు కూడా తమకు మరీ దగ్గరి బంధువులకు విషయం తెలిపి పిల్లలను ఆ పాఠశాలలో చేర్చమని నచ్చజెప్పేవారు. ఇందులో మా తల్లితండ్రుల స్వార్థం కూడా ఉందేమోనని అనిపిస్తుంది. ఒంటరిగా హాస్టల్లో ఉంటున్న తమ కొడుకుకు ఎవరైనా మా జాతి పిల్లలు తోడు ఉండా లని వారి అభిలాష.

దూరంలో ఉన్న కె.ఆర్. పేట తాలూకాలోని నాయిసింగన పల్లెలో మా అమ్మ చెల్లెలు ఉండేది. ఆమె కొడుకు నారాయణ అక్కడి ప్రభుత్వ పాఠశాలలో చదువుకుంటూ ఉండేవాడు. నేను సెలవుల్లో అమ్మతోపాటు పిన్నమ్మ దగ్గరికి వెళ్ళాను. పిన్నమ్మ అంటే మాకెంతో ఇష్టం. వాళ్ళ ఊరికి వెళ్ళినప్పుడల్లా మమ్మల్ని చాలా బాగా చూసు కునేది. అప్పటికే మా చిన్నాన్న అనారోగ్యంతో చనిపోయాడు. పిన్నమ్మ తన ముగ్గురు మగపిల్లలతో ఎంతో కష్టమైన పరిస్థితుల్లో జీవనాన్ని సాగిస్తూ ఉండేది. నేను చదువుకుంటున్న ఆశ్రమపాఠశాలలో నారా యణను చేర్చమని మా పిన్నమ్మను అడిగాను. మొదట్లో చిన్నమ్మ అంత దూరంలో ఉన్న ఊరికి కొడుకును పంపటానికి ఒప్పుకోలేదు. అయితే నాకు మద్దతుగా అమ్మ కూడా పిన్నమ్మకు నచ్చజెబుతూ, "నేను లేదా? నీ కొడ్కు చింత నీ కొద్దు. నేను అప్డప్డ వెళ్ళి సిన్నోళ్ళి సూసికొని వస్తాను. వాడ్ జవాబ్దారి నాకి ఉంద్ని" అని చెప్పి ఒప్పించింది.

వేసవి సెలవులు ముగిసి పాఠశాల మళ్ళీ ప్రారంభమైంది. అమ్మ, చిన్నమ్మ నారాయణను తెచ్చి పాఠశాలలో చేర్చారు. నాకొక జతగాడు దొరికాడని నేను సంబరపడ్డాను. అదే విధంగా మా సముదాయానికి చెందిన ముగ్గురు నలుగురు పిల్లలను వారి పెద్దలు వచ్చి చేర్చారు. అయితే వారి ప్రయత్నాలు విఫలమై వాళ్ళు పాఠశాల




వదిలి వెళ్ళిపోయారు. నారాయణ మాత్రం నాతోపాటు ఉండిపో యాడు. అతడు 6వ తరగతి వరకు చదివి మళ్ళీ ఊరికి వెళ్ళిపోయి అక్కడి బడిలో 7వ తరగతిలో చేరాడు.

వీటన్నిటి మధ్య నా ఇంగ్లీషు అభ్యాసం బాగానే సాగుతూ ఉండేది. ఇప్పుడు చిన్నచిన్న వాక్యాలను చదవటం, రాయటం నేర్చు కున్నాను. మా మాస్టారు చక్కగా నేర్పించడం వల్ల అందులో నాకు అమితాసక్తి కలిగింది. ఇంగ్లీషు అభ్యాసానికి అనుకూలమైంది. నేను ప్రయత్నపూర్వకంగా మా ఇంటివాళ్ళందరి పేర్లను ఇంగ్లీషులో రాయటం నేర్చుకున్నాను. అయితే నాకు మా ఊరి పేరు రాయటం సాధ్యపడలేదు. ఆ సంజీవస్వాములవారు పెట్టిన 'జ్ఞానానందపుర' అనే పేరును కన్నడలో రాయటమే కష్టం. ఇక ఇప్పుడిప్పుడే ఇంగ్లీషు అక్షరాభ్యాసం చేస్తున్న నాకు రాయటం ఎలా సాధ్యపడుతుంది? మాస్టారును అడిగి రాయించుకోవడానికి ఎందుకో నా మనస్సు అంగీకరించటం లేదు. ఆ 'జ్ఞాన' అనే పదాన్ని రాయటానికి అనేక రకాలుగా ప్రయత్నించి అలసిపోయి చేతులు ఎత్తేశాను. సెలవుల్లో నేను మా ఊరికివచ్చినపుడు మా తల్లి తమ్ముడైన రామణ్ణగారు గుర్తొ చ్చారు. ఆ కాలంలో ఆయన ఎల్.ఎస్. ఏదో చదివారు. ఆయనకు కొద్దో గొప్పో ఇంగ్లీషు వచ్చేది. ఆయన మా ఊరి దొడ్డేగౌడగారి కుమారుడి వెంబడి మా ఊరి నుంచి బిళికెరెకు నడుచుకుంటూ పాఠశాలకు వెళ్ళేవారట. ఎల్.ఎస్. చదివిన ఆ గౌడగారి కుమారుడు కండక్టర్ పనిలో చేరాడు. అయితే మా మామయ్య పాఠశాల వదిలి మా వృత్తికే అంటుకునివుండిపోయాడు.

మా మామయ్య కూడా ఇంగ్లీషు నేర్చుకున్నాడు కదా అనే సంతోషంతో ఒక రోజు ఆయన దగ్గరికి వెళ్ళి "మామయ్య, ఈ 'జ్ఞానానందపుర' అన్నది ఇంగ్లీషులో రాసివ్వు' అన్నాను. ఆయన ఎప్పుడో నేర్చుకుని వదిలేసిన ఆ ఇంగ్లీషు అక్షరాలను గుర్తుచేసు కుంటూ Janandapura అని రాసిచ్చి తమ ఆంగ్లజ్ఞానాన్ని నాకు ధారపోశాడు. మా మయ్య రాసిచ్చిన ఆ స్పెల్లింగ్‌ను మననం చేసుకున్నాను. అయితే ఇది ఎందుకో తప్పు అయివుండొచ్చనే అను మానం నాలో మొదలైంది. సెలవుల తరువాత నేను పాఠశాలకు వెళ్ళినపుడు ధైర్యం చేసి నేను అమ్మణ్ణమ్మ మేడంగారిని మా ఊరి పేరును ఇంగ్లీషులో రాసివ్వమని అడిగాను. ఆమె ఏమీ అనకుండా ఒక కాగితం మీద 'Jyananandapura' అని తమ గుండ్రటి అక్షరాలతో రాసిచ్చారు. అప్పుడు నాకు మా మమయ్య మరియు నా ఆంగ్ల భాషా జ్ఞానపు స్థాయి అర్థమై మళ్ళీ ఎన్నడూ మా మామయ్య దగ్గర ఇంగ్లీషు గురించి ప్రస్తావించలేదు. ❊

# సోమసుందర్‌కు శ్రద్ధాంజలి

-పన్నాల సుబ్రహ్మణ్య భట్టు,
0866-2475120



**ఒక** వ్యక్తి కనుమరుగయినపుడు కాని అతని విశాలనేత్రాలు గుర్తుకు రావంటారు. జీవితమంతా కవితా నర్తనం, విమర్శ ముద్రలు చూపిస్తూనే సోమసుందర్ మన మధ్య నుంచి వెళ్ళిపోయారు. ఆయనే సిద్ధేంద్రుడయి ఆయనే క్షేత్రయ్యగా మారి వచన కవితా నృత్య శాస్త్రానికీ ఆధునిక కవితా భంగిమలకీ ప్లవనసూత్రాలూ, పదాలూ రచించి, పలకరించలేని దూరాలకు వెళ్ళిపోయారు.

అయితే ఆయనని ఆయన పుస్తకాలలో పలకరించవచ్చు. మనం పలకరించడం కాదు, ఆయనే ఒక సర్వస్వం లాగా, అనేక రీతులను వివరిస్తూ ఉదాహరణలు చెపూ సమస్తమైన అనుమానాలను తీరుస్తూ పుస్తకాలలో కనపడుతూనే వుంటారు. 100కి పైగా పుస్తకాలు రచించి 70 సంవత్సరాలకు పైగా ఆంధ్రదేశం నలుమూలలా తిరిగి అభ్యుదయ సాహిత్యాన్నీ అభ్యుదయ కవులనీ తన రెండు భుజాలపైన భరించి, సమకాలీన పెద్ద కవులనీ, నవాంకురాలనీ నెత్తిన పెట్టుకొని సరస్వతీదేవికి బోనాలు మోశారు. ప్రతిభగల కవులకు బహుమతులు పారాణులు దిద్దారు. ఒక్క మంచి కవిత్వపు తునక వుంటే చాలు, బంగారు ఆభరణాన్ని ధరించినట్లు భావించారు. ఇప్పుడు మంచి కవి, మంచి పుస్తకం వేసి ఆమోదముద్రకి పంపించాలంటే ఉన్న ఒక్క చిరునామా చెరిగిపోయింది. ఒక్క తిరునామం పెట్టేవారు లేరు. ఒక వెన్ను తట్టేమాట, వెలుగు కల్గించే మాట, చెప్పేవారు లేరు.

సోమసుందర్ కంటే ఇరవై సంవత్సరాలు ముందు పుట్టినవారూ ఆయన మెప్పుకోలుకు ఉగిసలాడేవారు. సోమసుందర్ కంటే 65 సంవత్సరాలు చిన్నవారూ ఆయన ప్రశంసకి మురిసిపోయేవారు. ఆయన ఇచ్చకాల పన్నీరు జల్లు కొట్టే మనిషి కాదు కనుక. కవిత్వ విషయంలో సన్నిహితులైనా ఏపాటి కవిత్వం కాలుజారినా ఆయన భ్రుకుటి కుంచించుకుపోయేది. లబ్ధప్రతిష్టులయితే ఇక విస్ఫులింగాలే కురిసేవి. బెంగుళూరు నుండి బరంపురం దాకా 50 సంవత్సరాల పాటు జరిగిన సమావేశాలలో ఆయన ఆధునిక రచనలపై చేసిన శతాధిక ప్రసంగాలలో ప్రాచీన సాహిత్య గాంధారాల నుండి వామపక్ష మూలాధార షడ్జమాల వరకూ పాడుతూనే సాగాడు. వాటిలో సమకాలీన ధోరణుల బీజాలే కాదు, చారిత్రక విశ్లేషణలే కాదు, ప్రభావ గంధ పరిమళాలే కాదు, విశ్లేషణ కాంతులే కాదు, అనర్గళంగా ఎన్నో విషయాలు చర్విత చర్వణం కాకుండా, కొత్త నునుపుతో గంటల కొద్దీ సాగేవి. తనముందు తరం పెద్దల పట్ల-ఇతర రంగాలలో పెద్దలన్నా అంతులేని ఆపేక్ష హత్తుకొనేది. ధూర్త వినయాలు లేవు. దుమ్ముకొట్టే మాయలు లేవు. వెండి తీగలాగినట్లు, వెన్నపూస బంతి చేసినట్లు ముచ్చట్లు మురిపించేవి.

నిజాం మీద దండెత్తటంతో ఆయనకి త్వరగా ఖ్యాతి వచ్చింది. వేలకొద్దీ కార్యకర్తలు కొలువు దీరిన సభలో ఆకాశానికెత్తారు. ఇంకా ఖబడ్దార్ మాట తప్ప-ఇంకొకటి గుర్తుండని పాఠకులే అధికం. అంతకుతప్ప సోమసుందర్ చేసిన ఇతర కవితా గ్రంథాల ఆయుధ పూజలు గమనించలేని కవిసేనలు ఎక్కువ. అనేక కవితా సంపుటులలో స్మృతిఖండికలలో, అనువాద కవితల్లో సోమసుందర్ చూపిన పాకం పట్టిన కవితా నిర్మాణ మాధుర్యం గమనించినవారు తక్కువ మంది. వజ్రాయుధం తర్వాత ఆయన కర్మాగారంలో ఉత్పత్తి అయిన కవిత్వ ఆయుధాల పదును ఎవరికీ పట్టలేదు. ఆయన కవిత్వ సంపుటాలలో ఘనీభవించిన ఈ కవితా ద్రవ్యాల తాజాదనాన్నీ మనసు మేల్కొలిపే కవిత్వ దరువుల కింకిణీ ధ్వనులను ఒకచోటికి తెచ్చే ప్రయత్నం జరుగలేదు. ఇక అనువాద రచనల్లో ఇతర కవుల అనువాదాలలో బంగారు ఉంగరాలు ఎన్ని తొడిగారో అంతే లేదు. అలాగే బ్రెష్ట నాటకానువాదంలో కూడా అంత ప్రతిభా పరిపాకం కనపడుతుంది.

సాధారణంగా నినాదాలతో కవిత్వంలో ప్రవేశ దరువుతో ఆరంభించి కవిత్వంలో పైకి రావటం కష్టం. సోమసుందర్‌లో కవితా ధార ప్రతి పోరాటంలో వచ్చి చేరుతూ, ప్రతి పల్లవం అనే విషయంపై చిగురుస్తూ, ప్రతి స్మరణీయ సంఘటనపై పుష్పిస్తూ, ప్రతి కేదారాన్ని తాకుతూ ఆకాశంలోకి చొచ్చుకుపోతుంది. ఆరోగ్య కవితా శిశువుకు జన్మనిచ్చింది. అందుకే అన్ని కవితా సంపుటాలు వచ్చాయి.

మన కవితా పరిశ్రమలో అసంకల్పిత ప్రతీకార చర్యలెక్కువ. చరిత్రాధ్యయనం తక్కువ. ఒక జాతి సాంఘిక చరిత్రలోని ఎత్తు పల్లాలపై శాస్త్రీయ అవగాహన పూజ్యం. తెలుగు వచన కవితా రచనలో దళాధిపతులకు అందుకే శిక్షణ లేకుండా పోయింది. ఇక కాల్బలం లాటి కవుల సంగతి చెప్పనే అక్కర్లేదు. ఒక్క సోమసుందర్ మాత్రం ఈ రంగాలలో లోతుగా వెళ్ళారు. ఆయన కవితా సృజనలో అంత నిలకడ వ్యుత్పత్తి కనబడుతుంది. అందుకే ఆయన సమకాలికులకు ఆయన కంటే ఖ్యాతి కల్గినా కవిత్వరక్త ప్రవాహం త్వరలోనే ఇంకిపోయింది. సోమసుందర్‌కి మాత్రం 90 ఏళ్ళ వయసు వరకు పరవళ్ళు త్రొక్కుతూనే వుంది. రాబోయే ముప్పు ఎలా వెన్నాడిందో ఏమో!

ఫలితార్థం గొంతు విప్పుతూనే వుంది. అందుకే ఇలా...
'భూతలంపై పారే సమస్త నదుల అంతశ్చలనాల
మౌనభాషణంలో ముచ్చట్లాడుకుంటున్నట్లు..

*పురా నవీన తరంగాలను శ్రుతి చేస్తూ*
*కాలానికీ జనసాంతరాలకీ అతీతంగా*
*ఒక కావ్య స్వప్న రసమయి వధూళికలో*
*పులకించిపోతూ మృత్యుంజయమై...'*

అని సంతసమయ తృప్తిని నివేదించారు. కవితాకలశం నింపుతూనే వున్నారు. అలాగే పాశ్చాత్య విమర్శకుల విమర్శనాశకలాలను అరచేతిలో పట్టుకుంటేనే గాని ఆధునిక తెలుగు కవితకు దిశాభ్రమణం చేయించలేదు. అది చిట్కా మాంత్రికుడి రాజీ మార్గం కాదు. ఆ శకలాల విద్యుత్ అయిదువేళ్ళలోనూ ప్రాకాలి. నఖద్యుతులపై ప్రకాశించాలి. అప్పుడే ఇతరుల కవితా గమనం ప్రియమో, అప్రియమో; ధృతమో చౌకమో నిర్ధారించగలదు. అలా వారిని చదివాడు కనుకనే సోమసుందర్ అనే గీటురాయికి అంత పర్యవేక్షక అధికారం దక్కింది. ఆయనకి కాల్డ్‌వెల్, ఇలియట్‌లు మాత్రమే కాదు. పాటర్‌సన్ కూడా పథ ప్రతాపాలు చూపారు. తెలుగు కవితా హోలికులలో గత 50 సంవత్సరాలలో సోమసుందర్ వలె కవితా రోదసిలోకి చూసిన వారు లేరు. ఇతరులకి భ్రమలాటి ఆకాశంలో ధూసర ఆవరణాలను దాటి సూర్యచంద్రగ్రహాలు –కాల్పనిక, సామాజిక గ్రహాలు దర్శనమిచ్చాయి. కానీ ఆయన ఆకాశాన్ని దాటి ఆయన పాలపుంతలోకి చూస్తారు. గ్రహాలే కాకుండా అగణిత తారా పంక్తులను చూసి ఆశ్చర్యపడి, అలాటి వస్తు చోదనతో కవిత్వగతి విశేషాలను వస్తువులుగా స్వీకరించారు. అందుకే ఆయన కవితా సామగ్రికి అంత వ్యాపకత, కాంతి సంయోజకత. తోటి విలక్షణ కవి వృద్ధుల కంటే ఆయన్ని ఈ దృష్టే నిలబెట్టింది. నిత్య చైతన్యశీలిని చేసింది.

ఇక తెలుగు సాహిత్యంలో మూర్ధన్యులు, ప్రతిభాధనులు అయిన వారి గురించి ఆయన వ్రాసిన విమర్శక పరిచయాత్మక వ్యాసాలలోని గద్య సౌరభం ఒక మార్గదర్శి. సంస్కృత పదగాంభీర్యంతో చిక్కగా వుంటుంది. ఈ గద్యం ఆయన మిత్రులకు నచ్చదు కానీ విమర్శ భవనానికీ–అభినవ వ్యక్తీకరణకి సూచిత అర్థానికి మధ్య ఈ గద్యం పటిష్టమైన వారధిగా 50 సంవత్సరాల నుండీ సేవలందిస్తోంది. దీనిని 'సోమసుందర్ విమర్శల బలం –భాషాప్రయోగాలు' అని వేరే పరిశోధన చేయవలసి వుంది.

ఆయన సుబ్రహ్మణ్యభారతి గురించి చిన్న పుస్తకం వేశారు. అందులో "గురజాడకీ, భారతికీ ఎన్నో పోలికలు కనిపిస్తాయి. ఇద్దరిదీ రజ్జు హృదయమే. వ్రాసిన ప్రతి అక్షరాన్నీ సహృదయనివేశనంగానూ కళామయంగానూ రూపొందించాలనే తపన వున్నవారే. ఇద్దరి సాహిత్య కళా సృజన ఆవేశపూరిత తపస్సే. ద్రష్టలుగా వీరిరువురూ నిశితజ్ఞులు. ఆంగ్లభాషాధ్యయనం ద్వారా లభించిన సాహిత్య చైతన్యం వీరిరువురికీ అపారమే" అన్నారు. సోమసుందర్ పడికట్టు రాళ్ళు అంతబరువైనవి. అలాటి ఆదర్శాల వెనుక గడిచిన జీవితం ఆయనది.

నస్రుల్ ఇస్లామ్ గురించి 100 పేజీల గ్రంథం. అందులో 'మంచి కవిత్వం ఎన్నడూ భావాలతోటి మాత్రమే చేయబడదు. రమణీయ పాదాలకు రమణీయ పదబంధాలు ఎదురైనప్పుడే మంచి కవిత్వమౌతుంది' అన్నారు. అదీ యువకవులకు బోధించారు. అల్పీలు –సూదులు అని హైకూలు పోలిన 200 చిరుకవితా పదాలు నేసి ప్రచురించారు. ఆయన తాత్వికదృష్టి, కృషి మూలకం సమరశీల ఛాయలు– సరదాగా చెప్పిన వీటితో ఆయనని గుర్తుంచుకొందాం.

*నదికి శతకోటి నేత్రాలు*
*ప్రతి మీనం తెరచిన నయనమే*
*అందుకే పల్లమేదో చూడగలదు–*

సోమసుందర్ అన్ని నేత్రాలుగల నదిలా జీవించారు.

'ఓపెన్ యూనివర్సిటీ
అంటే ఏమిటి, అడిగాడొక ఆసామీ.
పై కప్పు లేనిదన్నమాట
చదువుకున్నవాడి జవాబు

అలా చదువుకున్న వారు సోమసుందర్. అనేక పుస్తకాల ఆకాశం క్రింద ఆయన చదువు సాగింది.

ఇంత ఎర్రని గులాబీకి రక్తదానం ఎవరు చేశారో?

ఏ సమర రంగాలకు పోయి తెచ్చుకుందో? – అవీ ఆయన పులకింత.

*తెలుగు ఆధునిక కవిత్వానికి విశాల ఛత్రంగా ఊరేగింపుగా సాగిన ఒక కవి విమర్శకుడు ఆనందంగా, గర్వంగా, ఠీవిగా నిష్క్రమించారు. ఆయన వెనుక ఒక ఊరుంది, పేరుంది, కవితా వాహిని వుంది– ఎప్పుడూ గుర్తుండేలా పదేపదే స్మరించుకొనేలా. ఆయనది కవితలా సాగిన జీవితం.* ❊

## వంద కవితల పండుగ
## కవిత, గజల్స్, కథలపై శిక్షణాశిబిరం

మల్లెతీగ సాహిత్య వేదిక(విజయవాడ)–కవితా వికాస వేదిక (హైదరాబాద్) సంయు క్తంగా సెప్టెంబరు మూడవ వారంలో కవిత, గజల్స్, కథలపై శిక్షణాశిబిరం ఏర్పాటు చేయనున్నాయి. విజయవాడలో జరగనున్న ఈ శిబిరంలో వర్ధమాన కవులకు, రచయితలకు కవిత, కథ నిర్మాణ పద్ధతులు, కథన రీతులు, జాతీయ, అంతర్జాతీయ సాహితీ ధోరణులు తదితర అంశాలపై ప్రముఖులచే శిక్షణ నివ్వడం జరుగుతుంది.

ఈ శిబిరంలో హైకోర్టు సిటింగ్ జడ్జి జస్టిస్ చల్లా కోదండరామ్, జస్టిస్ బి.చంద్రకుమార్, గోరటి వెంకన్న, డా॥గజల్ శ్రీనివాస్, డా॥సామల రమేష్‌బాబు వంటి ప్రముఖులెందరో పాల్గొంటారు. ఈ సందర్భంగా వందమంది కవులతో కవి సమ్మేళనం కూడా వుంటుంది. ఈ శిక్షణాశిబిరంలో పాల్గొన దలచినవారు ముందుగా తమ పేర్లను నమోదు చేసుకోవాలని నిర్వాహకులు కలిమిశ్రీ (92464 15150), బిక్కి కృష్ణ (99127 38815) తెలియజేస్తున్నారు.

# సాహితీ సమరయోధుడు ఆవంత్స సోమసుందర్

-పెనుగొండ లక్ష్మీనారాయణ,
94402 48778

*'ఒక వీరుడు మరణిస్తే/ వేలకొలది ప్రభవింతురు! / ఒక నెత్తుటి బొట్టులోనె/ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు!/ ఖబర్దార్! ఖబర్దార్!/ నైజాం కీచకుడా!'*

**ఇది ప్రజలనోట ప్రతిధ్వనించిన కవిత్వం. పోరాట స్ఫూర్తిని రగిల్చిన కవిత్వం. గోడమీద నినాదమైన కవిత్వం. పాలకులను హెచ్చరించిన కవిత్వం. కవులను ప్రభావితం చేసిన కవిత్వం. పౌరాణిక ప్రతీకలతో బానిసల దండయాత్ర వంటి ప్రజా కవిత్వాన్ని సృష్టించిన అభ్యుదయ రచయిత డాక్టర్ ఆవంత్స సోమసుందర్ అస్తమయంతో తెలుగు సాహిత్యలోకం మనకాలపు మహాకవిని కోల్పోయింది. తీవ్ర దుఃఖానికి గురైంది.**

*జన్మనెత్తిన మానవునకు /జీవితమె పరమధనం;/ అయితే అది ఒక మారే/ అతనికొసగబడిన వరం'*–

ఈ జీవిత సత్యం తెలిసిన భౌతికవాది సోమసుందర్ 18 నవంబరు 1924న తూర్పుగోదావరి జిల్లా శంఖవరంలో జాతీయ భావాలు కలిగిన కాళ్ళూరు వెంకాయమ్మ-సూర్యప్రకాశరావు దంపతుల ఎనిమిదవ కుమారుడిగా జన్మించారు. 1929లో పినతల్లి ఆవంత్స వెంకాయమ్మ- వెంకట్రావు దంపతులకు దత్తులయ్యారు. అప్పటి నుండి పిఠాపురం ఆయన నివాసస్థలమైంది. సాహిత్య కేంద్రమైంది.

13వ సంవత్సరం నుంచే సంప్రదాయ భావ కవితా ధోరణులలో అసంఖ్యాక రచనలు చేసినా 'మా తరాన్ని వెలిగించింది అభ్యుదయ సాహిత్యోద్యమమే' అని స్పష్టం చేసిన సోమసుందర్ 1944 నుంచి అభ్యుదయ సాహిత్యోద్యమ నిర్మాణంలో ప్రధానభాగస్వామి అయ్యారు. ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం(అరసం)లో క్రియాశీల కార్యకర్త అయినారు. స్వాతంత్ర్యోద్యమ ప్రభావంతో విద్యార్థిగానే క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని పోలీసుల కరకు లాఠీ దెబ్బలకు గురైన సోమసుందర్ యువకునిగా కమ్యూనిస్టు ఉద్యమంలో కాలూనారు. కారాగార క్లేశాలనూ అనుభవించారు.

సోసు అనే సంక్షిప్త నామంతో శ్రీశ్రీచే పిలవబడి మన సాహిత్య లోకానికి చేరువైన వ్యక్తి సోమసుందర్. నూరేళ్ళు బతికి కడదాకా తెలుగు సాహిత్యానికి సేవలందించాలనేది ఆయన ఆకాంక్ష. 'మృతియె లేకున్న రుచి ఏది బ్రతుకులోన' అని గాలిబ్ చెప్పినట్లు సోసు 12 ఆగస్టు 2016న 92 ఏళ్ళ వయసులో తన ఏడున్నర దశాబ్దాల సుదీర్ఘ సాహిత్య యాత్రకు స్వస్తి పలికారు. అప్పుడెప్పుడో పోతన్న తరువాత వీరేశలింగం, ఆ తరువాత ఇప్పుడు మన తరంలో సోమసుందర్ అక్షరాలను అమ్ముకోకుండా అక్షరాలను నమ్ముకొని వందకు పైగా పుస్తకాలను లక్షన్నర పుటల సాహిత్య నిధిని మనకందించి తన జీవన విధిని నిర్వర్తించారు.

ఆచార్య రాచపాళెం అన్నట్లు సోమసుందర్ తెలుగు సాహిత్యానికి సాహిత్య రచన, సాహిత్య ప్రచురణ, సాహిత్య ప్రాచారం, సాహిత్య



ప్రోత్సాహం రూపంలో నాలుగు విధాలుగా సేవలందించారు. సోమసుందర్ ప్రశంసను అందుకోని యువసాహితీవేత్త లేదంటే ఆశ్చర్యం లేదు. సోమసుందర్ కరస్పర్శ సోకని సాహిత్య ప్రక్రియ లేదు. అయినా కవిగా విమర్శకునిగా సుప్రసిద్ధులైనారు.

1949 విరోధినామ సంవత్సర ఉగాది నాడు 'వజ్రాయుధం' తొలి ప్రతిని అందుకొని మే 8న ఆవిష్కరణ జరిపిన సోమసుందర్ ఆ పుస్తకం ద్వారా తెలుగులో కవితా సంపుటాల ప్రచురణకు మార్గదర్శి అయినారు. ఆ సందర్భంలో పలువురు సమకాలీన రచయితల కవితా సంపుటాల ప్రచురణకు సంసిద్ధులైన సోమసుందర్ ఆరుద్ర 'త్వమేవాహమ్'ను కూడా తను స్థాపించిన కళాకేళి ప్రచురణల ద్వారా అందించారు. మిగిలిన వారి నుంచి మాత్రం అంతగా సహకారం ఆయనకందలేదు. దాశరథి, అనిసెట్టి, రెంటాల, రమణారెడ్డి, శ్రీశ్రీల కవితా సంపుటాలు వజ్రాయుధం తరువాతనే వెలుగు చూశాయి. 1950 ఫిబ్రవరి 26న ఉమ్మడి మద్రాసు ప్రభుత్వం కమ్యూనిస్టు సాహిత్యం అన్న కారణంతో వజ్రాయుధాన్ని నిషేధించింది. 1956లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆ నిషేధాన్ని ఎత్తివేసింది.

సోసు కళాకేళి పత్రికను ప్రారంభించి అభ్యుదయ సాహిత్య వేదికగా మలచి ప్రజాసాహిత్యాన్ని ప్రచారం చేశారు. ఎందరో సాహితీవేత్తలను ప్రోత్సహించారు. **2001 నుంచి తన జన్మదినమైన నవంబరు 18న సోమసుందర్ లిటరరీ ట్రస్టు ద్వారా పిఠాపురంలో కార్యక్రమాలను నిర్వహిస్తూ తనకు నచ్చిన తాను మెచ్చిన సాహితీ వేత్తలకు ప్రధానంగా యువ సాహితీవేత్తలను సత్కరిస్తూ సాహిత్య పోషకత్వం కూడా నెరపారు.**

వలస పాలనా కాలం నుండి నేటి ప్రపంచీకరణ కాలం దాకా వచ్చిన వస్తున్న పరిణామాలన్నింటినీ ప్రగతిశీల దృష్టితో నమోదు

చేసిన వ్యక్తి సోమసుందర్. "తన చరిత్ర తనె పఠించి ఫక్కున నవ్విందీ ధరణి; తన గాథను తనే స్మరించి భోరున ఏడ్చిందీ ధరణి" యిలా గతితార్కిక దృక్పథాలతో చారిత్రక వైరుధ్యాలను విశదీకరించిన కవి కూడా సోసు.

కమ్యూనిస్టు కార్యకర్తగా తుని సబ్‌జైలులో 5 నెలల 25 రోజులు జైలుశిక్ష అనుభవించిన సోసు ఆ రోజుల్లో "కమ్యూనిస్టు కవిత్వం సంపూర్ణమైంది. మానవుడు తన అవసరాన్ని ఎంత చైతన్యంతో గుర్తిస్తాడో, అంత చైతన్యం తోటే బాహ్య వాస్తవికతను గుర్తిస్తాడు" అని చెప్పిన ప్రపంచ ప్రఖ్యాత మార్క్సిస్టు సాహిత్య విమర్శకుడు క్రిస్టోఫర్ కాడ్వెల్ రచన 'ఇల్యూజన్ అండ్ రియాలిటీ'ని అధ్యయనం చేయటం ప్రారంభించి పదేపదే అధ్యయనం చేసి అవగాహన చేసుకొని 2010 నవంబరులో 'భ్రాంతి-వాస్తవికత'గా స్వేచ్ఛానువాదం చేసి అందించారు. అంతేగాక మరొక మహత్తర విమర్శనా గ్రంథం జార్జి థామ్సన్ రచనను 'మార్క్సిజమ్-కవిత్వం'గా జార్జి థామ్సన్‌కు బర్మింగ్‌హోమ్ (యు.కె)లోని ఆయన నివాసంలో స్వయంగా కలిసి అనుమతి తీసుకొని అనువదించి తెలుగు సాహిత్య లోకానికి అమూల్య కానుకలుగా సోసు సమర్పించారు. ఇంటర్మీడియట్ స్థాయి విద్యను కలిగిన సోసు స్వయంకృషితో ఆంధ్రాంగ్ల, సంస్కృత భాషలపై సాధికారితను సాధించారు మరెన్నో గ్రంథాలు కూడా వారి లేఖిని నుండి అనువాదాలుగా వెలువడ్డాయి. "మీరు మహాభవనానికి జెండాలుగా ఎగరవలసిన వాళ్ళురా! పునాది రాళ్ళై మట్టిలో పేరూ, ఊరూ లేకుండా పోయున్నారు. ఆలోచించండి. మీరు సాహిత్య కృషే చెయ్యాలి" అని వేంకట పార్వతీశ్వర కవులలో ఒకరైన ఓలేటి పార్వతీశం సోసుకూ ఆయన కుమారుడైన శశాంకకు హితవు చెప్పటంతో కమ్యూనిస్టు కార్యకర్తృత్వం నుండి తప్పుకొని సాహిత్య సృజనకే జీవితాన్ని వినియోగించారు సోసు. సోసు కళాకేళి ప్రచురణగా చివర వెలువరించిన పుస్తకం 'శరచ్చంద్రిక' సాహిత్య వ్యాససంపుటి. వారి చివరి వ్యాసం 'తేజోమయ ప్రాణరేఖ శశికాంత్ కవిత్వం' (ఈ వ్యాసం వారి మరణానంతరం విశాలాంధ్ర దినపత్రికలో ఆగస్టు 22, 29 తేదీలలో ప్రచురితమైంది). ఇవి సోసు జీవితం చివరవరకూ చేసిన సాహిత్య కృషిని తెలుపుతున్నాయి.

**సోసుది ఆదర్శవంతమైన జీవితం. కులాన్ని, మతాన్ని మర్చిపోయారు. మంత్రాన్ని యింటి గుమ్మం ఎక్కనియ్యలేదు. అందుకే అనంతమూర్తి 'సంస్కార'ను ఎర్రతివాచీ పరిచి స్వాగతించారు. సోసుకు తెలుగుజాతి అంటే ఎంతో అభిమానం. తెలుగు తొలి చక్రవర్తులైన శాతవాహన పేరులోని 'శాతకర్ణి'ని తీసుకొని తన యిద్దరు కుమారుల పేర్లకు జత చేశారు. సోసు ఏనాడూ ఏ పురస్కారాలనూ ఆశించలేదు. వారి వద్దకు వచ్చిన వాటినే సగౌరవంగా స్వీకరించారు. అభ్యుదయ సాహిత్యోద్యమ ప్రచారంలో దేశమంతా పర్యటించిన సోమసుందర్ అరసం అధ్యక్ష వర్గ సభ్యులుగా, గౌరవాధ్యక్షులుగా కొనసాగారు. అరసంతో అరసంలో తన జీవితాన్ని గడిపారు.** సోసు 'హంసధ్వని' శీర్షికన సంగీత స్రష్టలను కళాత్మకంగా పరిచయం చేశారు. 'కెరటాలు-కిరణాలు' శీర్షికన దేశ విదేశాల సాహితీవేత్తల జీవితాన్ని, కృషినీ వివరించారు. కథల సంపుటిని వెలువరించారు. 'కలలు-కన్నీళ్ళు'గా తన ఆత్మకథను ఒక సాహిత్య చారిత్రక గ్రంథంగా వెలువరించారు. తన సమకాలీనులైన పురిపండా, శ్రీశ్రీ, తిలక్, అనిసెట్టి, కొ.కు.సినారె, శేషేంద్ర, నారాయణబాబు, చాసోలపై సమగ్ర సాహిత్య పరిశీలన గావించారు. తన గురుదేవులు దేవులపల్లి కవితా దీపాలు వెలుగులను లోకంలో ప్రకాశింపజేశారు. యువ సాహితీవేత్తలలో ఏర్పడే సంశయాలకు 'సాహిత్యంలో సంశయ కల్లోలాలు' పుస్తకం ద్వారా తీర్చిన సాహిత్య అధ్యాపకుడు. 'చరమ శతాబ్దంలో కవితా రసాబ్ధి' ద్వారా యువసాహితీ వేత్తలను భుజం తట్టిన ఆత్మీయుడు సోసు.

తెలుగునాట సాహిత్యమే జీవితంగా విజయయాత్ర చేసిన మనకాలపు ఏకైక సాహిత్య వేత్త. సాహిత్యం కోసం తన సర్వస్వాన్ని ధారపోసిన సోసు తన నేత్రాలను, భౌతికకాయాన్ని సమర్పించి మనకు మార్గదర్శి అయినారు.

'ఈ మహత్తర భూగోళం ఒక మధురరస ఫలం' కావటాన్ని స్వప్నించారు. "*వర్గరహిత స్వర్గమ్మును స్థాపించుట కోసం తల్లీ! ఇది నాలోపలి కోరిక! ఇది నా తీరని తపస్సు*" అని తను ఏ సమాజం కోసం ఆరాటపడి పోరాడారో, సాహిత్య కృషి చేశారో ఆ లోపలి కోరిక తీరకుండా అది సాధించే బాధ్యతను మనపై వుంచి తన సాహిత్య తపస్సును ముగించిన సోమసుందర్ గారికి వారి మాటల్లోనే (చిన్న మార్పులతో) శ్రద్ధాంజలి.

**"సోదర సముదాయం కోసం పదాలు పాడిన కవి**
**కర్మణ్యత్యాల పద్మాకరాలను విరియించిన రవి"**

రచయిత అరసం జాతీయ కార్యదర్శి

డా॥వావిలాల సుబ్బారావు
98664 02973

## కృష్ణాపుష్కరాలు :
# తగ్గిన సారం-హెచ్చిన ఆడంబర భారం

"**హ**మ్మయ్య పుష్కరాలు ముగిశాయి" అని అందరూ ఊరట పొందారు. రాజకీయాధికారులు-పాలనాధికారులు విజయగర్వంతో ఊపిరిపీల్చుకుంటున్నారు. వ్యాపారులకు, పురోహితులకు, యాచకులకు "మరికొద్ది రోజులు వుంటే బాగుండు" అనిపించిందేమో! నేను ఏడు పుష్కరాలు చూశాను. 1944లో పుష్కరం గుర్తు లేదు. ఆరు పుష్కరాలు అమరావతిలోనే చూసిన అనుభవం నాలో వుంది. ప్రతి సారి ప్రశస్తి పెరుగుతూనే వచ్చింది. 2004 కొంత ఆడంబరం తగ్గింది. "మన పితృదేవతలను జ్ఞాపకం చేసుకోవడానికి ఇంత వ్యయం అక్కరలేదు" అని అవసరమైన మేరకే జరిపించారు అప్పటి ఆర్థికమంత్రి శ్రీ కొణిజేటి రోశయ్య గారు. ఇపుడు ఆడంబరం విజృంభించింది. ఇవి హైటెక్ పుష్కరాలు.

నిర్వహణలో నైపుణ్యం పెరిగింది. ప్రభుత్వసేవలు ప్రజాహితంగా వున్నాయి. సేవాసంస్థల భాగస్వామ్యం కూడా విస్తరించింది. ఆంధ్ర దేశం నిజంగా అన్నపూర్ణను తలపించింది. అన్నదానం అవసరాన్ని మించి జరిగింది. ఆపదల వార్తలు వినపడలేదు. విపత్తులు జరుగ లేదు. రాత్రులు పగళ్ళయినాయి పగళ్ళు జనప్రవాహాలయినాయి. అన్ని రకాల హంగులతో పుష్కరాలు ఆకర్షకంగా వున్నాయి. దీనికి కూడా గిన్నీసు రికార్డు వుంటుందా?

సాంస్కృతిక కార్యక్రమాల గ్రాఫ్ దిగువముఖంగా నడిచింది. రాజకీయ ప్రాబల్యం గ్రాఫ్ నిట్ట నిలువుగా ఎగబాకింది. సస్యశ్యామలతకు చిహ్నమైన ఆకుపచ్చదనం కన్నా మహావర్ణమైన పసుపు పచ్చదనం బాగా విస్తరించింది. అధికారులకు నిద్ర కరువయింది. ఎండిపోయిన కృష్ణానదికి చాలినంత ప్రవాహాన్ని తరలించి 'పుష్కరుని' దాహం తీర్చి మెప్పు పొందారు పాలకులు. అపశృతులు దొర్లిన విపత్తు వార్తలు ఏమీ వినపడలేదు. ఇంతవరకు పుణ్యప్రదమే.

'పుష్కరం' అంటే ఆడంబరమైన - గ్లామరస్- సుదీర్ఘ మత వేడుకగా ప్రసిద్ధి సంపాదించుకున్నది. ఈ వాక్యంలో ఏ పదమూ సారం గురించి చెప్పదు. అంటే మతధర్మపరంగా ఇవి దారితప్పిన పుష్కరాలూ-నిర్వహణపరంగా కీర్తివంతమైన పుష్కరాలూ- అన్నది సమీక్షా సారం.

మా అమరావతిలో పుష్కరాల కొరకు వివిధ శాఖలకు 100 కోట్లు మంజూరు అయినాయట. అన్నీ విడుదలై ఖర్చు అయినాయో లేదో తెలియదు. ఖర్చు కాకుండా ఎందుకుంటాయి భ్రమ గాని. దేవాదాయశాఖ, పర్యాటక శాఖ, నీటిపారుదల శాఖ ప్రధాన బాధ్యతగా ఖర్చు చేశారు. నిధులు చాలలేదు అన్నమాట వినిపించలేదు. ఇంత ధన సమృద్ధి వున్నందుకు గర్వించవలసిందే. అమరావతికి అందం హెచ్చింది. మౌలిక వసతులు కొన్ని పెరిగాయి. మా ధ్యానబుద్ధుడు కూడా పుష్కర పుణ్యం బాగానే మూటగట్టుకున్నాడు.

పుష్కర కోలాహలం ఒక మతం వారిదే అయినా ముస్లింలు, క్రైస్తవులు కూడా స్నానం చేసి సంతోషించటం మంచి పరిణామం. మతదృష్టితో కాక- సమిష్టి సంతోషంలో భాగం పంచుకునే సమైక్యతా గుణం హర్షం కలిగించింది.

'గంగాహారతి' హృషీకేశంలో, హరిద్వార్‌లో, వారణాసిలో చూశాను. అక్కడ నిరాడంబర భక్తి శ్రద్ధలు కనిపించాయి. కాశీలో ప్రధాన ఆలయానికి దగ్గరగా వుండే 'దశాశ్వమేధ' ఘట్టంలో మాత్రం కొంత ఘనంగా నిర్వహిస్తారు. తక్కిన ఘట్టంలో యథోచితంగా జరుగుతుంది. నదిని ప్రత్యక్ష దేవతా రూపంగా భావించి హారతితో గౌరవించే సదాచారంలో సున్నితమైన అందం వుంది. భావనలో కృతజ్ఞతా మార్దవం వుంది. అది అలరించే ఆధ్యాత్మిక కల్పన సూర్యుని తర్వాత కంటికి కనిపించే ఆరాధనీయ ప్రకృతి రూపాలు నదులు సముద్రాలే కదా! ఈ సంప్రదాయాన్ని కృష్ణ, గోదావరీ నదీ తీరాలలో అనుకరించడం హర్షింపదగినది. అక్కడ లాగా ఇక్కడ రోజూ హారతి కొనసాగితేనే మంచిది.

ఇక్కడ పన్నెండు రోజుల హారతులు విద్యుత్ కాంతులు మెరుపులతో తాళాలు, తప్పెట్ల హోరుతో, టపాసుల ఉత్సాహంతో, అధికార రాజకీయ ప్రముఖుల ప్రత్యక్షదర్పంతో, సినిమా సెట్టింగులాగా జరిగాయి. ఈ పన్నెండు రోజుల తర్వాత హారతులు మానేస్తే 12 రోజులు మాత్రం ఆడిపోయిన సినిమాల లాగా వుంటుంది. విజయవాడలో జరగబోయే హారతులకు టిక్కెట్లు కూడా పెడతారని పత్రికల్లో వచ్చింది. అది నిజమే అయితే అది అపచారమే. అపహాస్యమే. రకరకాల మార్గాల ధనసేకరణ చేయటానికి మతాచారాలను ప్రోత్సహించటంగా ముద్రపడుతుంది. బిజినెస్ మేనేజ్‌మెంటు (ఎం.బి.ఏ) వారే భవిష్యత్తులో దేవాలయ నిర్వహణాధికారులవుతారు. సారంపోయి రూపం పెరగటం అంటే ఇదే.

అమరావతి దేవాలయంలో నూతన నిర్మాణాలు చాలా జరిగాయి. ముఖ్యమైనది గాలిగోపుర నిర్మాణం. ఒక యాభై సంవత్సరాల ముందుగానే చేపట్టిన తొందరపాటు నిర్మాణం. చరిత్ర సాక్ష్యాలను, చరిత్ర గౌరవాన్ని పురాతత్వ గాంభీర్యాన్ని పూర్తిగా ధ్వంసం చేశారు. అందులో శాసనాలున్నాయి. పూర్వపు రాతి నిర్మాణాలున్నాయి. వాటన్నిటిని యధాతథంగా ఉంచి పూర్వ ఆకారం చెడకుండా గాలిగోపురం కడతారని కార్యనిర్వహణాధికారి చెప్పారు. కానీ ప్రాచీన లక్షణం ఒక్కటీ మిగల్చలేదు. శాసన స్తంభాలు ఎక్కడ పడేశారో! ప్రాచీన నిర్మాణాలు పునరుద్ధరణలో అందం కన్నా ప్రాచీనత ముఖ్యం. దాని వల్లనే ఆలయ గౌరవం. అది భంగం అయింది. గోపుర ఆకారం చూపరులకు తృప్తిగా లేదు.

అన్ని కార్యక్రమాల లోను అధికారుల ఏకపక్షమైన దురుసుతనం, స్థానికుల భావాల పట్ల నిర్లక్ష్యం స్పష్టంగా కనిపించాయి. 'పురాణం బండ' అన్న ఒక పురాతన ప్రాధాన్యంగల రాతిచట్టు నదిలో వుండేది. దానిపై శివలింగం చిన్నది వుండేది. ఆ చట్టును మందుపాతర పెట్టి పగులకొట్టారు. దాని ప్రాధాన్యం తెలియని అధికారులు, కాంట్రాక్టర్లు

ఈ పాపం చేశారు. వాళ్లు చేసింది తప్పు అని ఎవరికి చెప్పాలో ఎవరిని నిలదీయాలో తెలియక ఈ వ్యాసంలో నా రోదన వినిపించుకుంటున్నాను. మన చరిత్ర మీద, చారిత్రక చిహ్నాల మద గౌరవము, అవగాహన, లేని ఉద్యోగులు, కాంట్రాక్టర్లు, కార్యనిర్వహణాధికారులు, రాజకీయ నేతలు ఈ పాపాలను పంచుకోక తప్పదు. రాజకీయ నేతలకు జయజయధ్వానాలు ఫ్లెక్సీ బ్యానర్లు చాలు.

ఈ పుష్కరాలకు ఇంత మహార్భాటం ఎందుకు చేస్తున్నాము, పరమ లక్ష్యం ఏమిటి? అని ఏ నాయకుడైనా, ఏ అధికారి అయినా, ఏ ధర్మాధికారులైనా ఎపుడైనా అడిగారా? ఎంత అవసరమో-ఏది అనవసరమో వారు చెప్పారా లేదా! ఘనంగా ఉండాలి. చరిత్రలో నిలిచిపోవాలి అన్నదొకటే లక్ష్యం. లేకుంటే రాష్ట్రపతి నుండి అందరికీ ఆహ్వానాలేమిటి? ప్రతిపక్ష నాయకునికి మంత్రితో ఆహ్వానలేఖ ఏమిటి? దానికి కూడా రాజకీయం. వారి పెద్దలమీద గౌరవం-మత ధర్మ విశ్వాసం ఉంటే వస్తారు లేకపోతే లేదు. ఇది పెళ్ళి పేరంటం కాదు కదా! ఎవరి పుణ్యం కోసం వారు స్నానాలు చేస్తారు. వారి పితృదేవతల మీద మరొకరికి ప్రేమ ఎందుకు?

అసలు పుష్కరాలు ఒకరు ప్రారంభించటం ఏమిటి? ఒకరు ముగించటం ఏమిటి? అది ఒక ఖగోళ సంఘటన. రేపెపుడో సూర్య గ్రహణాలను, ఉత్తరాయణ పుణ్యకాలాలను కూడా రిబ్బన్ కత్తిరించి ప్రారంభిస్తారేమో! "సముద్ర స్నానానికి కొండుభొట్ల వారి ఆజ్ఞ కావాలా?" అన్న సామెతలాగా వుంది. ఇదే సారం లోపించటం.. ఆర్భాటం పెరగటం అంటే.

మతం హేతురహితం కాదు. అవి భౌతికశాస్త్రాలు నిరూపించిన హేతువులు కాకపోవచ్చు. ఒక తార్కిక సంబంధం వున్న ఆలోచనల సముదాయంతోనే మతాచారణ ఏర్పడ్డది. కొన్ని ప్రాథమిక విశ్వాసాలు, వాటితో అల్లుకున్న తర్కం, మత చట్రాన్ని తయారు చేస్తుంది. ఈ దశలో మతస్తుల మనోభావాలకు తృప్తి, కాల్పనిక ఊహల విస్తరణ, దైవశక్తులనూ ....గతించిన పూర్వీకుల మీద కృతజ్ఞత, ధార్మిక సంవేదన కలుగుతాయి.

రెండవదశలో ఈ మతాచారణలో వృత్తివ్యాపారాలు దళారీతనం ప్రవేశించి పురోహిత, అర్చక వృత్తి నైపుణ్యాలు ఆధిపత్యం చేస్తాయి. వ్యవస్థలు ఏర్పడతాయి. ఆదాయమార్గాలు ఏర్పడతాయి. ఈ దశలో పాలకులు ప్రవేశిస్తారు.

ఇపుడు మూడవదశ ప్రారంభమైంది. మతాచరణకు సామూహిక నిర్వహణలో రాజకీయకోణం ప్రబలమవుతుంది. మతానికి రాజకీయానికి అపవిత్ర బంధం ఏర్పడితే జారుడుమెట్ల మీదకు దిగినట్లే. ఏ పాతాళానికి పోయి ఆగుతందో చెప్పలేము.

మత విశ్వాసాలను గౌరవిస్తూనే, జ్యోతిష భావనలను అంగీకరిస్తూనే ఈ పుష్కరాలలో సమంజసత్వం ఎంత వుందో పునరాలోచించుకొనటం తప్పు కాదు. కొన్ని ప్రధాన భావాలు మాత్రమే తెలిసిన సామాన్యుడి సమీక్ష ఇది.

గురుగ్రహం సంవత్సరానికి ఒక రాశిలో ప్రవేశించి ఉండటం అనేది ఖగోళ సన్నివేశం. అట్లే పన్నెండురాశులలో ఒక్కొక్క సంవత్సరం చొ॥న ప్రయాణిస్తుంటాడో. ఆకాశంలోని నక్షత్ర రాశికి, భూమిమీద (భారతదేశంలో) వున్న ఒక నదికి సంబంధం ఊహించారు. సింహ రాశి-గోదావరికి, కన్యారాశి కృష్ణానదికి మొ॥ అపుడు రాశితో సంబంధం కల నదికి పుష్కర సంవత్సరం అన్నారు. అసలు సంబంధ నిర్ణయానికి ప్రాతిపదిక అస్పష్టం. దాని హేతువును తార్కికంగా నిర్ధారించలేదు. కొన్ని పుష్కరాలు ఉపనదులకు కూడా వున్నాయి. ఉదా : తుంగభద్ర, భీమ కృష్ణకు ఉపనదులు. వాటికి వేరే పుష్కరాలు ఉన్నాయి. ప్రాణహిత గోదావరికి ఉపనది. దానికి వేరే పుష్కరాలు. యమునా సరస్వతి గంగకు ఉపనదులు. అయినా వాటికి వేరే పుష్కరాలు. ఒక సంవత్సరంలో నర్మదకు దూరాన వున్న బ్రహ్మపుత్రకు పుష్కరాలు. తామ్రపర్ణికి దూరాన వున్న భీమా నదికి ఒకే సంవత్సరం పుష్కరాలు. అంటే ఆ నదులకు రాశి ఒకటేనన్నమాట. పోనీ ప్రక్కప్రక్క నదులు కూడా కావు. ఇందులో హేతువు కనిపించదు. ప్రక్కప్రక్కన వున్న నర్మద తపతులకు ఎనిమిది సంవత్సరాల దూరంలో పుష్కరాలు వస్తాయి.

సర్వ నదీ దేవతలు పుష్కరం జరిగే నదిలో సమావేశం అవుతారని, కనుక అందులో స్నానం చేస్తే సర్వనదీ తీర్థాలలోను స్నానం చేసిన పుణ్యం కలుగుతుందని ప్రవచనాలు చేస్తున్నారు. అదే నిజమైతే ఏ నదీ దేవత ఆ నదిని అంటిపెట్టుకొని వుండటం లేదన్నమాట. అట్లా కాదంటే కొన్ని అంశలు మాత్రం పుష్కర ప్రయాణాలు చేస్తుంటాయని చెప్పాలి. ఇంతకీ ఇది కాదట అసలు విషయం. సర్వనదులను నిర్మలం కలుష రహితం చేయగల శక్తిని పుష్కరుడనేవాడు



దేవుని వరంగా పొందాడు. అతడు గురుని యందు చేరి రాశులలో ప్రయాణం చేస్తూ ఒక్కొక్క రాశిలో వున్నపుడు ఒక్కొక్క నదిని కలుష రహితం చేస్తుంటాడు. పుష్కర సమయంలో నదీజలాలు పుష్కరుని వల్ల పాపకాలుష్యం లేకుండా ఉంటాయి కనుక అపుడు స్నానం, దానం, తర్పణం, ధ్యానం ఎక్కువ ఫలప్రదాలు అన్నది కొందరు పెద్దలు చెప్పిన ధార్మిక భావన. దీనిని బట్టి పసివాళ్ళను స్నానాలు చేయించటం తప్పు. దానతర్పణాది విషయాలు వాళ్ళు చేయరు గనుక పసివాళ్ళచే స్నానాలు నిషేధించాలి.

పాపము, దోష నివారణ, పితృదేవతలు తృప్తి, ఇవన్నీ చర్చించటం లేదు. అవిశ్వాస భావాలు ఎంతగా విశ్వాసం ఉంటే అంతగా తృప్త వుంటుంది. ఏదో ఒక ధార్మిక తృప్తి కలగటం, సాధారణ జనులకు ఒక మానసిక అవసరం. దాన్ని గ్లామరైజ్ చేసి దారి మళ్ళించటం పాపంకదా!

'పుష్కర సంవత్సరంలో నదీ తీర వాసులు శుభకార్యాలు చేసుకొనగూడదు' అన్నది ఒక అపప్రచారం. నిషేధం ఒక్క గోదావరి పుష్కరాలకే వర్తిస్తుందిట. గోదావరి పుష్కరాలు 'మఖాది పంచ పాదాలు'లో ప్రవేశిస్తాయని మఖానక్షత్రం శుభకార్యం కాదని-

అందుకు గోదావరి పుష్కరానికి మాత్రమే ఈ నిషేధం అని చెప్పారు. (నక్షత్రాలకు శుభాశుభాలు ఏమిటి? అని చర్చించటం లేదు. నిషేధం అన్ని నదుల పుష్కరాలకు విస్తరించరాదు. అంత్య పుష్కరాలు కూడా ఒక్క గోదావరికే నట. ఎందుకు?) ఈ పుష్కర భావనలూ హేతుమతికి నచ్చనివి చాలా వున్నాయి.

మరొక అంశం 'ఒక రాశిలో గురుడు సంవత్సర కాలం వుంటాడు' అంటూనే ఎందుకు మొదటి 12రోజులకే ఆత్రం? సినిమా మొదటి రోజు మొదటి ఆటకు, మొదటి టిక్కెట్టు లాగా! అని అడిగాను. సంవత్సరకాలమంతా మధ్యాహ్నం 12 గంటల నుండి 1 గంట వరకు పవిత్రకాలమేనట. 12 తర్వాత పితృకార్యాలకు తగిన సమయం అంటారు. ఈ మొదటి పన్నెండు రోజుల కోసం పరుగెత్తనవసరం లేదు. పుష్కరుడు ఎక్కడికీ పోడు. పితృదేవతలూ పోరు.

ఇంతకీ ఈ పితృదేవతలు ఎక్కడ ఉంటారు? దేహం వీడిన జీవుడు ఎంతకాలం మళ్ళీ జన్మ ఎత్తకుండా ఉంటాడు? జన్మ ఎత్తిన తర్వాత ఈ తర్పణాలు ఎవరికి చెందుతాయి. జీవుడూ పునర్జన్మ-పితృ దేవతలు-వారిలోకం- వీటి గురించి స్పష్టమైన తార్కిక సంబంధాలు నిర్ధారణ చేయకుండా ఈ పుష్కరాల వ్యామోహం పెంచటం సబబా? జీవుడు-పునర్జన్మ అన్న భారతీయ తాత్విక ప్రతిపాదనలను అంగీకరిస్తూనే విచారిద్దాం. వ్యతిరేకించటం లేదు.

పాతవస్త్రం విడిచినట్లు ఈ దేహాన్ని విడిచిన జీవుడే వేరే దేహాన్ని స్వీకరిస్తాడు..అని కృష్ణుడు చెప్పాడు. జన్మ ఎత్తేవరకు కొంతకాలం స్వర్గనరకాలు అనుభవిస్తూ ఉంటాడా? ఎంతకాలం? ఐదుతరాలకు తర్పణం యిస్తున్నా నిషేధం (గర్భదానం) మొదటి అంత్యక్రియల వరకు జరిగే షోడశకర్మలనే మంత్రంతో చేయాలని మనువు అంటాడట. వీటన్నింటి తార్కిక సంబంధాలు నిర్ధారించకపోతే, ఎవరికి తోచిన వ్యాఖ్యానాలు వారు చేస్తుంటే హిందూమత అరాచకమతంగా ముద్రపడుతుంది. అరాచకంలో ఎవరి లాభం వాడు చూసుకుంటాడు.

కృష్ణనీళ్ళను పుష్కరతీర్థంలా పోస్టల్ డిపార్టుమెంట్ సరఫరా చేయటం చూడండి. పుష్కరుడు నదీ ప్రవాహ దేశంలో ఉంటాడా? నీళ్ళలో ఉంటాడా? అన్న విచక్షణ కూడా లేదు. కృష్ణ నుండి నీళ్ళు చెన్నయ్‌కు కూడా వెడుతున్నాయి కదా! హిందూ మతం అంటే అర్ధ రహితమైన చాదస్తాల పుట్టలాగా, కోలాహలాలతో అవివేకుల నుండి డబ్బుచేసుకొనే మతంలాగ, ముద్రపడటానికి ఎక్కువ దూరంలో లేము.

పుష్కరాలు దాదాపు అన్ని పెద్ద రాష్ట్రాలకు వస్తాయి.కానీ తెలుగు రాష్ట్రాలు చేస్తున్న హంగు ఆర్భాటం మరే రాష్ట్రాలూ చేస్తున్నట్లు లేదు. అయినా వారికీ పుష్కరుడు వస్తూనే ఉన్నాడు. పుణ్యం సంగతి అంతటా ఒకటే. మౌలిక వసతులు, శాంతి భద్రతలు, ప్రజారోగ్యం, రవాణా సదుపాయం వంటి శాఖలలో ప్రభుత్వం బాధ్యత వహిస్తే చాలు. ఆడంబరం ఆర్భాటం రాజకీయం ఇవన్నీ శ్రుతి తప్పిన రాగాలూ. వృథా వ్యయం, దుర్వినియోగంతో సమానమే.

నగరాల, పట్టణాల, పరిశ్రమల వ్యర్థాలు, కాలుష్యాలు అన్ని నదులలోకి పంపిస్తూ హారతులివ్వటం, కృష్ణవేణీమాత-గోదావరితల్లి విగ్రహాలు ప్రతిష్టించటం, సర్వజనులను, నదీ దేవతలను మోసం చేయటం కాదా?

మతాచారాలలో ధర్మానురక్తిని, భక్తి ప్రపత్తులను పెంచి సారాన్ని పోషించాలి. సుమారు 1000 కోట్లు కృష్ణాపుష్కరాలకు ఖర్చు అయి వుంటాయి. ఉభయ రాష్ట్రాలమీద ఈ ధనాన్ని నదీ ప్రక్షాళనకు వినియోగించి, నిరాంబర భక్తిని, పవిత్ర భావాన్ని-సంస్కృతీ వారసత్వాన్ని ప్రచారం చేసినట్టయితే ప్రజలలో విలువల పట్ల శ్రద్ధ పెరిగేది. నదీ శుద్ధి జరిగేది. ఎంత ఖర్చు పెట్టినా పుష్కరాలు మత విషయమే.

సంక్రాంతికి వాడవాడలా జాతీయ సాంస్కృతిక వేడుకలు నిర్వహిస్తే అది మతాతీతంగా సమిష్టి సంస్కృతి పెంపొందుతుంది. పుష్కరాలు ఈ రీతిలో చేయటం భవిష్యత్తులో దుష్కరం కావచ్చు..

మతం వివేకవంతం కావాలి. ధార్మిక శ్రద్ధ కలగాలి. ❋

## మాతృదేవోభవ

**గుర్రాల రమణయ్య**, 99639 21943



**నే**నెక్కడ ఏ ధూళిలో
బూది అణువునై పడి వున్నానో
నీ కలలో నన్ను వేణువు చేసి
నవమాసాల స్వప్నగీతంగా మలచి
జన్మనిచ్చినందుకు
అమ్మా! నీకు వందనం!

నా బుడిబుడి అడుగులు
తడబడే పాదాలకు
నీ గుండె లయని జతచేసి
చందమామను పిలిచి
పాలబువ్వను తినిపించి
పాటలతో అలరించినందుకు
అమ్మా! నీకు వందనం!

నా ఆకలికి గోమాతవై
నా అల్లరికి సీతమ్మవై
నా అఆలకు ఆదిగురువై
అమ్మా అన్న పలుకునేర్పి
మైమరచి మది తెరచి
ఆ పీఠం అందించినందుకు
అమ్మా! నీకు వందనం!

నా కన్నీటికి కలవరపడి
నా చిరునవ్వుకి సంబరపడి
నా తప్పులకి కలతపడి
నా ఒప్పులకి ఆనందపడి
నా సంతోషమే నీదిగా భావించి
కొంగుచాటున కన్నీటిని దాచినందుకు
అమ్మా! నీకు వందనం!

నేను పుట్టకముందు నించి
నా కోసం కలవరించినందుకు
నీ పాలను పంచినందుకు
పాలబువ్వ తినిపించినందుకు
మమతల దీపం వెలిగించినందుకు
దివారాత్రులు నా క్షేమం కోసం
నీ సుఖసంతోషాలు తెగించినందుకు
నేను పుట్టిన బాధలన్నింటిని
చిరునవ్వుతో చివరంతా
భరించినందుకు
అమ్మా! నీకు వందనం!

–చలసాని నరేంద్ర,
98495 69050

# నగర జీవన పరిస్థితుల పట్ల చూపు సారించాలి

**మ**న ఆర్థిక వ్యవస్థకు వెన్నెముక వంటిదైన వ్యవసాయ, గ్రామీణ రంగాల పట్ల చూపుతున్న నేరపూరిత నిర్లక్ష్య ధోరణుల కారణంగా పట్టణాలకు ప్రజల వలస వేగంగా పెరుగుతున్నది. ప్రస్తుతం సుమారు నాలుగవ వంతు మంది ప్రజలు పట్టణాలలో ఉండగా, ఈ సంఖ్య మరో మూడు దశాబ్దాలలో 50 శాతంకు చేరే అవకాశాలు కనిపిస్తు న్నాయి. అయితే పట్టణాలపై పెరుగుతున్న వత్తిడులను తట్టుకొని, పట్టణాలలో జీవన పరిస్థితులను మెరుగు పరచడం కోసం చెప్పుకో దగిన ప్రయత్నాలు జరపడం లేదు.

పట్టణీకరణ పెరుగుతున్న సమయంలో పట్టణ ప్రజలకు కనీస నీటి లభ్యత కూడా తగ్గిపోతున్నట్లు ఈ మధ్య ఒక పరిశోధన తెలుపు తున్నది. మన దేశంలో గుర్గాన్, హైదరాబాద్ నగరాలలో ఈ పరి శోధన జరిగింది. ఆధునిక పట్టణాలలో భూమి కొరత,నీటి లభ్యత పెనుసవాళ్ళుగా మారుతున్నాయి. నేడు అనేక పట్టణాలలో ట్యాంకర్ల ద్వారా నీటిని సరఫరా చేసుకోవలసిన పరిస్థితులు నెలకొన్నాయి. వాటిల్లో సరఫరా అయ్యే నీటి నాణ్యతపై ఎటువంటి పర్యవేక్షణ ఉండటం లేదు.

పట్టణాలలో అడ్డు, అదుపు లేకుండా బోర్లు వేస్తూ ఉండడంతో భూగర్భ జలాలు అడుగంటి పోతున్నాయి. అందుకు నీటి అవసరం ఎక్కువ ఉన్న పరిశ్రమలు సహితం పట్టణాలలో వస్తూ ఉండటం, పారిశ్రామిక కాలుష్యం పెరుగుతూ ఉండడంతో నగర జీవనం పెను ప్రమాదంతో కూడుకొని ఉంటున్నది. హైదరాబాద్ నగరానికి ఒక నాడు జీవధారగా పేరొందిన మూసీ నది ఇప్పుడు రసాయనాలతో కాలుష్యాలతో నిండి ఉండడంతో ప్రజల పట్ల చావుకు దారిగా మారు తున్నది. దానిని శుభ్రం చేయడం కోసం చెప్పుకోదగిన ప్రయత్నాలు చేయడం లేదు.

ఈ సందర్భంగా భూమి వినియోగం పట్ల సైతం నిర్దుష్టమైన విధానాలను రూపొందించుకోవలసి ఉంది. కొద్దిపాటి వర్షం వచ్చినా దాదాపు అన్ని నగరాలలో రోడ్లన్నీ జలమయం అవడాన్ని చూస్తు న్నాము. అందుకు కారణం భూగర్భ డ్రైనేజీ వ్యవస్థ కుప్పకూలి పోవ డమే. మరో వంక కాలువలు, వాగులు, వంకలు, చెరువులు భారీగా ఆక్రమణలకు గురవడంతో నీటి ప్రవాహమే దుర్భరంగా తయా రయింది.

ఆధునిక నిర్మాణాలు, రోడ్లు, భవనాల కోసం ఉన్న వాగులను మూసి వేస్తూ ఉండడంతో భారీ వర్షాలు కురిస్తే పలు పట్టణాలు జలమయం కావడం తప్ప మార్గాంతరం ఉండదు. చెన్నాయి లో ఈ మధ్య భారీ వరదలతో పలు ప్రాంతాలు మునిగి పోవడం గమ నార్హం. దానితో నగర జీవనం ప్రమాద అంచుకు చేరుతున్నది. పట్టణీకరణ పేరుతో పట్టణాలకు చుట్టూ ఉన్న వ్యవసాయ భూములను ఇష్టానుసారం నివాస, పారిశ్రామిక ప్రాంతాలుగా మార్చి వేశారు. మరో వంక పట్టణాల విస్తృతి ప్రణాళికాయుతంగా జరగడం లేదు. కనీస పౌర సదుపాయాల కల్పన గురించి పట్టించుకోవడం లేదు. నగరాలు మురికి వాడలుగా మారిపోతున్నాయి.

మురికివాడలు లేకుండా నగరాలను అభివృద్ధి చేయడం కోసం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పలు పథకాలను అభివృద్ధి చేస్తున్నా, భారీ నిధులు ఖర్చు చేస్తున్నా క్షేత్ర స్థాయిలో పరిస్థితులలో పెద్దగా మార్పులు రావడం లేదు. పట్టణాలకు వలస వస్తున్న ప్రజలకు తగు ఉపాధి అవకాశాలు లభించడం పెను సమస్యగా మారుతున్నది. కాలేజీ చదువు పూర్తి చేసుకున్న వారు సహితం పట్టణాలలో రోజువారీ కూలీలుగా పనిచేసే పరిస్థితులు నెలకొన్నాయి. ఉపాధి అవకాశాలు లభించక నేరాలు సహితం పెరుగుతున్నాయి.

మరో వంక మురికి వాడలలో తగు ఇంటివసతి లభించక పోవడం, మెరుగైన రోడ్లు లేకపోవడం, పరిశుభ్రత లోపించడం, త్రాగునీరు కూడా సమస్యగా మారుతూ ఉండడంతో దుర్భర జీవితా లను గడుపవలసి వస్తున్నది. ప్రజారోగ్యం ప్రమాదాల అంచుకు చేరుతున్నది. కనీస పారిశుధ్యం కరువవుతున్నది. పుట్టుకతోనే చని పోతున్న శిశువుల సంఖ్య మనదేశంలోనే ఎక్కువగా ఉండటం గమ నార్హం. అదేవిధంగా మృతిచెందుతున్న బాలింతల సంఖ్య కూడా ఎక్కువగా ఉంటున్నది.

ప్రధానమంత్రి నరేంద్ర మోడీ పారిశుధ్యం, పట్టణాలలో జీవన పరిస్థితులు మెరుగు పరచడానికి ఎంతో ప్రాధాన్యత ఇస్తున్నా ఆచ రణలో ఆశించిన ఫలితాలు కనబడటం లేదు. మౌలిక సదుపాయా లను మెరుగు పరచడం, వ్యవస్థాగతమైన ఏర్పాట్లను పటిష్ట పరచడం పట్ల కాకుండా ప్రభుత్వం తన బాధ్యతల నుండి తప్పుకొనే ప్రయత్నం చేస్తూ, ప్రైవేట్ సంస్థలు, కార్పొరేట్‌లపై ఆధార పడుతూ పలు కార్య క్రమాలు ముందుకొస్తున్నాయి.

ప్రభుత్వం వద్ద మెహర్బానీ కోసం కార్పొరేట్ సంస్థలు భారీ ప్రకటనలు చేస్తున్నా, వాస్తవంగా ఏమాత్రం ఆసక్తినీ చూపడం లేదు. ఉదాహరణకు స్వచ్ఛభారత్ కోసం భారీ నిధులు సమకూర్చుతామని హామీల వర్షం కురిపించిన కార్పొరేట్ సంస్థలు తమ హామీలలో ఏడెనిమిది శాతం మేరకు కూడా నెరవేర్చిన దాఖలాలు కనిపించడం లేదు. ప్రభుత్వం జరపవలసిన సేవలను ప్రైవేట్ పరం చేస్తూ ప్రజల జీవితాలను పెనుభారం కావిస్తున్నారు.

మరోవంక ప్రజల నుండి వినియోగచార్జీలను వసూలు చేయడం ద్వారా సేవలు అందించే ప్రయత్నం చేస్తున్నారు. ఒక వంక ఆస్థి పన్ను, రవాణా పన్ను, నీటి పన్ను... వంటి పలు పన్నులను వసూలు చేస్తూ, ఇంకా వినియోగచార్జీలను వసూలు చేయడం అంటే ప్రభుత్వం తన బాధ్యతలను విస్మరించి, వ్యాపార కేంద్రంగా మారినట్లే. నగరా లలో బాలలు ఆడుకోవడానికి స్థలాలు, సేద తీర్చుకోవడానికి పార్కులు అపురూపం అవుతున్నాయి. కొన్ని పార్కులు ఏర్పాటు చేస్తున్నా వాటిల్లో ప్రవేశానికి రుసుము చెల్లించవలసివస్తుంది.

# 'తెనుగులెంక'సూక్తులు-14



మానవేతర జంతు సమాజమెల్ల
ప్రొద్దులారాటపడు తన పొట్ట కొరకు
స్వార్థమే తప్ప నన్య ప్రసక్తి లేని
మూక యిది; దీన నుర్వికే మోక్షమొరుస.

'తెనుగు లెంక' 'అభినవ తిక్కన'
**తుమ్మల సీతారామమూర్తి.**

మానవులకు, జంతువులకు ఎంతో భేదముంది. జంతుజాలం కంటే మానవజాతి మహోత్తమమని మానవులనుకుంటారు. కాని జాగ్రత్తగా పరిశీలిస్తే మనుషుల్లో కనిపించని మంచి లక్షణాలు జంతువుల్లో ఎన్నో కనుపిస్తాయి.

జంతువులు ఆకలి అయినప్పుడే వేటాడి ఆకలి తీర్చుకుంటాయి. కడుపునిండితే అక్కడ ఎదురుగా ఉన్న ఆహారం జోలికిపోవు. కాని మానవుడు ఆకలి కాకపోయినా కడుపునిండా మెక్కుతాడు. ఆశగా, ఆబగా కుతిక వరకు తింటాడు. జంతువులు నిర్ణీతమైన సమయంలో సంభోగాన్ని జరుపుతాయి. కాని మనిషికి ఆ సమయ పాలనలేదు. జంతువులు స్వార్థంకోసం తమ జాతికి చెందిన మరొక జంతువును చంపవు. ఎంత ఆకలయినా ఒకపులి మరొక పులిని గాని, ఒక సింహం మరొక సింహాన్ని గాని చంపడానికి ప్రయత్నించదు. కాని, మానవుడు తన లాభం కోసం సాటిమనిషిని చంపడానికి వెనుదీయడు. జంతువు తన కామ వాంఛను తీర్చుకోడానికి తన జాతికి చెందిన ఆడజంతువును హింసించదు. కాని మనిషి కామంతో కళ్ళుమూసుకొని కోరిక తీర్చుకోవడం కోసం అనేక ఘోరాలకు ఒడిగడతాడు. జంతువు తన సంతానం ఆహారం సంపాదించుకోగలిగిన వయస్సు రాగానే దానిని స్వయంగా బ్రతకమని పంపిస్తుంది. కాని మనిషి తన సంతానం సంపాదించుకో గలిగిన వయస్సు వచ్చినా వారిని విడిచి పెట్టడు. వారి కోసం తామే సంపాదిస్తారు. ఈ విషయాలను పరికిస్తే మనిషి కన్నా జంతువే పలు విషయాల్లో మేలు అనిపిస్తుంది.

మనుషులకు కోరికలు అధికం. కోరికలు ఉంటేనే వాటిని తీర్చుకోడానికి మార్గాన్వేషణ చేస్తాడు. ఆ అన్వేషణ ఫలితంగా శాస్త్ర సాంకేతికరంగాల్లో అభివృద్ధిని సాధిస్తాడు. అందుచేత కోరికలు ఉండాలి. కాని ఆ కోరికలు సాటిమనిషిని బాధించేవిగా, సాటి మనిషిని వేధించేవిగా ఉండకూడదు. సమాజానికి హాని కలిగించేవిగా ఉండకూడదు. కాని దురదృష్టవశాత్తు మనిషి స్వార్థపూరితుడయ్యాడు. ధనసంపాదన యావతో ఉచితానుచితాలు మరిచిపోయాడు. అన్యాయాలకు, అక్రమాలకు తెరతీశాడు– సాటి మనుషులను దోచుకోవడం మొదలుపెట్టాడు. తరతరాలు తిన్నా తరగనంత పోగుచేసుకోడానికి ప్రయత్నించాడు. తన సుఖం కోసం పరులను హింసించడం ఆరంభించాడు. ఇది అభివృద్ధిని సూచించేది కాదు. ప్రగతి నిరోధకం. అధోగతికి పునాది. దీనివలన లోకానికి ప్రయోజనం కలుగదు. హానే జరుగుతుంది.

అందుకే తుమ్మల వారు "మానవులు తప్ప మిగిలిన జంతువులన్నీ ఆకలి తీర్చు కోడానికి మాత్రమే ప్రయత్నిస్తాయి. ఆకలి తీరితే తృప్తిపడతాయి. కాని మనిషి మాత్రం తృప్తిపడదు, స్వార్థంతో బతుకుతూ, సాటి మనుషులను, తన సమాజాన్ని పట్టించుకోడు. దీని వలన భూమికి కలిగే ప్రయోజనం ఏముంది?" అన్నారు. దేశక్షేమం మొదటిదని, తరువాతనే మిగిలిన విషయాలని చెప్పారు. స్వార్థం విడిచిపెట్టమని హితవు పలికారాయన.

**–డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ,**
98497 99711

---

ఆర్థిక సంస్కరణల ఫలితంగా ప్రభుత్వం విద్య, వైద్య రంగాల నుండి పూర్తిగా నిష్క్రమించినట్లు అవుతుంది. దానితో ప్రభుత్వ (పురపాలక) పాఠశాలలు, ప్రభుత్వ వైద్య కేంద్రాలు శిథిలావస్థకు చేరుకొంటున్నాయి. కార్పొరేట్ విద్యాసంస్థలు, ఆసుపత్రులు ప్రజల జీవితాలతో చెలగాటమాడుతున్నాయి. మధ్య తరగతి ప్రజలే కాదు, ఉన్నత మధ్య తరగతి ప్రజలు సహితం తమ పిల్లల చదువు, కుటుంబ బసభ్యుల వైద్యం కోసం ఆస్తులు అమ్ముకొని, అప్పుల పాలు కావలసి వస్తున్నది. ఈ సందర్భంగా ప్రభుత్వం ప్రేక్షక పాత్ర వహించవలసి వస్తున్నది.

ప్రజారవాణా సైతం తీవ్ర నిర్లక్ష్యానికి గురవుతున్నది. రహదారులలో పాదచారులకు దారులే ఉండటం లేదు. ట్రాఫిక్ జామ్ లు నిత్యకృత్యమై పోతూ, రోడ్డు ప్రమాదాలు మితిమీరి పోతున్నాయి. దేశంలో రోగాలు, హత్యల వల్ల కాకుండా రోడ్డు ప్రమాదాలలో అత్యధికంగా ప్రజలు చనిపోతున్నారు. పట్టణ ప్రణాళికలు కాగితాలకే పరిమితం అవుతున్నాయి. మురికివాడలలో పేదలను ఖాళీ చేయించడం కోసం బలప్రయోగం చేస్తున్న అధికార యంత్రాంగం ఉన్నత వర్గాలు – సంపన్నులు, పలుకుబడిగల అధికారులు, రాజకీయ నాయకులు అక్రమంగా జరుపుతున్న నిర్మాణాలను మాత్రం తొలగించే సాహసం చేయడం లేదు.

నగర పాలన యంత్రాంగాన్ని కాంట్రాక్టుదారులే నిర్దేశించడం జరుగుతున్నది. దానితో పనులలో నాణ్యత లోపిస్తుంది. ప్రజాధనం విశేషంగా దుర్వినియోగం అవుతున్నది. సాంఘిక అరాచక శక్తుల ప్రాబల్యం ఈ సందర్భంగా పెరుగుతున్నది. వారిని కట్టడి చేయవలసిన పోలీసులు సైతం వారి కనుసన్నలలో పనిచేస్తున్నారు. భూకబ్జాలు, ప్రైవేట్ పంచాయతీలను పోలీసుల అండతో అసాంఘిక శక్తులు నిర్వహిస్తూ ఉండటం చూస్తున్నాము.

మొత్తం నగర జీవనమే కాలుష్య పూరితం కావడంతో పాటు నేరమయం, ప్రమాదభరితం కావడంతో అభద్రతకు కేంద్రంగా ఉంటున్నది. నగర జీవనాన్ని అందంగా తీర్చిదిద్దటం కోసం మొత్తం పాలనా యంత్రాంగంలో, నగర ప్రణాళిక వ్యవస్థలో మౌలికమైన మార్పులు తీసుకు రావలసి ఉంది. అందుకు ప్రభుత్వాలు రాజకీయ సంసిద్ధతను అలవరచుకోవాలి. ❊

# కళింగాంధ్రను పాలించిన మాఠర, పితృభక్త, వశిష్ట, తూర్పు గాంగరాజులు

-డా॥ఈమని శివనాగిరెడ్డి
సెల్ : 98485 98446

ప్రస్తుత ఆంధ్రప్రదేశ్‌లోని ఉత్తర జిల్లాలు ఒకనాటి కళింగ దేశంలో భాగాలు. కళింగను, ఉత్తర కళింగ, మధ్య కళింగ, దక్షిణ కళింగ అని మూడు ప్రాంతాలుగా విభజించి, మూడింటినీ కలిపి త్రికళింగమనీ, ముక్కళింగమనీ, సలక కళింగమనీ పిలిచారు. క్రీ.శ. 4-6 శతాబ్దాల మధ్య ఉత్తరాంధ్రను మాఠరులు, వశిష్టులు, తూర్పు (తొలి)గాంగులు అనే రాజవంశాలు పాలించి, తమ శాసనాల్లో త్రికళింగను పేర్కొన్నాయి. ఉత్తర కళింగలో, ఒరిస్సా దక్షిణ ప్రాంతాలైన గంజాం, పర్లాకిమిడి భూభాగాలు చేరి వున్నాయి. ఉత్తర కళింగకు శ్రీకాకుళం జిల్లాలోని **సింఘ(సింగు)పురం** రాజధానిగానూ, మధ్య కళింగకు విజయనగరం జిల్లాలోని **దేవపురం**, దక్షిణ కళింగకు పిష్ట పురంగా పిలువబడిన **పిఠాపురం** రాజధానిగా వున్నాయి.

కళింగ, ఆంధ్ర ప్రాంతాలను క్రీ.శ.4-5 శతాబ్దాల్లో పాలించిన రాజవంశాల్లో మాఠరులు ముందువారు, ముఖ్యులు. మాఠర రాజ వంశానికి సంబంధించి, నింగొండి, రాగోలు, అంధవరం, మద్రాస్ మ్యూజియం రాగిరేకులు, సకుణక (శకునక) శాసనాలు ముఖ్యమైనవి. శాసనాలను పరిశీలించిన మీదట శంకరవర్మ, మాఠర వంశమూల పురుషుడు అనీ, అతని కొడుకు శక్తివర్మ, అతని తరువాత, అతని కొడుకు ప్రభంజనవర్మ, అతని తరువాత అనంతశక్తివర్మలు వరుసగా కళింగాంధ్రను పాలించారని చెప్పొచ్చు. సొంత శాసనాలు లేని శంకర వర్మ క్రీ.శ.350వ సం॥రంలో పిఠాపురం నుంచి తన పాలన ప్రారంభించి, 15 సంవత్సరాలపాటు ఏలాడని నిర్ధారించారు. తరువాత క్రీ.శ.365 నుంచి 13 ఏళ్ళపాటు రాజ్యమేలిన శక్తివర్మ ఈ వంశంలోని రెండోరాజు. ఇతడు క్రీ.శ.365 నుండి 378 వరకూ పాలించాడు. ఇతడు రాజధానిని పిఠాపురం నుంచి, శ్రీకాకుళంజిల్లాలోని సింగుపురా(సింఘుపురం, విజయసింఘుపురం)నికి మార్చాడు. ఇతడు పిఠాపురం నుంచి విడుదల చేసిన రాగోలు (రాకలువ) రాగిరేకు శాసనం ప్రకారం ఇతనికి **'పరమదైవత', మాఠరకులాభరణుడు, 'కళింగాధిపతి'** అనే బిరుదులున్నాయి. ఇతడు శాసనాల్లో **వాసిష్టీపుత్రు**నిగా పిలువబడిన సంగతిని గమనించాలి. ఇతని మంత్రులైన శివభోజకునికి **'మహాబలాకృత'** అనీ, వసుదత్తునికి **దండనేత్రుడ**ని బిరుదులున్నాయి. ఇతని తరువాత రాజైన ప్రభంజనవర్మ క్రీ.శ.378 నుంచి క్రీ.శ.393 వరకూ 15 ఏళ్ళపాటు రాజ్యమేలి, మూడు కళింగాలపై పట్టు సాధించి, **సకల కళింగాధిపతి** అనే బిరుదును వహించాడు. ఇతని తరువాత అనంతశక్తివర్మ రాజైనాడు. ఇతడు క్రీ.శ.393 నుంచి క్రీ.శ.421 వరకు పాలించాడు. ఇతనికి **మహారాజు** బిరుదుంది. విష్ణుకుండిన రాజ్యవిస్తరణలో ప్రభుత్వాన్ని కోల్పోయిన మాఠరులు తరువాతి కాలంలో నేటి బస్తరు ప్రాంతంలో సామంతులుగా పాలించినట్లు ఆ వంశానికి చెందిన రెండో మహాభవగుప్తుని కుడోపలి రాగిరేకు శాసనం ద్వారా తెలుస్తుంది. సామంతులైనా, వీరు కూడా కొన్ని బిరుదులు ధరించారు. ఈ శాసనంలో భవగుప్తునికి **త్రికళింగాధీశుడు, సోమకులాభరణుడ**నే బిరుదులున్నట్లూ, అదే కాలానికి చెందిన రాణక శ్రీపుంజ అనే ఉన్నతోద్యోగికి **'మండలాధీశ', 'పంచమహాశబ్ద', 'పదిహేను గ్రామాల ప్రభువు'** అనే బిరుదులున్నట్లూ చెప్పబడింది.



తూర్పు (కళింగ) గాంగ అనన్తవర్మన్ సిరిపురం రాగిరేకు శాసనం క్రీ.శ. 4వ శతాబ్ది

మాఠరుల తరువాత కళింగాంధ్ర ప్రాంతాన్ని **పితృభక్త** అనే రాజవంశీకులు క్రీ.శ. 5వ శతాబ్దిలో పాలించారు. మాతృస్వామ్య (మాతృభక్త) వ్యవస్థను కాదని వాళ్ల పేర్లకు ముందు తండ్రి పేరు తగిలించుకొని **పితృభక్తులు**గా పిలుచుకొన్న వీరు పిఠాపురం నుంచి నేటి తూర్పు గోదావరి, విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలను పాలించారు. వీరి శాసనాలు టెక్కలి, తెంబూరు, బృహత్ప్రోష్ట, రాగోలు, చికాకోల్, బరంగ, బొబ్బిలి, కోమర్తి, తిరిత్థాన, కోరోషండలలో లభ్యమైనాయి. వీరు విడుదల చేసిన రాగిరేకు శాసనాలపై గల రాజముద్రలలో **'పితృభక్త'** అని ముద్రించుకోవటాన వీరి వంశాన్ని **పితృభక్త** వంశంగా గుర్తించారు. ఈ వంశానికి మూల పురుషుడు **'మహారాజ', 'కళింగాధిపతి'** బిరుదులు ధరించిన ఉమావర్మ క్రీ.శ. 421 నుంచి 461 వరకూ 20 సంవత్సరాల పాటు శ్రీకాకుళం జిల్లాలోని **సింహ(సింగు)పురం** రాజధానిగా పాలించి టెక్కలి, తెంబూరు, బృహత్ప్రోష్ట రాగిరేకు శాసనాలను విడుదల చేశాడు.

**మహారాజు** ఉమావర్మ తరువాత అతని కొడుకు నందప్రభంజనవర్మ క్రీ.శ.461లో సింహాసనాన్నధిష్టించాడు. ఇతడు తేదీ లేని శ్రీకాకుళం (చికాకొలి) శాసనాన్ని, క్రీ.శ.476లో బరంగ రాగిరేకు శాసనాన్ని, క్రీ.శ.485వ సం॥లో రాజోలు రాగిరేకు శాసనాన్ని వరుసగా తన రాజధానియైన **సింహ(సింగు)పురం, వర్ధమానపురం, సారిపల్లి** నుంచి విడుదల చేశాడు. ఇతనికి **'సకల కళింగాధిపతి'** అనే బిరుదుంది. ఇతని తరువాత రాజైన అచండవర్మ క్రీ.శ.485 నుంచి 491 వరకూ సింగుపురం నుంచి పాలించినట్లు బొబ్బిలి, కోమర్తి శాసనాలు తెలియజేస్తున్నాయి. కేవలం ఆరేళ్ళు మాత్రమే పాలించిన అచండవర్మకు **'కళింగాధిపతి', 'పరమభాగవత', 'బప్ప భట్టారక పాదభక్త'** అనే బిరుదులున్నట్లు అతని శాసనాల్లో వుంది.

ఈ వంశంలో చిట్టచివరి రాజు పేరు విశాఖవర్మ. ఇతని రాగిరేకు శాసనాలు కోరోషండలో దొరికాయి.ఆ శాసనాల్లో ఇతనికి **'మహా రాజు, 'బప్పభట్టారక పాదభక్త', 'పరమదైవత'** అనే బిరుదులున్నట్లు చెప్పబడింది. ఇతడు ఆరేళ్ళపాటు పాలించి, రాజధానిని సింగుపురం నుండి **శ్రీ (సిరి)పురానికి** మార్చాడు. సి.సోమసుందరరావు లాంటి చరిత్రకారులు మాత్రం ఇతడు ఏ వంశానికి చెందాడో తెలియని స్వతంత్రపాలకుడన్నారు. పితృభక్తరాజైన అచండవర్మకు సమకాలీ నంగా విశాఖపట్నం, విజయనగరం జిల్లాల్లోని కొంత భాగాన్ని వశిష్ట వంశానికి చెందిన రాజులు పరిపాలించినట్లు అనంతవర్మ శృంగ వరపుకోట (ఎస్.కోట), సిరిపురం రాగిరేకు శాసనాల వల్ల తెలు స్తుంది. వీటివల్ల గుణవర్మ (క్రీ.శ.461-76) ఈ వంశ మూలపురు షుడనీ, తండ్రి ప్రభంజనవర్మ (క్రీ.శ.476-491) అనీ, తాత గుణవర్మ **'దేవరాష్ట్రాధిపతి'** (బిరుదు) అనీ,ఈ శాసనాలు దేవపురం (దేవద) నుంచి విడుదలైనాయని తెలుస్తుంది. అయితే అనంతవర్మ రెండోదైన శృంగవరపుకోట శాసనం మాత్రం తూర్పుగోదావరి జిల్లా పిష్ట(పిఠా)పురం నుండి విడుదలవటం గమనించదగ్గ విషయం.

పితృభక్తుల తరువాత కళింగాంధ్రను క్రీ.శ.498-655 మధ్య తొలి తూర్పుగాంగులు, **దంతపురం** రాజధానిగా పాలించారు. ఈ వంశంలో మొదటిరాజు ఇంద్రవర్మ అని ఇతడు విడుదల చేసిన క్రీ.శ.537వ సం॥నాటి జిర్జింగు శాసనాల ద్వారా తెలుస్తుంది. ఇతనికి **అధిరాజ ఇంద్ర, త్రికళింగాధిపతి, గంగామకులగగనతల సహస్ర రశ్మిం** అనే బిరుదులున్నాయి. ఇతని తరువాత రాజైన మహాసామంత వర్మ క్రీ.శ.562 నాటి పొన్నుతూరు శాసనాన్ని సౌమ్యవనం నుంచి విడుదల చేశాడు. ఇతనికి కూడా **త్రికళింగాధిపతి** అనే బిరుదుంది. మహా సామంతవర్మ తరువాత హస్తివర్మ దంతపురం సింహాసనాన్న ధిష్టించి, నరసింగపల్లి, ఉర్లాం శాసనాలను క్రీ.శ.577-78లో విడు దల చేశాడు. ఈ రెండు శాసనాలూ అతనికి **రణభీత, రాజసింహ, కళింగాధిపతి, సకల కళింగాధిరాజ, గంగామల కులప్రతిష్ట** అనే బిరుదులను పేర్కొంటున్నాయి. ఇతడు రాజధానిని దంతపురం నుంచి కళింగ నగరానికి మార్చాడు. హస్తివర్మ తరువాత రెండో ఇంద్రవర్మ క్రీ.శ.585 నాటికి సింహాసనమధిష్టించినట్లు అతని అచ్యుతాపురం సంతబొమ్మాళిలోని శాసనాలు తెలియజేస్తున్నాయి. ఇతడు క్రీ.శ. 589లో పర్లాకిమిడి శాసనాన్ని కూడా విడుదల చేశాడు. ఇతనికి **సోమకుల నాయకమణి, కళింగాధిరాజు, రాజసింహ, గాంగకుల ప్రతిష్టాకర** అన్న బిరుదులున్నట్లు అతని శాసనాల్లో వుంది. ఇతని తరువాత క్రీ.శ.616వ సం॥రంలో కళింగనగర సింహాసనాన్నెక్కిన మూడో ఇంద్రవర్మ తొలి తూర్పు గాంగుల చివరి రాజు. ఇతడు క్రీ.శ.655 వరకూ పాలించి, నాలుగు శాసనాలను విడుదల చేశాడనీ బీవీ కృష్ణారావు తెలియజేశారు. అయితే అతనికున్న బిరుదులు తెలి యటం లేదు.

పరిశీలించిన మీదట, మాఠరశక్తివర్మకు **పరమదైవత** (దైవ భక్తుల్లో అగ్రగణ్యుడు), **మాఠర కులాభరణ** (మాఠర వంశానికి ఆభ రణం లాంటివాడు), **కళింగాధిపతి** (కళింగ దేశానికి రాజు) అనీ, ప్రభంజనవర్మ **సకల కళింగాధిపతి** (మొత్తం కళింగానికి అధిపతి) అనీ, రెండో మహాభవగుప్తునికి **త్రికళింగాధీశుడు**(మూడు కళింగాలకు అధిపతి), **సోమకులాభరణుడు** (సోమవంశానికి ఆభరణం లాంటి వాడు) అనీ బిరుదులున్నట్లు తెలుస్తుంది. అలాగే, పితృభక్త రాజుల్లో ఉమావర్మ, **మహారాజ** (రాజుల్లో గొప్పవాడు), **కళింగాధిపతి** (కళింగ రాజ్యానికి ప్రభువు) అనీ, నంద ప్రభంజనవర్మకు **సకల కళింగాధిపతి** (అన్ని (ముందు) కళింగ దేశాలకు అధిపతి) అనీ, అచండవర్మకు **కళింగాధిపతి, పరమ భాగవత, బప్పభట్టారక పాదభక్త** అనీ, విశాఖ వర్మకు **మహారాజు, పరమభాగవత, బప్పభట్టారక పాదభక్త** అనే బిరుదులున్నాయి. కళింగంలోని కొంత భూభాగాన్ని పరిపాలించిన వశిష్ట వంశరాజు గుణవర్మకు **దేవరాష్ట్రాధిపతి** అనే బిరుదుంది. దేవపురం నుంచి పాలించటాన ఆయన పాలించిన ప్రాంతాన్ని దేవ రాష్ట్రం అన్నారు. కళింగాంధ్రదేశాన్ని పరిపాలించిన మరో రాజవంశ మైన తూర్పు (తొలి) గాంగరాజుల్లో ఇంద్రవర్మకు **అధిరాజ ఇంద్ర** (రాజుల్లో అగ్రగణ్యుడు), **త్రికళింగాధిపతి** (మూడు కళింగాలకు అధిపతి), **గంగామలకులగగనతలసహస్రరశ్మి** అనీ, మహాసామంత వర్మకు **త్రికళింగాధిపతి** (మూడు కళింగాలకు అధిపతి) అనీ, హస్తి వర్మకు **రణభీత** (యుద్ధంలో భయాన్ని కలిగించేవాడు), **రాజసింహ** (రాజుల్లో సింహంలాంటివాడు), **కళింగాధిపతి, సకల కళింగాధిరాజ** (అన్ని కళింగాలను ఏలే రాజుల్లో మేటి), **గంగామలకులప్రతిష్ట** అనీ రెండో ఇంద్రవర్మకు **సోమకుల నాయకమణి, కళింగాధిరాజు, రాజ సింహ, గాంగకుల ప్రతిష్టాకర** అనే బిరుదులున్నాయి. రాజ్యాలు చిన్నవైనా, విశాల భూభాగాలను పాలించిన చక్రవర్తుల్లా పెద్ద బిరు దులు ధరించటం గమనించాల్సిన విషయం. ❋

# తెలుగు భాషా దినోత్సవ సందర్భంగా ప్రభుత్వ పురస్కారాలు

తెలుగు భాష పరిరక్షణకు కృషి చేస్తున్నవారిని, రచయితలను, కవులను రాష్ట్రప్రభుత్వం ఆగస్టు 29న విజయవాడలో జరిగిన సభలో సత్కరించింది. 20 మందికి అవార్డులు ప్రకటించగా హాజరైన 19 మందికి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు పురస్కారాలు అందజేశారు. పురస్కార గ్రహీతలు... వేదగిరి రాంబాబు- హైదరాబాద్, ఎన్ఎస్ రాజు- హైదరాబాద్, సలాక రఘునాథశర్మ -రాజమండ్రి, మీగడ రామలింగస్వామి -విశాఖపట్నం, జీవీపూర్ణచంద్-విజయవాడ, ద్వానా శాస్త్రి-హైదరాబాద్, కోటపురుషోత్తం-తిరుపతి, సాకం నాగరాజు-తిరుపతి, వేదాంతం శరత్‌చంద్ర-విజయవాడ, కొంపెల్ల రవిచంద్ర- తిరుపతి, శాంతినారాయణ- అనంతపురం, అడిగోపుల వెంకటరత్నం -తిరుపతి, మోదుగల రవికృష్ణ- గుంటూరు, దాదా హయత్-కడప, సుభాషిణీ-కర్నూలు, నారంశెట్టి ఉమామహేశ్వరరావు- విజయనగరం, భాస్కర్‌రెడ్డి- నెల్లూరు.

# తెలుగువాణి కార్యక్రమం








**ఉ**త్తర అమెరికా తెలుగు సంఘం (తానా) వారిచ్చిన తోడ్పాటుతో తెలుగువాణి ట్రస్టు ఇప్పటి తమిళనాడులోని ఉడుముల పేట తావులో పన్నిక (కార్యక్రమము)ను మొదలుపెట్టింది. పరపరుల (ప్రచారకుల) ఎంపిక, వారికి అలవరపు (శిక్షణ) పనులను 2016 మే, జూన్ నెలలలో ముగించింది. సామల మురళి, పెద్దప్పకోళ్ళ లక్ష్మీనారాయణ, పైడిపాల మురుగేశ్, నారగంటి తిరుమలరెడ్డి, నారగంటి ఏకాంబరరెడ్డి అనే అయిదుగురు పరపరులతో ఉడుముల పేట పల్లెలలో జులై నుండి తెలుగు తరగతులను మొదలు పెట్టింది. జులై మొదటి నుండి ఆగస్టు 14 వరకు మొత్తం తొమ్మిది ఊళ్ళలో తెలుగు తరగతులు నడిచినాయి. గోమంగళం కొత్తూరు, దీపాలపల్లి, మొదుకుపల్లి, ఎస్.వి.పురం, కళలపల్లి, గణపతిపాళెం, ఎల్లప్ప నాయుడూరు, పొట్టెంపాళం, ఉడుమలపేట ఆర్యవైశ్యమండపం– ఈ తొమ్మిది ఊళ్ళలోనూ కలిపి మొత్తం నూట అయిదు మంది తెలుగు రాయడాన్ని నేర్చుకొన్నారు. వీరందరికీ ఆగస్టు 15 మాపున 5 గంటలకు ఉడుమలపేట ఆర్యవైశ్యమండపంలో ఒరపురేకు (సర్టిఫికెట్)లను ఇస్తూ ఒక నెఱపు వేడుక (ముగింపు సమావేశం)ను తెలుగువాణి జరిపింది. ఈ వేడుకలో ఎల్లలులేని తెలుగు పన్నికకు ఆయా ఊళ్ళలో తోడ్పడిన ఉసులరులు (ఫెసిలిటేటర్స్) –వలపుల సెందిల్ కుమార్ నాయుడు, పచ్చా పాపుస్వామినాయుడు, పగడాల గంగ, వల్లూరి వెంకటేశ్‌నాయుడు, చేగళ్ళ అయ్యప్పశెట్టి, పత్తిపాటి సెల్వంనాయుడు, మద్రివాడ ఇంద్రాణి, పచ్చా రాజేశ్వరి గార్లు పాల్గొన్నారు. తెలుగువాణి పెట్టిన తీరువు(పరీక్ష)లో నెగ్గిన నూటైదుమంది వచ్చి, ఒరపు రేకులను తీసుకొన్నారు. మొత్తం పన్నికను మార్టూరి వసంత్‌నాయుడు, స.వెం.రమేశ్ నడిపినారు.

–'అమ్మనుడి' తమిళనాడు ప్రతినిధి

### ఉరిమాను తావు

గాంధి, పటేల్ ఇట్ట ఎందురో మన దేశానికి సొతంత్రం తీసేదాని కోసరం పాటు పడి ఉండారు. మనకు తెలిసినవాల్లు మట్టుం లేకుండ, మనకు తెలవకుండా ఇంక ఎందురో మన దేసం కోసరం వాల్ల బతుకును త్యాగం చేసి ఉండారు. అట్ట ఎవురికి తెలవకుండనే పోడిసిన ఒగ తెలుంగు రాజా కత ఇది. గట్టిబొమ్ము, భగత్‌సింగ్ ఇట్ట ఎందురో సొతంత్రం కోసరం పోరాడి కడసీల తెల్లకాండ్ల చేతల్లనే ఉరి పడి సచ్చి పొయ్యి ఉండారు. ఐతే ఇండియాలనే ఒక తెల్లకాండిని ఉరి వేసిన మొదటి రాజా గుజ్జుబొమ్ము ఎద్దులప్పనాయండు. కొంగునాడుల ఉండే జల్లేపల్లి అనే పాళయపట్టుకు రాజా ఎద్దులప్ప నాయండు. జల్లేపల్లి పాళయపట్టుల సుంకం వసూలు చేసేదానికి వచ్చిన ఏండ్ర్యూ కేతీస్ అనే తెల్లకాండిని,"నువ్వు ఎవరు రా మా నాడుకు వచ్చి మా దగ్గిరనే సుంకం తీసేవాండు" అని చెప్పి వాండిని ఉరి వేసినాండు ఎద్దులప్ప నాయండు. ఇది ఇండియాలనే ఏడానూ నడవని పని. ఈ తావు ఇప్పుడూ ఉరిమాని తోంట అనే పేరు తోడ ఉంది. ఈ కత, మా తావుల నూటికి ఒగ మనిసికే తెలుసేది. అది కూడ అందరికీ ఎత్తలప్పర్ అనే తమిళ్ పేరుతోడ, ఒగ తమిళ్ రాజాగనే ఆ వీరమయ్యిన తెలుంగు నాయండు కనిపించేండు.ఏల అంటే తమిళ్ పత్రికల్ల అట్టనే వచ్చు. ఈడ ఇన్ని తెలుంగువాండ్లు ఉండినా మా రాజా పేరును ,మన తెలుంగువాండ్ల పెరుమను కాపాడుకోను అవ్వలేదు. గుజ్జుబొమ్ము ఎద్దులప్పనాయండుని ఇప్పుడు ఎత్తలప్పర్ చేసిరి. ఇంక కొద్ది దినాల్ల ఆతండు తమిళ్ వాండుంట ముద్దిర గుద్దేస్తురు. అనిక ఎద్దులప్ప నాయండు తెలుంగువాండు అని చెప్పితేను తెలుంగు కోసరం ఇట్ట అంతా పెరటు చెప్పకూడదు అని తెలుంగువాల్లే చెప్పేవరకు చేసేస్తురు. తమిళ్ వెఱ్రి పట్టిన మా నాడుల మమ్మల్నించి ఏది చెయ్యను కాదు. ఆంధ్రావల్లు ఐనా ఈ నిక్కాన్ని బయట పెట్టండ.

**–మార్టూరి సంజనా పద్మం,** ఉడుమలపేట, తిరుపూరు జిల్లా, తమిళనాడు

# సబ్బినాడులో లభించిన రెండు శాసనాలు

-సి.శ్రీనివాసరాజు
98491 51995

సబ్బినాడు (తెలంగాణ) ఈ పదం పలుకుతే, వింటే, రాస్తే, నా ఒళ్లు పులకరించిపోతుంది. ఎందుకంటే నేను పుట్టి పెరుగుతున్న ప్రాంతం గనుక, "సబ్బినాడు" ఇది చాళుక్యుల కాలంలో పురుడు పోసుకుంది. రాష్ట్రకూటుల "ముల్కి" నాడుకు అనంతర పదమిది. సబ్బిగాడు అనగా సంపద వచ్చే చదునైన నేల అనే అర్థంలో వాడబడిందని తెలుస్తున్నది. వేములవాడ చాళక్యుల కాలంలో సబ్బి సహస్ర - 1000 మొదట్లో, తదనంతరం చబ్బి 25,000 ఆ తరువాత రాజ్యం విస్తరించిన దాన్ని అనుసరించి, ఆదాయం పెరిగిన క్రమంలో సవలక్కె (కోసవల) 1,25,000 లుగా ఈ ప్రాంతానికి విలువ హెచ్చింది. చాళుక్యులు ముఖ్యంగా అరికేసరి పాలన నుండి సబ్బినాడు ప్రాంతానికి ప్రాధాన్యత వచ్చి, కాకతీయుల కాలంలో అతి పెద్ద పరిపాలన విభాగంగా మారి చారిత్రక వైభవాన్ని సంతరించుకున్నది.

ఇక్కడి తొలి శాసనాలు పాళీభాషవి- బౌద్ధానివి, బుద్ధుని కాలంలోనే బౌద్ధం ఇక్కడికి చేరింది. జైనం అంతకు కొంతముందే వచ్చింది. 24వ, తీర్థంకరుడు వర్ధమాన మహావీరుడు బుద్ధునికంటె వయసులో కొంత పెద్ద, మొదటి తీర్థంకరుని (వృషభనాథుడు) రెండవ కుమారుడు బాహుబలి అశ్మక మహారాజు, షోడష మహాజన పదాల్లో దక్షిణాన చివరికి అశ్మక, దాని నాటి రాజధాని పోతలి- నేటి బోధన్, ఆదిపురాణం బాహుబలి చరిత్రే. శ్రవణ బెల్గొళ గుమ్మటేశ్వర విగ్రహం ఈ బాహుబలిదే. ఇంకా జినవల్లభుని అన్నగారైన పంప మహాకవి నివసించిన క్షేత్రం బొమ్మలమ్మ గుట్ట తెలంగాణాలోనిదే.

బౌద్ధం విషయానికి వస్తే బుద్ధుడు జీవించి వున్న కాలంలోనే బౌద్ధం అశ్మక రాజ్యానికి వచ్చిన ఆధారం ఉంది. సుత్తపిటకంలోని సుత్తనిపాత పారాయణవగ్గలో బావరిముని ప్రస్తావన వచ్చింది. అతని శిష్యులు 16 గురు పండితులు గుర్వాజ్ఞతో మగధకు వెళ్ళి బుద్ధునితో చర్చించి బౌద్ధులైనట్లు, ఒక్కడు "సింగియ" మాత్రం తిరిగి వచ్చి గురువుకు విషయం చెప్పగా విని, వృద్ధబావరి బౌద్ధధర్మం స్వీకరించి సంతృప్తిగా నిర్వాణం చెందినట్లు వివరణ ఉందని డా॥ మలయశ్రీ గారు ధృవీకరించారు. బావరిది అశ్మక గోదావరి తీరమని అది మన మెట్‌పల్లి- ఖానాపూర్ (ఆదిలాబాద్) మధ్య ప్రవహించే గోదావరీ నది నడిమి ద్వీప గ్రామమని ప్రముఖ ఆర్కియాలజిస్ట్ కీ॥శే॥ టి. రాజారాంసింగ్ తెలిపారు.

కరీంనగర్ జిల్లా కోటిలింగల సమీప గ్రామం మొక్కటరావుపేటలో ఇటీవల మూడు పంక్తుల శిలాశాసనం పెరడులో కనిపించింది. అది క్రీ.పూ. కాలపు పాళీశాసనం- బ్రహ్మీలిపి అనేది మాత్రం సత్యం. నా అనుభవం మేరకు ఈ శాసన శిల పరిశీలనకు వెళ్ళినప్పుడే మొక్కటరావుపేట- కప్పురావు పేట నడిమి పొలాలలో కనిపించిన రాతి కణీ దూలం మీద రాసిన- ఏడు బ్రహ్మీ అక్షరాలు (డబల్‌లైన్స్) శాసనముంది. అది "నాగగోపనికాయ". కాని, ఆనంద బుద్ధ విహార ట్రస్టు సికింద్రాబాద్ సంస్థ 1998లో ప్రచురించిన ఆంగ్ల పుస్తకం Buddhist Inscriptions of Andhradesa పుట, 115లో ఆ అక్షరాలు "నాగగోపనికాయ" అని ఉంది. ఏది సరియైన రూపం. రెండూ ఒకే శిలయేనా? పై పుస్తకంలో కోట దగ్గరపడిఉందని ఉంది. నికాయం అంటే గోష్ఠి లేదా నివాసం. నికాయ పదం భట్టిప్రోలు, అమరావతిలో ఉందని ఇటీవలి ఒక వ్యాసంలో ఉంది. క్రీ.పూ. 2 శతాబ్దాలనాడు ఇక్కడొక బౌద్ధనికాయం ఉండటం ఒక విశేషం. శాతవాహన పూర్వాంధ్ర రాజులలో చివరి వ్యక్తి పేరు 'సమగోప'. అతనికి బంధువు ఈ నాగగోప అనుకుంటే అది క్రీ.పూ. 270-240 కాలం. ధూళికట్ట దాన ఫలకల మీద పేర్లు కూడ ఆ కాలానివే. అవి - సామయ, నంది, అజన, సిరి (గ్రామం) మాఢరీపుత్ర, పిథల, వీటిలో కొన్నయినా తెలుగు తొలిపదాలే అనవచ్చు. ప్రస్తుతం కరీంనగర్ గాంధీ సెంటినరీ మ్యూజియంలో ఉన్న ఈ రెండు శాసన శిలల వివరాలు (నా పరిశోధన ప్రకారం మాత్రమే)

**శాసనం-1 :**

ఈ శాసనంపై "నాగగోపినికాయ" అను ప్రాకృత భాష లిపి పదాక్షరాలు కలవు. నికాయ అనగా పాఠశాల అని అర్థం. గౌతమ బుద్ధుని నిర్యాణానంతరం ఆయన బోధనలను క్రోడీకరించి వాటిని విశ్వవ్యాప్తం చేయుటకు ఆసియా ఖండంలోని వివిధ ప్రాంతాలలో 18 పాఠశాలలను (నికాయాలు) స్థాపించారు. వీనిని "ఎమర్జింగ్ సెక్టోరియన్ బుద్ధిజం" అంటారు. రెండవ బౌద్ధసంగీతి అనంతరము




ఈ పాఠశాలల్లో వినయ, సుత్త పిటకాలపై చర్చించి, వాటికి వివరణలు రాసి, ప్రచారంలోకి తెచ్చారు. నాగగోప అనగా నాగులకు ప్రియమైనవాడు. అనగా బుద్ధుడు. మరియు క్రీస్తు పూర్వము మూడవ శతాబ్దంలో ఉజ్వల నాగరికత విలసిల్లిన కరీంనగర్ జిల్లాలోని ప్రాచీన నగరాలైన కోటిలింగాల, పెద్దబొంకూర్, ధూళికట్ట ప్రాంతాల దగ్గరి ప్రదేశమైన ముక్కరావుపేటలో ఈ పాఠశాలను స్థాపించడం మన పూర్వకాల చరిత్రను ధృవీకరిస్తుంది. మరియు ఇప్పటికి 23 వందల సం॥ల ముందే పాఠశాల ఏర్పడిన ప్రదేశం దక్షిణ భారతదేశంలో ఇదే మొదటిది.

క
వి
త

# లక్ష్యం ఒక దిక్సూచి

-డా॥ కత్తి పద్మారావు
98497 41695

నల్లబల్ల మీద అక్షరాలు శాసనాలౌతున్నాయి
ఆత్మస్థైర్యం ప్రతి అడుగుకూ ప్రాణం
లక్ష్యం ఒక దిక్సూచి
కృత్రిమమైనవన్నీ కూలిపోతున్నాయి
సంభాషణలో సంగీతం, ఆహార్యంలో నవ్యత
అవును! వారు నిరాకరిస్తూనే ఆక్రమిస్తున్నారు
ఆ తోట సూర్యోదయాన్ని ఆహ్వానిస్తోంది
తోడు ఒక్కరు కాదా!
తోడు ప్రతినిత్యం మారితే
శిల్పం చలితం కాదా!
ప్రశ్న ఒక ఉత్తేజం, పిలుపు ఒక గుర్తింపు
సంబోధన ఒక ఉజ్వలత
ముఖ కవళికలు మారుతున్నాయి
భావోద్వేగాలు మారడం లేదు కదా!
కరచాలనం ఒక స్పర్శ
మౌత్ ఆర్గాన్ మోగేటప్పుడు
కళ్ళు ఎన్ని చిత్రాలు గీస్తాయో!
అవును! కళ్ళు ఎన్నో మాట్లాడతాయి
ముంగురులు చెప్పే కథలు
ప్రతిరోజు ఏదో ఒక పండగ
అన్నీ కానుకలే! అన్ని అభినందనలే!
ఆ చిన్న చిన్న బల్బుల మధ్య
చీకటి దొంతరలు కూడా ఉన్నాయి
వెలుతురు బాగా తగ్గిపోతోంది
మాటలు సత్యాన్ని కోల్పోతున్నాయి
ద్విముఖత పెరుగుతున్నది
'విశ్వాసం' ప్రేమకు 'శ్వాస' కాదా!



మెదడు శక్తిని విరబూయడం లేదు
అక్షరం వికసించాల్సిన చోట
దృశ్యాదృశ్యాలు ఆగమిస్తున్నాయి
వాళ్ళెందుకు బలవంతం చేస్తున్నారు
'ప్రతిభ'ను పెంచుకోలేకపోతున్నారు
ప్రకృతి వికృతుల మధ్య వైరుధ్యం
గుంపులు గుంపులుగా
మనుషులు జీవించాలనుకొంటారు
కానీ ఒంటరితనమే వారిని వేధిస్తుంది
అక్షరం వారి మెదడుల్లో నిలబడటం లేదు
దృశ్యం వారి కనుల్లో నుండి
మెదడుల్లో ముద్రకావడం లేదు
ఏకాగ్రత, తపస్సు అవసరం సుమా!
తపస్సు అంటే ఏమిటి?
పునర్వివేచన, పునర్నిర్మాణం.
అవును! మీకు మీ కోసం 'స్పేస్' ఏది!
కాలాన్ని, స్థలాన్ని సమన్వయించుకోరా!
లక్ష్య నిర్దేశం ఒక్కటే పురోగమనానికి మార్గం
వ్యక్తిత్వ నిర్మాణం ఒక శిల్ప రహస్యం
మెదడును, మనస్సును
సమన్వయించుకోవడమే శిల్పం!
సున్నితత్వాన్ని మీరెందుకు కోల్పోతున్నారు?
మనస్సు స్వచ్ఛతను కోరుకుంటుంది!
ఉలి చేతిలో వుంటే చాలదు
అతడికి నైపుణ్యం ఉండాలి
ఒకసారి శిల్పం ఏర్పడ్డాక
అనంతకాలం దాని ప్రశస్తి....!

**శాసనం -2 :**

"నబ బాలికాయ మహాపురుషదాతయ
అమచాపుతసా శివవాతున సాపాతకాయ నియచదాయం
చత బాలికాయ హకుసిరియా ఇజయనాగగోపయ"

క్రీస్తుశకం 1వ శతాబ్దికి సంబంధించి బ్రాహ్మీలిపి ఉన్నపై శాసన పదాక్షరాలు శాతవాహనుల రాజుల పాలనలోని విశేషాలను తెలియ జేస్తున్నవి. పై శాసన అర్థాన్ని పరిశీలించినా శాతవాహన రాణి



నాగానిక కుమారుడైన "హకుసిరి" మనుమరాలైన బాలికాయ. ఈమె అమచాపుతసా శివవాతుస కుమార్తె, ఈమె ముక్కరావుపేట ప్రాంతంలో ఆమె జ్ఞాపకార్థం ఒక చైత్యాన్ని బౌద్ధులకు దానం చేసినట్లు తెలుప బడుచున్నది. బహుశా ఇక్కడి నాగముచ్ఛిళిందరాజు వీరిని ఆహ్వా నించి ఉండవచ్చు. ప్రస్తుతం ముక్కరావుపేట పరిసరాలలో ఒక ఎత్తైన దిబ్బ నేటికిని కలదు ఇది అదే. దీనిని బట్టి శాతవాహన రాణులు వైదిక మతంతో పాటు బౌద్ధమతాన్ని కూడా అదరించారని స్పష్టంగా తెలుస్తున్నది.

ఇప్పటివరకు త్రవ్వకాలలో లభించిన కట్టడాలు మరియు నాణాలను బట్టి శాతవాహనుల చరిత్రను వ్రాయడం జరిగింది. ఈ పైరెండు శాసనాల వలన కరీంనగర్ జిల్లాలో బౌద్ధమతం మరియు శాతవాహన రాజుల వివరాలు ఆ కాలం నాటి పరిస్థితులు తెలుసు కొనడానికి బలమైన సాక్ష్యాలు ఇవి. కావున అపార చారిత్రక సంపద కలిగి ఉన్న కోటిలింగాల ప్రాంతాన్ని కేంద్ర, రాష్ట్ర పురావస్తుశాఖ వారు త్వరితగతిన వెలికి తీసినట్లయితే తెలంగాణ చారిత్రక-సాంస్కృతిక వికాసాన్ని దేశవాసులే కాకుండా ప్రపంచ దేశాలు కూడా అధ్యయనం చేసే రోజు కచ్చితంగా రానున్నది.

ఈ వ్యాసరచయిత కరీంనగర్ జిల్లా కాటారంలోని ప్రభుత్వ జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్. సెల్ : 98491 51995

❈

# హోసూరులో సమావేశమైన రాష్ట్రేతర తెలుగు సమాఖ్య తీర్మానాలు



**త**మిళనాడు హోసూరులో ఐక్య తెలుగు సంఘాలు మరియు రాష్ట్రేతర తెలుగు సమాఖ్య ఆధ్వర్యంలో నాదబ్రహ్మ శ్రీ త్యాగరాజ స్వామి 250వ జయంత్యుత్సవాలు ఆగస్టు 13, 14 తేదీల్లో ఘనంగా జరిగాయి. హోసూరు మొత్తం ఈ రెండు రోజులు పండుగ వాతావరణం సంతరించుకుంది.

ఇదే సందర్భంగా రాష్ట్రేతర తెలుగు సమాఖ్య వార్షిక కార్యవర్గ సర్వసభ్య సమావేశం ఆగస్టు 12, 13 తేదీల్లో హోసూరులో జరిగింది. వివిధ రాష్ట్రాల నుండి ప్రముఖులు విచ్చేసి అక్కడ స్థానిక తెలుగు సంఘాలు విన్నవించిన తెలుగు భాషా సమస్యలను విన్నారు. వచ్చే సంవత్సరానికి ప్రస్తుత అధ్యక్షులు పి.వి.సి.సి ప్రసాద్ గారిని రా.తె.స. ఛైర్మన్‌గా, ముంబైకు చెందిన శ్రీనివాస్ కోడూరుని అధ్యక్షులుగా రా.తె.స. కార్యవర్గం ఎన్నుకుంది.

తదుపరి భాష, విద్యలకు సంబంధించిన సమస్యలు, పరిష్కార దిశగా కార్యాచరణ విషయంలో సమగ్ర చర్చ జరిగింది. ఈ సందర్భంగా తమిళనాడు, ఒరిస్సా, ప.బెంగాల్, కర్ణాటక రాష్ట్రాలతోపాటు దేశ వ్యాప్త పరిస్థితులను కూలంకషంగా చర్చించి తీర్మానాలు చెయ్యడం జరిగింది. వాటిలో కొన్ని ఇవి.

- తెలుగుభాషను విద్యారంగం నుండి తుడిచి వేసే కుట్రపూరిత ప్రయత్నాన్ని అడ్డుకొని, కనీసం 10వ తరగతి వరకు తెలుగును (భాషా వాచకం) ప్రథమ భాషగా గుర్తించి, వార్షిక పరీక్షల నిర్వహణలో ఇతర విషయాలతోపాటు సమానమైన ఉత్తీర్ణ అర్హత మార్కులు ప్రదానం చేస్తూ గుర్తించబడాలి. ఆ దిశగా రా.తె.స మరియు తమిళనాడుతోపాటు ఇతర రాష్ట్రాలు, రా.తె.స సభ్యులతో పాటు, స్థానిక తెలుగు సంఘాలు కృషితో లక్ష్యసాధనకు ప్రయత్నించాలి. ఈ విషయంలోఉన్నత, సుప్రీం న్యాయస్థానాలను ఆశ్రయించి మాతృభాష పరిరక్షణకు అంకితభావంతో కృషి చేయాలని తీర్మానించడం జరిగింది.
- మాతృభాషని పరరక్షించుకునే ప్రయత్నంలో భాగంగా ఆంగ్ల మాధ్యమంలో చదువుకునే విద్యార్థులకు తెలుగుభాష వికాస సమితులను ప్రారంభించి శని, ఆదివారాలలో ఒక గంట మాతృ భాషను నేర్పాల్సిన అవసరం వుంది. ఆ దిశగా కార్యాచరణకు తీర్మానించడమయ్యింది.
- రాష్ట్రేతర తెలుగువారు జరిపే సాంస్కృతిక సాహిత్య కార్యక్రమాలను స్థానిక పత్రికలు, దృశ్య మాధ్యమాలుసహకారం అందించి ప్రోత్సహిస్తున్నారు కానీ జాతీయ పత్రికలు, దృశ్య, శ్రావ్య మాధ్యమాలలో కూడా విస్తృత ప్రచారం కల్పించవలసిందిగా అభ్యర్థిస్తూ తీర్మానించారు.
- తెలుగువారి భాష విషయ సాహిత్య సాంస్కృతిక పరిరక్షణకు తగు చర్యలు తీసుకొనేందుకై ఇరు తెలుగు రాష్ట్ర ప్రభుత్వాలు శాశ్వత ప్రాతిపదికన సభాసంఘాన్ని నియమించాలని కోరుతూ తీర్మానించడం జరిగింది.
- రాష్ట్రేతర ప్రాంతంలోని కవులకు, రచయితలకు, కళాకారులకు కూడా ఆంధ్ర తెలంగాణ ప్రాంత తెలుగువారికి అందించినట్లే ఉగాది మొదలగు పురస్కారాలు అందించి ప్రోత్సహించాలి.
- తెలుగు పాఠ్యపుస్తకాలు అయిదవ తరగతి వరకు తెలుగు ప్రభుత్వాలు అందిస్తున్నాయి గాని పదవ తరగతి వరకు తెలుగు వాచకాన్ని కూడా అందించి సహాయ పడాలని తీర్మానించడం జరిగింది.
- తెలుగు ప్రభుత్వాల విద్యా శాఖామాత్యులు ఇతర రాష్ట్రాల లోని తెలుగు విద్యాలయాల విషమ సమస్యలను ఆయా రాష్ట్ర ప్రభుత్వాలతో చర్చించి, సత్వరం పరిష్కరించాలని అభ్యర్థిస్తూ తీర్మానించడం జరిగింది.

రాష్ట్రేతర తెలుగు సమాఖ్య ఒక ముఖ్యమైన ప్రోత్సాహక నిర్ణయం తీసుకుందని రా.తె.స. అధ్యక్షులు శ్రీ ప్రసాద్ గారు సభకు వెల్లడించారు. రాష్ట్రేతర తెలుగు ప్రాంతాలలో తెలుగు భాషని, తెలుగు కళా వైభవాన్ని పరిరక్షించడానికి అనేకమంది వ్యక్తులు, సంఘాలు అనాదికాలంగా కృషి చేస్తున్నాయి. అటువంటి వారిని గుర్తించి వారి పేరున ఒక 'తెలుగురత్న' పురస్కారాన్ని ఇవ్వాలని సర్వసభ్య సమావేశం ఏకగ్రీవంగా నిర్ణయించింది. హోసూరులో తెలుగు భాషా పరిరక్షణకి స్వర్గీయ శ్రీ కె.ఎస్‌కోదండరామయ్య గారు చేసిన కృషి సాటిలేనిది. ఆ మహనీయుడిని మొట్టమొదటి పురస్కారంతో సన్మానించడం రాతెస సంస్థకే గౌరవమని భావించి, మరణానంతర పురస్కారాన్ని ముంబైలో ఫిబ్రవరి 4,5 తేదీల్లో జరగబోవు ద్వితీయ రాతెస వార్షిక సమావేశంలో ఇవ్వడం జరుగుతుందని ప్రకటించారు. ❊

# 'మనమీదేనన్రోయ్'
# 'సరసి' రెండు కార్టూన్ల పుస్తకాలు విడుదల

నలుగురూ కలిసినపుడే పండగ. హాయిగా నవ్వినరోజే పండగ. తెలుగులోగిళ్ళలో వెల్లివిరిసే అచ్చ తెలుగు నవ్వు పువ్వుల్ని ఏరుకొచ్చి దండల్లా గుచ్చి పాఠకుల గుండెల్ని ఆత్మీయంగా తాకేలా అలంకరించారు మన కార్టూనిస్టు సరసి. ఒకటి కాదు రండు దండలు.

'నవ్య' వారపత్రికలో అప్రతిహతంగా పదకొండు సంవత్సరాలు పూర్తి చేసుకొని, పన్నెండో సంవత్సరంలో అడుగు పెడుతున్న కార్టూన్ శీర్షిక 'మనమీదేనన్రోయ్'. ఆ కార్టూనుల్లో చచ్చులూ పుచ్చులూ ఏరి నికార్సయిన నాలుగు వందల కార్టూన్లని రెండు సంపుటాలుగా వెలువరించారు సరసి. ఆ పండగే ఆదివారం ఆగస్టు 14సాయంత్రం



సికింద్రాబాద్ ప్యారడైజ్ సర్కిల్ సమీపంలోని సన్‌షైన్ హాస్పిటల్ ప్రాంగణంలోని శాంత ఆడిటోరియంలో జరిగిన ఆవిష్కరణ ఉత్సవం.

సభా ప్రారంభంలో వేదిక మీది ఆహుతులంతా బాపురమణల చిత్రపటానికి పూలమాల వేసి, జ్యోతులు వెలిగించి నివాళులు అర్పించారు. **అతిథుల్ని స్వాగతిస్తూ మాట్లాడిన సరసి – సమాజంలో తెలుగుదనం రాను రాను అంతరించిపోతోందని పేర్కొంటూ, భవిష్యత్తులో ప్రభుత్వాలు ప్రవేశపెట్టే పూర్తిస్థాయి ఇంగ్లీషు మీడియం స్కూళ్ళవల్ల తెలుగు నేర్చుకునే పిల్లలూ, నేర్పే ఉపాధ్యాయులూ కూడా ఉండరన్నారు. ఆ కారణంగా ముందు ముందు తెలుగులో వెలువరించే కథలూ, కవితల పుస్తకాలూ చదివేవారుండరని, కాబట్టి తెలుగు వారందరూ ఉద్యమించాల్సిన అవసరం వుందన్నారు. అలాగే ప్రతి వారూ పుస్తకాలు కొని చదివే అలవాటు పెంపొందించుకోవాలని, పిల్లలకూ తెలుగుపట్ల ప్రేమాభిమానాలు కలగజేయాలనీ, శుభకార్యాలలో మంచి పుస్తకాలను బహుమతిగా ఇచ్చే సంస్కృతిని వృద్ధి చేసుకోవాలని అన్నారు.**

సాహిత్య సంగీత సమాఖ్య ఆధ్వర్యంలోజరిగిన ఆనాటి సభకు అధ్యక్షత వహించిన సినీ నటులు శ్రీ రావి కొండలరావు మాట్లాడుతూ – హాస్యం అజరామరమని ప్రతివారం సరసి వెలువరించే కార్టూన్లని చూసి ఆనందిస్తూ వుంటానన్నారు.

తదుపరి డాక్టర్ గురవారెడ్డి మాట్లాడుతూ– తను సంపాదించింది డబ్బు కాదని, కళారంగంలోని ఇటువంటి మిత్రులనే అని అంటూ తమ సహృదయాన్ని చాటుకున్నారు. బాపుగారుతరచు సరసి కార్టూన్ల గురించి తనతో గొప్పగా చెప్పేవారని, తను కూడా సరసి అభిమానిననీ అన్నారు. డాక్టర్లమీద సరసి వేసిన కొన్ని కార్టూన్లని ఉదహరించి, ప్రస్తుతం వెలువరించిన ఈ రెండు పుస్తకాలకే కాదు భవిష్యత్తులో సరసి వెలువరించే ఎన్ని కార్టూను పుస్తకాలకైనా తనే ఆర్థిక సహాయం చేస్తానని సభాముఖంగా ప్రకటించారు. తదుపరి వారి చేతులమీదుగా పుస్తకాల ఆవిష్కరణ జరిగింది.

ఆ రెండు సంకలనాలనూ సరసి తమ మాతృమూర్తి శ్రీమతి సరస్వతుల వెంకట రమణమ్మ గారికి, భార్య శ్రీమతి రత్నకు అంకితమిచ్చారు. వృద్ధాప్య కారణంగా సభకు రాలేకపోయిన తన తల్లిగారి స్థానంలో కృతిని స్వీకరించిన 'సరసి జనాభసోదరి' శ్రీమతి వారణాసి కాత్యాయిని మాట్లాడుతూ ఎంతోమంది పాఠకుల మన్ననలకు పాత్రుడైన తమ సోదరుడి విజయానికి తన గుండె నిండిపోయిందనీ, సభకి రాలేకపోయిన తమ తల్లి గారి మనస్సంతా సభవైపే ఉందన్నారు. తమ సోదరుడు కార్టూన్ వేసినా, కథ రాసినా తన తల్లి పక్కనే కూర్చుని ఆమెకు వినిపిస్తాడనీ అన్నారు. సరసి గారి శ్రీమతి రత్న మాట్లాడుతూ పుస్తకం అంకితం ఇస్తే ఏమి వస్తుందీ, ఏ నెక్లెస్సో వడ్డాణమో చేయిస్తే బావుండేది కదా అని ఒక కార్టూనిస్టు భార్యగా చమత్కరించారు.

నవ్య వారపత్రిక పూర్వ, ప్రస్తుత సంపాదకులు శ్రీ శ్రీరమణ, శ్రీ జగన్నాధశర్మలు మాట్లాడుతూ నవ్య వీక్లీ 'మనమీదోనన్రోయ్' శీర్షిక తలమానికం వంటిదనీ, వారం వారం అశేష పాఠకులు ఆదరిస్తున్న విజయవంతమైన కార్టూన్లు వెలువరిస్తున్న సరసి అభినందనీయుడన్నారు. తదుపరి సినీనటులు శ్రీ ఎల్.బి.శ్రీరామ్ మాట్లాడుతూ సరసి తన జీవితాన్ని అంతటినీ ప్రతిఫలించేలా ఒక కార్టూన్ వేశారని, ఆయనకున్న వేలాది అభిమానుల్లో తాను ప్రథముడనని అన్నారు.

రచయిత్రి డా॥చిల్లర భవానీదేవి పుస్తక సమీక్ష చేస్తూ అనునిత్యం మన దైనందిన జీవితంలో తారసిల్లే అనేక సంఘటనల్లోని హాస్యాన్ని పట్టుకుని సరసి వెలువరిస్తున్న కార్టూన్లు నిత్యం మనను వెంటాడుతుంటాయిని పేర్కొంటూ సంకలనాల్లోని అనేక కార్టూన్లని సభాసదుల నవ్వుల మధ్య గుర్తు చేసుకున్నారు. శ్రీ ఎం.వి.ఎస్.ప్రసాద్ వందన సమర్పణ చేశారు.

ఈ సందర్భంగా సరసి గారికి అమ్మనుడి పత్రిక తరపున అభినందనలు. 'అమ్మనుడి'లోనూ అంతకుముందు 'నడుస్తున్నచరిత్ర' లోనూ నిరంతరంగా సరసి గారి కార్టూన్లు పాఠకులను అలరించిన సంగతి మనకు తెలిసిందే. ❋

# హిందూపురంలో 'తపన' సాహిత్యవేదిక సభ

'తపన సాహిత్య వేదిక' హిందూపురం వారు ఈ నెల మంగళవారం 23/08/2016 న అక్షర కళాకారుల ఆత్మీయ మహా కలయికను 'తపన సాహిత్య వేదిక' వ్యవస్థాపకుడు సడ్లపల్లె చిదంబరరెడ్డి ఆధ్వర్యంలోపెద్ద ఎత్తున నిర్వహించారు.రాజకీయ చిత్రపటంలో హద్దులు వేరైనా మన అందరి తల్లిబాస ఒకటే.మనమందరం తెలుగుతల్లి అనే చెట్టుకు పూసిన పువ్వులం అంటూ తమిళనాడు,కర్ణాటక,ఆంధ్ర,తెలంగాణ ప్రాంతాలనుండి అనేకమంది రచయితలు,కళాకారులు ఈ సమావేశంలో పాల్గొన్నారు.స.వెం రమేశ్ అధ్యక్షతన 'కృష్ణగిరి రచయితల సంగం' హోసూరు వెలువరించిన 'రాగెన్నుల రాజ్జెం' మొరసునాడు–2 అనే పుస్తకాన్ని సింగమనేని నారాయణ,పూదోట.శౌరీలమ్మ విడుదల చేసినారు.పూదోట.శౌరీలు పుస్తకాన్ని సమీక్షిస్తూ, ఇప్పటి ఆంధ్ర, కర్ణాటక, తమిళనాడులలో వుండే ప్రాంతాలు చిత్తూరు,అనంతపురం జిల్లాలు,తమిళనాడులోని కృష్ణగిరి జిల్లాలో కొంత భాగం,కర్ణాటక లోని కోలారు,చిన్నబళ్లాపురం,బెంగళూరు నగర,గ్రామ ప్రాంతాలు కలిసిన తావే మొరసునాడు.ఈ తావు రచయితలు రాసిన బతుకువెతలే 'రాగెన్నుల రాజ్జెం' అన్నారు.

బెంగళూరు విశ్వవిద్యాలయ పరిశోధక విద్యార్థి డాక్టర్.నాగశేషు రాసిన 'వారధి' వ్యాససంకలనాన్ని తెలుగన్నడ రచయిత స.రఘునాధ గారు విడుదల చేయగా డాక్టర్ షమిల్లావు సమీక్షించారు. హోసూరు రచయిత నంద్యాల నారాయణరెడ్డి గారు రచించిన 'కంట తడి చిందిన తల్లి నుడి వేదన' పుస్తకాన్ని వి.ఆర్.రాసాని గారు విడుదల చేసినారు. రచయిత నారాయణరెడ్డి, తమిళనాడు ప్రభుత్వం తెలుగు భాషకు చేస్తున్న అన్యాయాన్ని, సంస్కృత, ఇంగ్లిష్ భాషలు మన తల్లినుడిని కలుషితం చేస్తున్న తీరును ప్రతినిత్యం గమనిస్తూ కడుపు మండి రాసుకున్న కవితలివి అన్నారు.

ఈ సభలో 'రాగెన్నుల రాజ్జెం' కతారచయితలు భారతి, కుప్పేనాగరాజ, చిదంబరరెడ్డి, చెన్నకేశవులు,మునిరాజు, బసవరాజు, ఆనంద, స.రఘునాధ, సుమ, బడిగొళ్ళ సత్యనారాయణ, మహేశ్ పాల్గొని సభకు వన్నె తెచ్చినారు. హోసూరు కృష్ణగిరి రచయితల సంగం వారు 'రాగెన్నుల రాజ్జెం' పుస్తకాన్ని కన్నడ రచయిత, తెలుగుబిడ్డ, కన్నడరాజ్య సాహిత్య అవార్డు పొందిన కుప్పేనాగరాజ గారికి అంకితమిచ్చి ఘనంగా సత్కరించారు. సంగీత కళాకారుడు సాంబశివుడు, ఈటీవి పాడుతా తీయగా స్థానిక కళాకారులు తమ పాటలతో సభికుల మనసులను రంజింప జేశారు. ఇంకా ఈ సభలో అనేకమంది పెద్దలు సింగమనేని, వి.ఆర్ రాసాని, చిలుకూరి దేవపుత్ర, కొండ్రెడ్డి పాల్గొన్నారు. ఈ సభను జయప్రదంచేయటంలో 'తపన సాహిత్య వేదిక' రథసారథులు చిదంబరరెడ్డి గారు డాక్టర్ అశ్వత్థ నారాయణ, డాక్టర్ సత్యనారాయణ గారు, రాజశేఖర్రెడ్డి గారు, డాక్టర్ నాగశేషు, కొండారెడ్డి గార్ల కృషి అభినందనీయం. చిదంబరరెడ్డి గారి సాహితీ విందుతో పాటు కుమారుడు కళానిధి–భార్గవిల పెళ్లివిందుతో వచ్చినవారంతా మహదానందభరితులైనారు.

## సమైక్యభారతి (విశాఖపట్టణం) వారి ఆధ్వర్యంలో రెండు సభలు

ఆహ్వానం

**ఆంధ్రవిశారద శ్రీ తాపీ ధర్మారావు గారి 129వ జయంతి సభ**

**విశాఖపట్టణంలో సెప్టెంబరు 19 సోమవారం**

విశాఖపట్టణం పౌరగ్రంథాలయం ఏసీ హాలులో (బి.వి.కె.కాలేజీ ఎదురుగా) 19-9-2016 సోమవారం సాయంత్రం 6 గంటలకు మహాసభ జరుగుతుంది. తాపీ ధర్మారావు గారి 129వ జయంతి సందర్భంగా జరిగే ఈ సభలో మహాకవి గురజాడ అప్పారావు, ప్రజాకవి వేమనల వలె సంస్కరణ భావాలను తన రచనల ద్వారా ప్రచారం చేసిన తాపీని విశ్లేషిస్తూ వక్తలు ప్రసంగిస్తారు. ఆచార్య శ్రీ చాగలమర్రి గోపాలస్వామి అధ్యక్షతన జరిగే ఈ సభలో ముఖ్యఅతిథిగా వాణిజ్య పన్నుల డిప్యూటీ కమీషనరు శ్రీ టి.శివశంకర్, విశిష్ట అతిథులుగా తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షులు డా॥సామల రమేష్‌బాబు, కవి, సాహిత్య విమర్శకులు శ్రీ రామతీర్థ, రచయిత, సాహిత్య విమర్శకులు ఆచార్య చందు సుబ్బారావు, గౌరవ అతిథిగా ఎం.వి.ఆర్, సి.ఎం.ఆర్ అధినేత శ్రీ మావూరి వెంకటరమణ పాల్గొంటారు. జి.వి.ఎం.సి.విశాఖపట్టణం ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, కవి శ్రీ కిల్లాన దిలీప్ సభా ప్రారంభకులుగా, ప్రత్యేక ఆహ్వానితులుగా శ్రీ రాజాచిన్నబాబు (గౌరవాధ్యక్షులు–సమైక్యభారతి), విశ్రాంత సీనియర్ ఇ.ఇ.ఎస్.శ్రీ సి.ఎస్.రావు పాల్గొంటారు.

ఆహ్వానం

**మహాకవి గురజాడ అప్పారావు గారి 155వ జయంతి సభ**

**విజయవాడలో సెప్టెంబరు 21 బుధవారం**

విజయవాడలో 21-9-2016 బుధవారం సా.6 గంటలకు గాంధీనగరంలోని హనుమంతరాయ గ్రంథాలయంలో మహాకవి గురజాడ జయంతి సందర్భంగా మహాసభ జరుగుతుంది. ఈ సభలో ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఉపసభాపతి గౌ॥ శ్రీ మండలి బుద్ధప్రసాద్ ముఖ్యఅతిథిగా పాల్గొంటారు. డా॥సామల రమేష్‌బాబు అధ్యక్షతన జరిగే ఈ సభలో విశిష్ట అతిథులుగా పద్మశ్రీ తుర్లపాటి కుటుంబరావు, విమర్శకుడు, వక్త శ్రీ ఎం.సి.దాస్, రచయిత, దర్శకులు శ్రీ అనంత హృదయరాజు పాల్గొంటారు.

పై రెండు సభల్లోనూ తాపీ ధర్మారావు గారి మనుమరాలు శ్రీమతి సుజాతాషా, గురజాడ అప్పారావు గారి మునిమనుమడు డా॥మోపిదేవి విజయగోపాల్, జాలాది కుమార్తె డా॥ జాలాది విజయ గార్లకు సన్మానం జరుగుతుంది.

**పై రెండు కార్యక్రమాలను సమైక్యభారతి కన్వీనర్ శ్రీ పి.కన్నయ్యగారు ప్రత్యేక శ్రద్ధతో నిర్వహిస్తున్నారు. వారి సెల్‌ఫోన్ నెం.78937 64057. ఆసక్తి గల ప్రజలందరికీ సాదర ఆహ్వానం.**






**బరంపురం (ఒడిసా)లో తెలుగు భాషాదినోత్సవం**

29-8-2016న తెలుగు భాషా దినోత్సవం-గిడుగు జయంతి సందర్భంగా ఒడిసాలోని బరంపురంలో -తెలుగు బడులలో చదువుతున్న పిల్లలతో వేమన పద్యాలను చదివించి, వారందరికీ బహుమతులు, అభినందనపత్రం ఇచ్చారు. ప్రముఖ రచయితలు శ్రీమతి తుర్లపాటి రాజేశ్వరి, రఘునాథవర్మ, సేతుపతి ఆదినారాయణ తదితరులు పాల్గొని ప్రసంగించారు

## హిందూపురంలో నెలనెలా కథాగోష్ఠి

యువకథా రచయిత(త్రు)లను ప్రోత్సహించే ఉద్దేశంతో హిందూపురం శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల సాహితీసంస్థ 2016 సెప్టెంబరు నుండి 'నెలనెలా కథాగోష్ఠి'ని ప్రతినెల రెండవ, నాల్గవ ఆదివారాలలో స్థానిక జిల్లా శాఖాగ్రంథాలయ భవనంలో నిర్వ హిస్తున్నారు. ఈ కథాగోష్ఠికి రచయితలు తాము 6-8 పుటల మధ్య రాసిన కథలను మాత్రమే రెండు జిరాక్స్ కాపీలతో బాటు తగిన తపాల బిళ్ళలు గల రెండు కవర్లను కూడా జతపరచి పంపాలి. గోష్ఠిలో చర్చించబడిన కథలపై తగిన సలహాలు సూచనలతోబాటు, ఒక ప్రముఖ కథా రచయిత యొక్క అభిప్రాయం కూడా పంప బడుతుంది. ఈ కథలను సంపుటిగా ప్రచురించే ఆలోచన వుంది. ఆసక్తి గలవారు ఈ క్రింది చిరునామాకు కథలు పంపవచ్చు. వివ రాలకు 9493271620తో సంప్రదించవచ్చుని, సంస్థ మేనేజింగ్ ఎడిటర్ కల్లూరు రాఘవేంద్రరావుగారు తెలియజేస్తున్నారు. చిరు నామా: నెలనెలా కథాగోష్ఠి, శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల, 26-4-982, త్యాగరాజ నగర్, హిందూపురం-515 201.

## అంపశయ్య నవీన్ లిటరరీ ట్రస్టు, వరంగల్

కొత్తగా నవలలు రాసే రచయితలను ప్రోత్సహించాలనే ఉద్దే శంతో వారు రచించే మొదటి నవలలకు మొదటి బహుమతిగా రు.10,000/లు, రెండవ బహుమతిగా రు.5,000/-లు పారితో షికం ఇవ్వాలని ట్రస్టు నిర్ణయించింది. ప్రతి యేట డిసెంబరు 24-శ్రీ నవీన్ జన్మదినోత్సవ కార్యక్రమం సందర్భంగా జరిగే కార్యక్రమంలో ఈ పారితోషికాన్ని ఇస్తారు. నవలా రచయితలు తమ మొదటి నవలని ఈ క్రింది చిరునామాకు నాలుగు ప్రతులు చొప్పున అక్టోబరు 31లోపుగా పంపాలి. అన్ని వివరాలకు డి.స్వప్న, కార్యదర్శి, అంప శయ్య నవీన్ లిటరరీ ట్రస్టు, 2-7-71, ఎక్సయిజ్ కాలనీ, హన్మ కొండ, వరంగల్- 506 001. ఫోన్ : 0870-2456458.

**సృజనకు విత్తు సొంతభాష...**
**రచనకు సత్తువ ప్రజల భాష**



ఆగస్టు 23న హైదరాబాదులో జరిగిన ఒక సభలో సామాజిక తత్వవేత్త శ్రీ బి.యస్.రాములు రచించిన 'దారి ఎటు?' పుస్తకావిష్కరణ దృశ్యం. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ శ్రీ ఎస్.వి.సత్యనారాయణ పుస్తకాన్ని ఆవిష్కరించారు.




**తెనాలి (గుంటూరుజిల్లా)లో తెలుగు భాషాదినోత్సవం**

తెనాలిలోని సుల్తానాబాద్ కుమార్ కాలనీలో శ్రీ సరస్వతీ శిశుమందిర్‌లో తెలుగు భాషోద్యమ సమాఖ్య ఆధ్వర్యంలో తెలుగు భాషాదినోత్సవాన్ని నిర్వహించారు. ముఖ్య అతిథిగా పాల్గొన్న కుమార్ పంప్స్ అధినేత శ్రీ కొత్త సుబ్రహ్మణ్యం మాతృభాషగా తెలుగును కాపాడుకొని అభివృద్ధి చేసుకోవాలన్నారు. విశ్రాంత లెక్చరర్ శ్రీ కోడూరు మల్లికార్జునరావు గిడుగు కృషి గురించిన విశేషాలను తెలియజేశారు. కాకతీయ కో ఆపరేటివ్ బ్యాంక్ ఛైర్మన్ శ్రీ బి.యల్.కాంతారావు, ఉపాధ్యాయిని ధనలక్ష్మి, బొల్లిముంత కృష్ణ తదితరులు ప్రసంగించారు.

జనవాణి

# మేధావులు, ఉద్యమకారులు జాతిని ముందుకు నడపాలి

ఎవరైనా తెలుగు రాజకీయ నాయకులు వరసగా మూడు వాక్యాలను సరిగా మాట్లాడగలరేమో చూడండి పట్టుబట్టి. మీ ఆశ నిరాశ అవుతుంది. తమిళనాడులో ఒక తాలూకా స్థాయి రాజకీయ నాయకుడు కూడా ఆయన ఏ పార్టీవాడైనా ఎలా మాట్లాడుతాడో వినండి. మీకు తమిళం కొద్దిగా వచ్చినా మీరు కూడా ఉద్రేకంతో ఊగిపోతారు. మాట్లాడేటప్పుడు ఉపమానాలు అన్నీ కవ్వించే, నవ్వించే మాటలు ఉంటాయి. కొంతగానైనా తెలుగు నా తల్లి భాష అనుకొనే తెలంగాణ ప్రాంతంలోని నర్సిరెడ్డి లాంటి వారు కొద్దిమంది తప్ప మిగిలిన వారి ఉపన్యాసాలను వినే పరిస్థితి లేకుండా పోయింది ఇక్కడ.

తమిళనాడు శాసనసభలోని సభ్యుల పేర్లను పట్టుబట్టి తమిళపు పేర్లుగా మారుస్తారు. అక్కడి బళ్ళల్లో పిల్లల పేర్లు మార్చుకుంటే స్కాలర్ షిప్పులను ఇస్తారు. సినిమా పేరు తమిళంలో లేకపోతే దానిని ఆడనివ్వరు. తెలుగు సినిమాలకు మాత్రం మనం తెలుగు పేర్లు లేకుండా చూస్తాం. తమిళంలో కోచ్చయాడన్ వుంటే తెలుగులో విక్రమ సింహ ఉంటుంది. ఎందిరన్ ఇక్కడ రోబో అవుతుంది. తమిళంలో 'కబాలి' తెలుగులో 'కపాలి' కావాలి. కాని తమిళ పేరుతోనే విడుదల చేశారు.

ప్రతి ఊర్లో నలుగురు ఝాన్సీరాణులు ఉంటారు మన దగ్గర. తీరా చూస్తే ఆమె ఒకప్పుడు ఇప్పటి మధ్యప్రదేశ్ ప్రాంతంలో పరిపాలించింది కొద్ది రోజులు మాత్రమే. పేరును చాలా మోజుగా పెట్టుకొంటాము. తెలుగు రాణి'రుద్రమదేవి' దాదాపు వేయి ఏండ్ల క్రింద 50 ఏండ్లు పరిపాలించింది. 83వ ఏట గుర్రం మీద శత్రువుతో పోరాడుతూ చనిపోయింది. అసలు ఆ వయసులో గుర్రం మీద స్వారీ చేయగలిగిన వారు ఇప్పుడైనా ఎంతమంది ఉంటారు? ప్రపంచ చరిత్రలోనే ఆమెతో పోల్చదగిన వ్యక్తులు కనపడరు. కాని ఆమె పేరు మనం పెట్టుకోము, వేరే వారు పెట్టుకోరు. కారణం?!

మన ఆత్మన్యూనతాభావం ఎంతవరకు చేరుకున్నదంటే మన పేర్లు మంచివి కావు. ఇతరుల పేర్లు మాత్రం మంచివి అనుకొంటున్నాము. అందుకని మన దగ్గర అజయ ముఖర్జీలు, బెనర్జీలు, శివాజీలు కనపడతాయి. ఇవి కొంత నయం. చాలాసార్లు ఇతర భాష నాయకుడి ఇంటిపేరు, తండ్రి పేరు, చిన్నప్పటి ముద్దు పేరు, సరే ఆయన పేరు కూడా పెట్టుకుంటాం. అందుకనే మన దగ్గర బాబు రాజేంద్ర ప్రసాద్‌లు, బాలగంగాధరతిలక్‌లు, మోహన్‌దాస్ కరంచంద్‌గాంధీలు కనపడతారు. గొప్ప వారి పేర్లు పెట్టుకోవడంలో తప్పు లేదు కానీ, అందులో కూడా ఇచ్చిపుచ్చుకోవడం వుండాలి. అలా లేకపోతే మనది తక్కువ రకం జాతి అనీ, వేరే వారిది ఎక్కువరకం జాతి అనీ మనమూ, వారూ ఏ మాత్రం అనుమానం లేని నిర్ధారణకు వచ్చినట్లు లెక్క. ఉత్తరాదిన ఎవరైనా కృష్ణదేవరాయలు, అల్లూరి సీతారామరాజు, జాతీయజెండాను తయారు చేసిన పింగళి వెంకయ్య, కనీసం వెంకటేశ్వరస్వామి పేరయినా పెట్టుకొంటారా? తిరుపతి వేలుపు వేంకటేశ్వరుడు, శ్రీనివాసుడు అని పిల్చే బదులు వారిదైన మాట 'బాలాజీ'తో పిలిచి మురిసిపోతుంటాము.

ఇంత న్యూనతాభావంతో ఉన్న వారిని సంస్కరించి ఈ జాతిని ముందుకు నడుపవలసిన అవసరం ఇప్పుడు గట్టిగా ఉన్నది. దీనిని గమనించి తెలుగు మేధావులు, ఉద్యమకారులు తగిన కార్యాచరణను రూపొందించి ముందుకు సాగాలి.

**–పారుపల్లి కోదండరామయ్య,** హైదరాబాదు, 98496 62305

## అమ్మభాష ఆవశ్యకత

'శిశువు అమ్మ దగ్గరే గదా తొలి పాఠాన్ని నేర్చుకోవటం' అన్నాడు మహాత్మాగాంధీ. 'ఆంగ్లాన్ని ద్వితీయ భాషగా నేర్పండి, అమ్మభాషలో ఆద్యంతం విద్యగరపాలన్నా'డు కవీంద్రుడు. 'స్థానిక భాషకు ప్రథమస్థానంతో ఉపాధ్యాయులకు శిక్షణ ఇస్తే పౌరులు దేశభక్తులవుతారు' అని అబ్దుల్ కలాంజీ అభిలాష.

అమ్మనుడిపై మేధావుల నుడులను జులై మాస పత్రికలో ఉటంకించినా వాటిని పాటించేందుకు చదివి ఆచరించేందుకు ఏలికలకు చెవులున్నయ్యా? ఆచరణలేని మాటల మంత్రాలతో పరిపూర్ణత చెందుతుందా? చెవిటి వాని ముందు శంఖం మోత వినపడదు కదా! అయినా జనం విజృంభిస్తే గొంతెత్తి నినదిస్తే భాషాభిమానం ప్రళయరాగమై గద్దెనెక్కిన వాళ్ళను గడగడలాడిస్తుంది.

**–రామిశెట్టి రోశయ్య,** మధిర, 93902 79127

## భద్రపరచుకొనదగినవి

'అమ్మనుడి' సంచికలు చిరకాలం భద్రపరచుకొనదగినవి. అందుకని మన్నిక గల కాగితం మీద ముద్రణ చేయిస్తే– సంవత్సరాల వారీగా బైండు చేయించుకొనటం వీలవుతుంది. కొంతముద్రణ వ్యయం పెరగవచ్చు. శ్రద్ధ గలవారికి అది భారం కాదు. 'అమ్మనుడి' పాఠకులందరు ప్రత్యేక శ్రద్ధ గలవారే.

హైదరాబాదులో జరిగిన ద్రావిడ భాషాసదస్సులో తెలుగుపై ప్రత్యేకంగా సమర్పించబడ్డ ఆ 20 పరిశోధన పత్రాలను – కనీసం ప్రధాన సారాంశమయినా మన పత్రిక ద్వారా పాఠకులకు అందించటం సాధ్యమయితే ఆ మేలు చేసి పెట్టండి. తెలుగుకు మంగోలియా భాషకు సంబంధాలున్నాయనటం ఆసక్తి కలిగిస్తున్నది.

గ్రంథ సమీక్షలు మనస్ఫూర్తిగా తృప్తిగా ఉంటున్నాయి. పూర్తిగా పుస్తకాన్ని చదవాలని పాఠకునికి ప్రేరణ కలిగించటం–దాని విలువను కొంత అంచనా కట్టటం సమీక్షల పరమార్థం. ఆ లక్ష్యం అమ్మనుడి సమీక్షలలో జరుగుతున్నది. గతంలో భారతి, జయంతి, నవభారతి వంటి సాహిత్యంలో ప్రధానశ్రేణి పత్రికలు ఈ కర్తవ్యం నిర్వహించేవి. ఇపుడు అమ్మనుడి చేస్తున్నది.

**–డా॥వావిలాల సుబ్బారావు,** అమరావతి

# అశోకుని తరువాత అంతటివాడు గౌతమీపుత్ర శాతకర్ణి




మౌర్య చక్రవర్తి అశోకుడు నేటి భారతదేశమూ, వాయువ్యాన, ఇంకా పశ్చిమ దిశగానూ గల భూభాగాన్ని కలిపిన జంబూద్వీపాన్ని పరిపాలించాడు. భారతదేశ చరిత్రలో అంతటి విశాల సామ్రాజ్యాన్ని పాలించిన చక్రవర్తి మరొకరు లేరు. అశోకుని తరువాత అఖండ జంబూద్వీపం చిన్న చిన్న రాజ్యాలుగా విడిపోయి, స్థానిక పాలకులు పుట్టుకొచ్చారు. కొంతకాల వ్యవధి ఉన్నా, అలా పుట్టుకొచ్చిన వాళ్ళలో శుంగులు, శాతవాహన ముందరి తెలుగు రాజులు, శాతవాహనులు, కుషాణులు_ఇండోబాక్ట్రియన్ రాజులు ముఖ్యులు. దక్షిణాదిన క్రీ.పూ.1 నుంచి క్రీ.శ.3 వరకూ పాలించిన శాతవాహనులు అశోకుని సామ్రాజ్యంలో సగానికి పైగా పాలించి, చిన్నచిన్న రాజ్యాలను, ఒక సామ్రాజ్యంగా తీర్చి దిద్దారు.

ఛిముక శాతవాహనునితో ప్రారంభమైన వారి పాలన, తొలుత తెలంగాణా, తరువాత మహారాష్ట్ర, కర్ణాటకలకు విస్తరించి, మొదటి శాతకర్ణి (క్రీ.పూ.10–క్రీ.శ.45) కాలానికి మరింత విస్తృతమై దక్షిణాపథం కూడా వారి భూభాగంలో చేరింది. క్రీ.శ.60 నుంచి క్రీ.శ.90 దాకా పాలించిన గౌతమీపుత్ర శాతకర్ణి, కర్ణాటక, మహారాష్ట్రలు గల పశ్చిమ భారతాన్ని, మధ్యప్రదేశ్, చత్తీస్‌ఘడ్, ఉత్తరాంచల్ వరకూ గల ఉత్తరాపథాన్ని, గుజరాత్, రాజస్థాన్‌లు కలిసిన వాయువ్య భారతాన్ని, తెలంగాణా, ఆంధ్రప్రదేశ్, తమిళనాడులు గల దక్షిణ భారతాన్ని జయించాడు. మూడు సముద్రాల పర్యంతం తన ఏలుబడిలోకి తెచ్చుకొని **తిసముద్రతోయ పీతవాహనస్య** అన్న బిరుదును ధరించాడు. కయ్యానికి కాలుదువ్విన శత్రురాజులైన శకులు, యవనులు, పల్లవులను జయించి, ముప్పై ఏళ్లపాటు ప్రజారంజక పాలననందించాడు.

పరిపాలనా సౌలభ్యం కోసం, రాజధానిని ధాన్యకటకానికి మార్చి, తెలుగు వారి కీర్తిపతాకను రెపరెపలాడించాడు. మొట్టమొదటిసారిగా మాతృసామ్య వ్యవస్థకు సాధికారతను కల్పించి, తన బొమ్మ వున్న వెండి నాణాలను చలామణి లోకి తెచ్చాడు. తిరుగులేని నాయకునిగా ఎదిగిన గౌతమీపుత్ర శాతకర్ణి గుణగణాలను కీర్తిస్తూ, తల్లి గౌతమి బలసిరి, కొడుకు వాసిష్టీపుత్ర పులుమావి కలిసి వేయించిన నాసిక్ శాసనం అతన్ని **అప్రతిహత చక్రవర్తిగా, ఏకశూరునిగా, ఏకధనుర్ధనునిగా, ఏకబ్రాహ్మణునిగా** పేర్కొంటుంది.

శాతవాహనుల గురించి గత రెండు వందల ఏళ్ళుగా అనేక పరిశోధనలు జరిగాయి. వ్యాసాలొచ్చాయి. పుస్తకాలొచ్చాయి. మారేమండ రామారావు గారి **శాతవాహన సంచిక** నుంచి, అజయ్‌మిత్ర శాస్త్రి గారి **ది శాతవాహనాస్ అండ్ వెస్టర్న్ క్షాత్రపాస్**, పీవీ పరబ్రహ్మశాస్త్రి గారి **న్యూలైట్ ఆన్ శాతవాహనా ఎపోఖ్**, బి.యస్.ఎల్. హనుమంతరావు గారి **ది శాతవాహనాస్**, ఈమని శివనాగిరెడ్డి గారి 'తెలంగాణాలో శాతవాహన వారసత్వం' వరకూ ఎన్నో పుస్తకాలొచ్చాయి. అయితే అవన్నీ శాతవాహన వంశ చరిత్రకు ప్రాధాన్యతనిచ్చాయి. శాసనాలు, కట్టడాలు, నాణాలను విస్తృతంగా పరిశీలించి, మనం మరచిపోయిన మహాయోధుడు గౌతమీపుత్ర శాతకర్ణి గురించి– చరిత్రకారుడు, ప్రముఖ పురావస్తు పరిశోధకుడు, బౌద్ధ రచయిత అయిన డా॥ఈమని శివనాగిరెడ్డి ఇప్పటివరకూ అందుబాటులో వున్న చారిత్రక ఆధారాలనన్నింటినీ వడపోసి, శాతవాహన చక్రవర్తుల్లో మేటి అయిన గౌతమీపుత్ర శాతకర్ణిపై ఒక ప్రామాణిక పరిశోధక గ్రంథాన్ని రచించారు. శాతవాహన వంశ పుట్టుపూర్వోత్తరాలతో పాటు, గౌతమీపుత్ర శాతకర్ణి ఔన్నత్యం, దిగ్విజయ యాత్రలు, శకరాజులతో యుద్ధాలు, పాలనా యంత్రాంగం, శిల్పకళ మొదలైన అంశాలను కళ్ళముందు కదలాడుతున్నట్లుగా రచించిన ఈ పుస్తకం గౌతమీపుత్ర శాతకర్ణిపై వెలువడిన మొదటి తెలుగు పుస్తకం. చరిత్ర పరిశోధకులు, అధ్యాపకులతో పాటు తెలుగువారంతా చదవాల్సిన పుస్తకం.

**అప్రతిహత శాతవాహన చక్రవర్తి గౌతమీపుత్ర శాతకర్ణి**, రచయిత: **అన్నపూర్ణపుత్ర ఈమని శివనాగిరెడ్డి**–స్థపతి, 80 పుటలు (మల్టీకలర్ ఆర్ట్ పేపర్), వెల రు. 99/లు. ప్రతులకు : యస్.ఆర్.బుక్‌లింక్స్, 31–13–18, దానయ్య వీధి, మాచవరం, విజయవాడ–4. ఫోన్ : 0866–2421052, మరియు అన్ని పుస్తక కేంద్రాలు.

**–డా॥కె.శ్రీనివాసులు,** 98497 09146

## స్పందనను వ్రాయండి

**'అమ్మనుడి'**లో రచనలపై
మీ స్పందనను వ్రాసి పంపండి!
సంపాదకుడు
'అమ్మనుడి', జి–2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ
కళాశాల వీధి, మాచవరం, విజయవాడ–520 004.

ఇ–మెయిల్ : *editorammanudi@gmail.com*

## 'అమ్మనుడి' లభించుచోట్లు

నవోదయ బుక్ హౌస్, ఆర్యసమాజ్ భవనం ఎదురుగా,
కాచిగుడా. **హైదరాబాదు – 500 027.**
ఫోన్ :040–24652387

మైత్రీ బుక్ హౌస్, జలీల్ వీధి, కార్ల్‌మార్క్స్ రోడ్డు (ఏలూరు రోడ్డు) **విజయవాడ – 520 002**. ఫోన్ : 9866211995

మణి బుక్‌స్టాల్, షాప్ నెం.58, సండేమార్కెట్,
**నెల్లూరు**–1. ఫోన్:7386223538.

## సమీక్షలు

ప్రముఖసాహిత్య ఉద్యమకారులు, కథా రచయిత

# వేదగిరి రాంబాబు ఇటీవలి రచనలు

### ఆబాలగోపాలం



సాహితీరంగంలో బాల సాహిత్యానికి ప్రత్యేకమైన స్థానం వుంది. ఇది బాలలను సాహిత్యం దిక్కుకు మరల్చటానికి ఎంతో ఉపయోగపడుతుంది. వారి మానసిక వికాసానికి బాగా దోహదపడుతుంది. వైజ్ఞానికంగా ఎదగడానికి ఉపకరిస్తుంది. సాధారణంగా బాలల కొరకు పెద్దలు సృజించిన సాహిత్యానికి ఇందులో ప్రాధాన్యం వుంటుంది. 19 వ్యాసాలతో కూడిన గ్రంథం- **ఆబాలగోపాలం.** రచయిత : డా॥వేదగిరి రాంబాబు, పుటలు : 128, వెల : రు.50/

### బుజ్జికథలు, విజయచంద్ర





"అక్షరంలో అణుశక్తి దాగుంది. ఆ శక్తిని మనమూ ఉపయోగించుకుందాం. మన పిల్లలూ తెలుగువాళ్ళుగా ఉపయోగించు కొనేట్లు చేద్దాం" అనే ఆలోచనతో తన కుమార్తెకు చెప్పిన కథలు, మనుమ రాలుకు చెప్పిన నవలా రూపవిషయాలను డా॥వేదగిరి రాంబాబు గారు బుజ్జి కథలు, విజయ చంద్ర నవలను ప్రచురించారు. **బుజ్జికథలు.** పుటలు : 56, వెల : రు.30/-లు, **విజయచంద్ర.** పుటలు -36, వెల : రు.25/-లు.

### వంద కథానికలు



ఆధునిక సాహిత్యంలో గురజాడ పేరు విననివారు, గురజాడ సాహిత్యాన్ని చదవని వారు వుండరు. అలాగే గురజాడ స్ఫూర్తితో సాహితీరంగంలో ప్రసిద్ధికెక్కినవారు డాక్టర్ వేదగిరి రాంబాబు గారు. కవులకు రచయితలకు శతజయంతులు జరపటం ఆనవాయితీ. గురజాడ వారి శతవర్ధంతిని దృష్టిలో పెట్టుకొని కథా సాహిత్యంలో జల్లెడపట్టి మేలైన వంద కథానికలు బయటకు తీసి వారికి నివాళిగా సమర్పించిన గ్రంథం. **'తప్పక చదవాల్సిన వంద కథానికలు'** రచయిత : డా॥వేదగిరి రాంబాబు, పుటలు : 226, వెల : రు.250/-లు.

పై నాలుగు పుస్తకాల ప్రతులకు : వేదగిరి కమ్యూనికేషన్స్, బ్లాక్ -6, ప్లాట్-10, హెచ్.ఐ.జి-1, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్-44, సెల్: 93913 43916

**-వి.సింగారావు,** 93930 15584

# ఎన్కటి తెలంగాణ-ఒక రూపం-మరికొన్ని ముచ్చెట్లు




గతంలో- అంటే 70 సంవత్సరాల క్రితం తెలంగాణ ఏ విధంగా ఉండేదో, ఈ తరానికి తెలియజేసే పుస్తకం- శ్రీ కంచర్ల సత్యపాల్‌రెడ్డి రాసిన ఎన్కటి తెలంగాణ-ఒక రూపం-మరికొన్ని ముచ్చెట్లు'. తాను రచయిత కవి కాకపోయినా తెలంగాణ అంటే అభిమానం, తెలుగు అంటే ఇష్టంతో ఈ పుస్తకం రాసినట్టు ముందుమాటలో చెప్పటం, రచయిత నిజాయితీకి నిదర్శనం. ఒకప్పుడు హైదరాబాద్, సికింద్రాబాద్ ఎలా ఉండేవి, ఎక్కడ ఏ నిర్మాలుండేవి, జిల్లాలలో ఊళ్ళలో ఏ వృత్తులు ఎలా ఉండేవి, వ్యవస్థలు ప్రజల బతుకులు, పండుగలు, భాష, పదాలు...యిలా ఎన్నో విషయాలను సంక్షిప్తంగా తెలియజేశారు. తెలంగాణ మాటలు, పాటలు, ఆటలు, ఆచారాలు, పెత్తందార్లు, వెట్టిచాకిరీ, గ్రామపాలన, కుల వర్గ వ్యవస్థ, ఊర్ల పేర్లు, తిండి, దుస్తులు, సొమ్ములు, పెండ్లిండ్లు, ఆచారాలు- ఈ విధంగా ఎన్నో ముచ్చట్లను ఈ పుస్తకం ద్వారా తెలుసుకోవచ్చు.

పై సమాచారంతో పాటుగా రచయిత తాను గాఢంగా గౌరవించే ఇద్దరు మహనీయులు -మహాకవి శ్రీశ్రీ, తెలంగాణ జాతిపిత ప్రొ॥జయశంకర్‌లపై రాసిన రెండు కవితలున్నాయి. 'నాకు నచ్చిన అందరు మెచ్చిన మా రామయ్యశాస్త్రి సారు' అంటూ శ్రీ చుక్కా రామయ్య గారిని కీర్తిస్తూ రాసిన వ్యాసం; తెలంగాణ ఉద్యమం ఉధృతంగా సాగుతున్నప్పుడు తెలంగాణ ఆత్మచప్పుడును తెలియజేసే 'ఒక సిన్నోని కథ', నడుస్తున్న చరిత్రలో అచ్చయిన 'మనవాళ్ళు', 'తెలంగాణ తెలుగువారు ఉదారులా?' అనే వ్యాసాలున్నాయి. 'ఓ సిన్నోని కత' సంకేత పాత్రలతో రాసిన కథానిక. అది తెలంగాణ ప్రాంతానికి ఎన్ని విధాలుగా అన్యాయం జరిగిందో తెలియజేస్తుంది. అయితే శ్రీ చుక్కా రామయ్య, నగ్నముని రాసిన ముందుమాటలు ఈ పుస్తకానికి గుర్తింపునీ, ప్రత్యేకతను కలిగించేలా ఉన్నాయి. చరిత్రకారులకు, భాషా పరిశోధకులకు, గ్రంథపరామర్శల అవసరాలకు-ముఖ్యంగా ఈ తరం తెలంగాణా వారికి ఎంతో ఉపయోగపడుతుంది- ఈ పుస్తకం.

**-ఎమ్.వి.శాస్త్రి,** 94413 42999

Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL/2015/62362

# అందరికీ ఆహ్వానం





ఉత్తమ పాత్రికేయుడు
కథా రచయిత, సాహితీ విమర్శకుడు

## శ్రీ ఆర్.ఎం.ఉమామహేశ్వరరావుకు
## తాపీ ధర్మారావు పురస్కారం
### 2016 అక్టోబరు నెలలో- తిరుపతిలో

తాపీ ధర్మారావు పురస్కారాన్ని ఈ ఏడాది పాత్రికేయుడు శ్రీ ఆర్.ఎం.ఉమామహేశ్వరరావుకు ఇవ్వాలని నిర్ణయమైంది. పురస్కార ప్రదానోత్సవం తిరుపతిలో 2016 అక్టోబరు నెలలో జరుగుతుంది. తేదీ, సమయం, వేదిక ఇంకా నిర్ణయం కాలేదు. వాటితో సహా కార్యక్రమ వివరాలను అక్టోబరు నెల 'అమ్మనుడి'లో ప్రకటించగలము.

శ్రీ ఉమామహేశ్వరరావు 1986 నుండి పాత్రికేయ జీవితం, సంపాదకత్వ బాధ్యతలలో వివిధ స్థాయిలలో పనిచేసి, ఇప్పుడు రాయలసీమ, నెల్లూరు జిల్లాల పరిధిలో ఎబిఎన్ ఆంధ్రజ్యోతి టీవీ, ఆంధ్రజ్యోతి దినపత్రికల పర్యవేక్షణ బాధ్యతల్లో వున్నారు.

నెల్లూరు జిల్లాలో సారా వ్యతిరేక ఉద్యమ సందర్భంలో ఆంధ్రజ్యోతిలో వరుసగా వ్రాసిన 'సారా కథలు', ప్రత్యేక ఆర్థిక మండళ్ళ ప్రభావంపైనా, వాటివల్ల ఏర్పడిన విధ్వంసంపైనా కథనాలు, నక్సలైట్ల అజ్ఞాత జీవనశైలిపై కథనాలు, వారితో ఇంటర్వ్యూలు, తెలుగు మూలాలను వెతుక్కుంటూ తెలుగువాణి సంస్థతో కలిసి శ్రీలంక, బంగ్లాదేశ్‌లలో పర్యటించి అక్కడి తెలుగుజాతి ప్రజలను గురించి వ్రాసిన కథనాలు జర్నలిస్టుగా ఉమామహేశ్వరరావు ప్రత్యేకతను వెల్లడిస్తాయి. ఆయన వ్రాసిన కథలు, సాహితీ ప్రముఖులతో ఇంటర్వ్యూలు, సంపాదకత్వం వహించిన కథా సంపుటాలు విశిష్టమైనవి. ఉత్తమ గ్రామీణ తెలుగు జర్నలిస్టుగా 2007లో పురస్కారాన్ని పొందారు. ఉత్తమ జర్నలిస్టుగా 2015లో ప్రభుత్వ పురస్కారాన్ని పొందారు.

తాపీవారి అభిమానులు, కవులు, రచయితలు, పాత్రికేయులు, సామాజిక ఉద్యమకారులు, తెలుగు భాషాభిమానులు సభలో పాల్గొనవలసిందిగా ఆహ్వానిస్తున్నాము.

**తాపీ ధర్మారావు వేదిక**

వివరాలకు: **డా॥ సామల రమేష్‌బాబు** - 9848016136

---

### తాపీ ధర్మారావు పురస్కారాన్ని పొందినవారు



డా॥ఎన్.వేణుగోపాల్
2009



డా॥కె.శ్రీనివాస్
2011



శ్రీ టంకశాల అశోక్
2013



శ్రీ జి.శ్రీరామమూర్తి
2014



శ్రీ.ఎ.కృష్ణారావు
2015

